# చతుర

మే 2007

రూ. 7/-

ద్వితీయ బహుమతి పొందిన

డాక్టర్ వి. చంద్రశేఖరరావు నవల

## ఆకుపచ్చని గాయం





## నెమళ్ళు నేర్పిన ట్రిక్కులివే...

మగనెమళ్లు పురివిప్పి ఆడుతూ, ఆడనెమళ్లను ఆకర్షించినట్లే తూర్పు ఆస్ట్రేలియా తీరప్రాంత అడవుల్లోని ఈ లైర్‌పక్షి కూడా ఇలా పురివిప్పి రకరకాల విన్యాసాలతో పెంటిపక్షి మనసు దోచుకుంటుంది. ఈ సందర్భంగా పెద్దఎత్తున ఇది ఇతర పక్షుల ధ్వనులను అనుకరిస్తూ గానాబజానా నిర్వహిస్తుంది. ఇందుకోసం పొడవాటి గోళ్లతో నేలను తవ్వి, ఆ మట్టితో చిన్న సైజు వేదికను తయారుచేసుకుని దానిమీద ఇలా ఆటా పాటా మొదలెడుతుంది. దాని విన్యాసాలకు మోజుపడి దరికి చేరిన ఆడపక్షితో సరసాలు ప్రారంభిస్తుంది.



నవ్య నవలా వేదిక

# చతుర

సంపుటి : 30 | సంచిక 4
మే 2007 | 352 వ సంచిక



## ఈ నెల నవల

అడవి బిడ్డల కష్టాల కడలిని మథించి చైతన్యం కోసం ఓ యువకుడు సాగించిన పోరాటమే

డాక్టర్ వి. చంద్రశేఖరరావు నవల

## ఆకుపచ్చని గాయం

10వ పేజీలో



బొమ్మలు: **ఆనంద్**

హెల్త్ బిట్స్ : ఎం. వెంకటేశ్వరరావు

ప్రపంచ ప్రసిద్ధ నవలల పరిచయ వేదిక

# కాలాతీతం

1874

# ఫార్ ఫ్రం ది మాడింగ్ క్రౌడ్

'మిల్ ఆన్ ది ఫ్లాస్' తర్వాత పధ్నాలుగేళ్లకు అచ్చయింది ఈ నవల. కార్న్‌హిల్ మ్యాగజైన్‌లో సీరియల్‌గా వచ్చినప్పుడు అందరూ ఇది జార్జి ఎలియట్ రాసిందనే అనుకున్నారు. అదే గ్రామీణ వాతావరణం. శతాబ్దాలుగా మారని జీవన పద్ధతులు, ఆచారాలు. పారిశ్రామిక ప్రగతికి దూరంగా, విసిరేసినట్టున్న పల్లెలు. రైల్వే లైన్లు ఇంకా విస్తరించలేదు. వెదర్‌బరీ ఒక కుగ్రామం. అదే కథా స్థలం. అక్కడ వ్యవసాయం తప్ప మరో వృత్తి తెలియదెవరికీ.

హార్డీకి ఈ లోకమంతా విషాద భరితమే. మనుషులందరూ నిస్సహాయంగా బలీయమైన విధికి తలవంచక తప్పదు. ఇలా ఆలోచించటం తప్పన్న విమర్శకులకు, "నేను మీతో వాదించదలచుకోలేదు. తనకు తెలిసిన జీవితాన్ని గురించి రాయటమే రచయిత కర్తవ్యం. అది హేతుబద్ధంగా కనిపించకపోతే దాని బాధ్యత నాది కాదు" అంటూ జవాబిచ్చాడు హార్డీ.

"మంచి నవలల్లో కథ ముఖ్యం కాదు. పాత్రల స్వభావాన్ని, స్పందనల్ని, వాతావరణాన్ని, ముఖ్యంగా పాఠకులకు అపరిచితమైన ఒక గొప్ప అనుభవాన్ని పరిచయం చెయ్యటమే వాటి ప్రయోజనం" అన్నది లాక్షణికుల అభిప్రాయం.




మొత్తం మీద సుదీర్ఘమైన ఈ నవలలోని కథ ఇలా ఉంటుంది.

కథానాయిక 'బాత్‌షీబా ఎవర్డీన్' స్వాభిమానం గల యువతి. భూస్వామిని. ఒకప్పుడు బాగా బతికి, ఆస్తి పోగొట్టుకుని తన దగ్గర బెయిలిఫ్ (ఎస్టేట్ మేనేజర్ లాంటి వుద్యోగం)గా చేరిన గేబ్రియల్ ఓక్‌తో ప్రేమలో పడుతుంది. ఆ తర్వాత మధ్య వయస్కుడైన బోల్డ్‌వుడ్‌తోనూ, ఒక సంపన్నుడి అక్రమ సంతానమైన సార్జంట్ ట్రాయ్‌తోనూ సంబంధం పెట్టుకుంటుంది. అప్పటికే బాత్‌షీబా పనిమనిషి 'ఫానీ రాబిన్'ను పెళ్ళి చేసుకుంటానని మోసం చేస్తాడు ట్రాయ్. అయినప్పటికీ ప్రేమోద్రేకంలో అతణ్ణి పెళ్ళాడుతుంది బాత్‌షీబా. సహజంగానే అది మూణ్ణాళ్ల ముచ్చటవుతుంది. ఫానీపట్ల ట్రాయ్ ఎంత దారుణంగా ప్రవర్తించాడో నెమ్మదిగా తెలుసుకుంటుంది బాత్‌షీబా. ఓ బిడ్డకు జన్మనిచ్చి మరణిస్తుంది ఫానీ. వెదర్‌బరీ విడిచివెళ్లిపోతాడు ట్రాయ్. అతడు మరణించాడనుకుంటారంతా.

తన భర్త ఏడేళ్లలో తిరిగి రాకపోతే బోల్డ్‌వుడ్‌ను వివాహం చేసుకోవటాని కభ్యంతరం లేదంటుంది బాత్‌షీబా. ఓ సంవత్సరం గడుస్తుంది. బోల్డ్‌వుడ్ క్రిస్మస్ పార్టీ ఇస్తున్నప్పుడు తన భార్య తనకు



కథలోని పాత్రల పేర్లు, వాళ్ల ప్రవర్తన కూడా బైబిల్‌లోని వ్యక్తులను తలపిస్తాయి. బాత్ షీబా కోపగించినప్పుడు ఫేరో ఆస్థానం నుంచి మోజెస్ నిష్క్రమించినట్టుగా వెళ్ళిపోతాడు గేబ్రియల్. గొర్రెలకు బొచ్చు కత్తిరించటం ప్రతి ఏటా జరిగే ఒక ముఖ్యమైన తతంగం. విందు, వినోదాలతో ఒక పండగలా దీన్ని జరుపుకుంటారు కర్షకులు. అప్పటికే అంతరించిపోతున్న ఈ సంప్రదాయాన్ని సుదీర్ఘంగా వర్ణించి, "దీనితో ఇక ఇంగ్లీషు జీవన విధానమే కనుమరుగవుతోంది" అంటూ వాపోతాడు థామస్ హార్డీ.

కథా రచయితలకు చిన్న పిల్లల దృష్టి కోణం ఉండాలంటారు లాక్షణికులు. అంటే అలవాటైన రోజువారీతనం కాక, ప్రతి దృశ్యంలో ఒక అద్భుతాన్ని చూడగలగటం. అత్యంత సామాన్యమైన విషయాలను కూడా కొత్తగా చూడగలడు హార్డీ. ఆకుల ఈనెలలో, వాటి మీద పరచుకున్న మంచు బిందువులలో ఒక అలౌకికత కనిపిస్తుందతనికి. తొలి యవ్వనానుభవాల్ని వర్ణించటానికి కొంత అమాయకత్వం కావాలి. ఇప్పుడు మళ్లీ 'మాడింగ్ క్రౌడ్' రాస్తే కథలో పరిణతి కనిపిస్తుందేమో గాని, ఆనాటి మాజిక్ పట్టుకోలేను అంటాడు- హార్డీ 1901లో తన మిత్రుడికి రాసిన లేఖలో. నవలలతోనే కీర్తినార్జించినప్పటికీ అతడు స్వభావరీత్యా కవి. అందువల్ల కథల్లో ఉత్కంఠ, మిస్టరీ, నాటకీయత లాంటి అంశాలకన్నా, లిరికల్‌గా రాయటానికే ఇష్టపడ్డాడంటారు విశ్లేషకులు. అయితే 'తత్కాలీన సామాజిక సంబంధాలను చిత్రించటంలో టాల్‌స్టాయ్‌కు తీసిపోడు' అన్నవాళ్ళూ లేకపోలేదు.

కావాలంటూ తిరిగివస్తాడు ట్రాయ్. బోల్డ్‌వుడ్ అతణ్ణి తుపాకితో కాల్చి ఆత్మహత్యకు ప్రయత్నిస్తాడు. మతి భ్రమించిందని బోల్డ్‌వుడ్‌కు జీవితఖైదు విధిస్తారు. తన తొలిప్రియుడు ఓక్ ఇంకా తన కోసం నిరీక్షిస్తున్నాడని బాత్‌షీబాకు తెలుసు.

హార్డీ నవలలన్నీ విషాదాంతాలే అయినప్పటికీ దీన్ని సుఖాంతంగా పరిగణించక తప్పదు. ఉత్కృష్టమైన ట్రాజెడీలు రాసిన గ్రీకు నాటక రచయితల ప్రభావం ఇతని మీద చాలా ఎక్కువగానే ఉందని అందరూ అంగీకరించారు. అనాలోచితంగా, క్షణికోద్రేకంలో చేసిన పనుల పర్యవసానాల వల్ల జీవితాలు అనుకోని మలుపులు తిరుగుతాయి. అందువల్లనే, ఈయన నవలల్లో నేరస్థుల పట్ల కూడా పాఠకులకు పెద్దగా అసహ్యం కలగదు.

ఉదాహరణకు, ఒక దశలో పెళ్ళి చేసుకోవటానికి ఫానీ రాబిన్‌ను ఒక చర్చికి రమ్మంటాడు ట్రాయ్. కాని ఆమె మరో చర్చిలో అతడి కోసం నిరీక్షిస్తుంది. అతడికి కోపం వస్తుంది. ఈలోగా బాత్‌షీబాతో పరిచయం ప్రేమగా మారుతుంది. కాని ఫానీ నిరక్షరాస్యురాలు. తన ప్రియుడికి ఎందుకు కోపం వచ్చిందో కూడా తెలుసుకోలేని అమాయకురాలు. నెలలు నిండిన చూలాలు. ఆమె దీనావస్థను అనేక పేజీల పాటు హృదయ విదారకంగా చిత్రిస్తాడు రచయిత. హెన్రీ జేమ్స్, వర్జీనియా వూల్ఫ్ లాంటి వాళ్లు సాధారణ జీవితంలో అసాధారణత చూడగలిగారు. కాని హార్డీకి అసాధారణతలోనే నాటకీయత కన్పించింది.

స్త్రీ, పురుష సంబంధాలలోని సంక్లిష్టతను, మిస్టరీని పరిశోధించటం 'ఫార్ ఫ్రం ది

**థామస్ హార్డీ (1840–1928)** థామస్ హార్డీ నవలలన్నీ కరుణరస ప్రధానమైనవే. పిల్లి నోట చిక్కిన చిలుక, కబేళాకు తరలిపోతున్న పశువులు, వేటగాళ్లకు చిక్కిన ఆడవి జంతువులు (కాస్టర్ బ్రిడ్జి మేయర్‌లాగ) ఉన్నత పదవిలో ఉండి, పరిస్థితుల కారణంగా నలుగురి ముందు తలవంచుకోవలసి వచ్చిన సజ్జనులు, పుష్పించకుండానే మట్టిలో కలిసిన జూడ్, ది అబ్స్క్యూర్‌లూ, మాయగాళ్ల మాటలు నమ్మి మోసపోయిన టెస్... ఒకరేమిటి, హార్డీ నవలల్లోని ప్రధాన పాత్రలందరూ వంచితులే. మన శరత్ సాహిత్యం లాగ, ఆయన పుస్తకాలు చదివితే వచ్చేది "కడివెడు కన్నీరు".

వ్యధాభరిత జీవితాలనే తన కథా వస్తువులుగా ఎంచుకున్న ఈ ఇంగ్లిష్ రచయిత డోర్చెస్టర్ సమీపంలోని హైయ్యర్ బకాంప్టన్‌లో జన్మించాడు. ఈ డోర్చెస్టర్ ప్రాంతమే హార్డీ నవలల్లో 'వెసెక్స్'గా మారింది- ఇతడివన్నీ 'వెసెక్స్ నవలలు' అనటానికి కారణం ఇదే. ఎనిమిదేళ్లప్పుడే తల్లి బహుమతిగా ఇచ్చిన డ్రైడెన్ రచన వర్గిల్ చదివి సాహిత్యం మీద అభిమానం పెంచుకున్నాడు. స్కూలు చదువు ముగించి, ఆర్కిటెక్చర్ నేర్చుకుంటూనే, లాటిన్, గ్రీక్‌లలో కూడా ప్రావీణ్యం సంపాదించాడు. కవితా రచన కూడా అప్పుడే ప్రారంభమైంది. మత సంబంధమైన విషయాలు ఎక్కువగా అధ్యయనం చెయ్యటం వల్లనేమో తరువాతి కాలంలో అవిశ్వాసిగా మారాడు. ఒకవైపు ఆర్కిటెక్ట్‌గా ప్రాక్టీసు కొనసాగిస్తూ 'ది పూర్ మాన్ అండ్ ది లేడీ' నవల (అముద్రితం) రాశాడు. మలి నవల 'డెస్పరేట్ రెమిడీస్' (1870)తో పాఠకులకు పరిచయమై, 1873లో కార్న్‌హిల్ మాగజైన్‌లో ప్రారంభమైన 'ఫార్ ఫ్రం ది మాడింగ్ క్రౌడ్'తో ఆ వారానికి అభిమాన రచయితగా మారాడు. తరువాతి నవలలు "ది రిటర్న్ ఆఫ్ ది నేటివ్" (1876-78), 'ది మేయర్ ఆఫ్ కాస్టర్ బ్రిడ్జ్' (1886), 'ది ఊడ్

మాడింగ్ క్రౌడ్' ప్రధాన ప్రయోజనంగా కన్పిస్తుంది. తమ కోరికల రంగుటద్దాలతోనే లోకాన్ని చూస్తారందరూ. బాత్‌షీబా అందగత్తె. తొలిదశలో గేబ్రియల్ ఓక్ ప్రేమను తిరస్కరిస్తుంది. కాని పరిస్థితులు మారి, ఆరాధకులు కాదు, అర్థం చేసుకోగలిగిన వాళ్లు ముఖ్యమనుకున్నప్పుడు అదే ఓక్ ఆమెకు స్నేహహస్తం అందిస్తాడు.

శరీరాకర్షణ గురించిన భ్రమలు తగ్గి, మనుషుల నైజాన్ని అర్థం చేసుకోవటానికి బాత్‌షీబా చేసిన ప్రయత్నమే కథలోని ముఖ్యాంశం. ఫానీ కష్టాలు, దయనీయమైన ఆమె చివరి క్షణాలు పాఠకులను కంటతడి పెట్టించటమే కాక, విచక్షణా రహితమైన ప్రేమలోని కొత్త కోణాన్ని దర్శింపచేస్తాయి.

'వెసెక్స్' ఒక భౌగోళికమైన ప్రదేశం కాదు. తరతరాలుగా మారని జీవన సరళికి, గ్రామీణుల అమాయకత్వానికి, భూస్వామ్య విలువలలోని అనాగరికతకు ప్రతీక. పల్లెపట్టులను, పంట పొలాలను, అక్కడి వాతావరణాన్ని వర్ణించడంలో హార్డీ సిద్ధహస్తుడు. గట్లమీద తిరుగాడే కప్పల్ని, నత్తల్ని, గొర్రెల్ని ఒక అద్భుత ప్రకృతి అనుభవంగా మనకు దర్శింపచేస్తాడు. నవల ముగించిన తర్వాత కూడా ఆ వానచినుకుల సవ్వడిని మనం మర్చిపోలేం. కొన్నిసార్లు ప్రకృతికీ, మనిషికీ ఉన్న సంబంధాన్ని రచయిత కొత్త కోణం నుంచి ఆవిష్కరించాడా అనిపిస్తుంది. కాలక్రమంలో సమాజ స్వభావం మారిందేమో గాని, స్త్రీ పురుష ఆకర్షణలోని మౌలిక స్వభావం మాత్రం మారలేదు.

హార్డీ తన ఇతర నవలల్లో కూడా క్షణికోద్రేకం అనర్థదాయకం అనే నొక్కి చెబుతాడు. ఇక ఈ కథలో ట్రాయ్, బోల్డ్‌వుడ్‌ల జీవితాలే ఇందుకు నిదర్శనం. ప్రకృతిలో భాగంగా బతికిన గేబ్రియల్ ఓక్ మాత్రమే

లాండర్స్' (1887)లతో పత్రికలన్నీ అతడి రచనల కోసం పోటీ పడ్డాయి. 1891 నాటి 'టెస్ ఆఫ్ ది డర్బర్‌విల్స్' గొప్ప సంచలనం సృష్టించింది.

హార్డీకి నగర జీవితమంటే మోజు లేదు. తన నవలల్లో పునఃసృష్టి చేసిన డోర్సెస్టర్‌షైర్ తప్ప ఆయనకు మరో ఊరి సుఖాలు తెలియవు. షైబైన ఇరవై ఏళ్లకు 1893లో ఒక రచయిత్రి ఆహ్వానం మీద డబ్లిన్ వెళ్లాడు. బహుశా హార్డీ ఆమెతో ప్రేమలో పడ్డాడేమో తెలియదు గానీ ఈ విషయాలన్నీ 1896లో అచ్చయిన 'జూడ్ ది అబ్‌స్క్యూర్'లలో ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ప్రస్తావించబడ్డాయి. ఈ నవల ఒక పెద్ద స్కాండల్ సృష్టించింది. అదే అతడి చివరి నవల. తరువాత బతికిన ముప్పై ఏళ్లూ కవిత్వానికే పరిమితమయ్యాడు హార్డీ. కవిగా కూడా మంచి పేరు వచ్చింది. 1914లో మళ్ళీ పెళ్ళి చేసుకున్నాడు. సామర్సెట్ మాం రాసిన 'కేక్స్ అండ్ ఏక్' నవలకు హార్డీ జీవితమే ప్రేరణ అంటారు. వెసెక్స్ నవలా తోరణంలో 'ఫార్ ఫ్రం ది మాడింగ్ క్రౌడ్' మొదటిది. కవి థామస్ గ్రే రాసిన ఎలెజీలో ఒక పంక్తిలోని మాటలే ఈ నవలకు శీర్షిక అయ్యాయి. జార్జి ఎలియట్ తర్వాత, కనుమరుగవుతున్న గ్రామీణ వాతావరణాన్ని అంత హృద్యంగా చిత్రించినవాడు హార్డీ. "సాధారణతతో అసాధారణతను మేళవించటంలోనే ఉంటుంది రచయిత ప్రతిభ. పాత్రలు అసాధారణంగా ఉంటే పాఠకులు హర్షించరు. అందువల్ల అతి సామాన్యమైన వ్యక్తులను, అనూహ్య పరిస్థితులు, పరిణామాలు ఎలా ప్రభావితం చేశాయో రాయాలి" అంటాడు హార్డీ. ఈ తర్కం శృతి మించితే కథ అసహజంగా పరిణమించే ప్రమాదమూ లేకపోలేదు.

పందొమ్మిదవ శతాబ్ది ఇంగ్లిష్ సాహిత్యంలోని ఒక గొప్ప "పాస్టోరల్" నవల "ఫార్ ఫ్రం ది మాడింగ్ క్రౌడ్"

జీవిత పరమార్థాన్ని అవగాహన చేసుకున్న సహనశీలి. ఆకాశం, నేల, గాలి, చెట్లు, నక్షత్రాలు, నదీనదాలు అన్నీ విశ్వ క్రీడలో భాగమే నంటాడు హార్డీ. వ్యక్తులకూ, పర్యావరణానికీ ఒక సృజనాత్మక సంబంధం అంతరించిన రోజున మన మనుగడే ప్రశ్నార్థకమవుతుంది. ఇందులో ముఖ్య భూమిక నేల తల్లిని నమ్ముకున్న కర్షకులది. వ్యవసాయ కార్య కలాపాలను సుదీర్ఘంగా చిత్రించిన నవలలు లేవని కాదు- జార్జి ఎలియట్ రచనల్లో కూడా ఇదే ప్రధానాంశం- కాని ఇంత హృద్యంగా, కథలో భాగంగా వాటిని చెప్పిన నవల 'ఫార్ ఫ్రం ది మాడింగ్ క్రౌడ్'.

"ఆనందించటం, మన ఆనందాన్ని ఇతర్లకు పంచటం, కష్టాల్ని ధైర్యంగా ఎదుర్కోవటం, మళ్లీ మంచి రోజులు వస్తాయని నిరీక్షించటం" హార్డీ తాత్విక దృక్పథం.

– ఎం. వసంత ✦

డికెన్సు లాంటివాళ్లు పుట్టుకతోనే రచయితలు. రచనలు చెయ్యకపోతే వాళ్లేమయ్యేవాళ్లో నని ఆశ్చర్యం వేస్తుంది. కాని వృత్తిరీత్యా హార్డీ ఆర్కిటెక్టు. నవలల్లో కూడా అందమైన డిజైన్లు సృష్టించాడు. అక్షరాలతో కట్టిన అద్భుత హర్మ్యాలు అతడి నవలలు. గ్రామీణుల గురించి రాసినప్పుడు మాండలికం తప్పదు. ఇంగ్లిష్ సాహిత్యంలో హార్డీ మాండలికానికో ప్రత్యేకత ఉంది. "మనల్ని నవ్వించి, ఏడ్పించి, తన సాహితీ మధువుతో పాఠకులకు మత్తెక్కించిన రచయిత థామస్ హార్డీ. అతనిదొక 'విలక్షణ దార్శనికత' అంటూ వెసెక్స్ నవలల్ని ప్రశంసించింది వర్జీనియా వూల్ఫ్

'చతుర' నవలల పోటీలో ద్వితీయ బహుమతి
(రూ. 20,000/-) పొందిన నవల

# ఆకుపచ్చని గాయం

డాక్టర్ వి. చంద్రశేఖరరావు



'బాల్యం తెలిమీగడ తరక! అదో వెండివెన్నెల మరక' అన్నారో కవయిత్రి.
కలిమి లేముల భేదాలూ, కలతలూ, కష్టాలూ, కన్నీళ్ళూ, కలహాలూ అంటని
ఆ ఆనందమయ జీవితం మళ్ళీ రానిది గనుక అందరికీ అది అపురూపమే!
ఇరవై సంవత్సరాల క్రితం గూడెంలో పిల్లలందరూ జ్వరాలతో, ఆకలితో
చనిపోతుంటే అడవుల అవతల నాగరిక ప్రపంచంలో వదిలి పెట్టిందతడిని తల్లి.
అలా వీధిన పడిన ఆనాటి కుర్రవాడే పెరిగి, పెద్దవాడై విశ్వవిద్యాలయంలో
పట్టా పుచ్చుకున్నాడు. జ్ఞాపకాల పొరల మాటున తల్లి కన్నీటి తెరలు కరిగిస్తూనే
ఉంటుంది. తను పుట్టిన అడవీ, గూడెం తరచూ గుర్తొస్తుంటాయి.
ఆ తరువాత కొన్నాళ్ళకు స్వామికార్యం, స్వకార్యం సాధించుకునే
లక్ష్యంతో ఆ గూడానికి వెళ్తాడతడు. అక్కడ తను తల్లి చెంతకు చేరిన తీరు,
గూడెం ప్రజల సమస్యలు తీర్చేందుకు పడిన నిరంతర శ్రమ, పోలీసుల జులుం,
నాయకుల స్వార్థం, అడవి పుత్రులైన చెంచులలో కలిగిన
చైతన్యం కళ్ళకు కట్టించిన డాక్టర్ వి. చంద్రశేఖరరావు నవల
ఆకుపచ్చని గాయం ఈ నెల 'చతుర' సమర్పణ.

## మొదటి భాగం

నిశ్శబ్దపు సాయంకాలం. మౌనంగా తలలూపుతున్న చెట్లు. చెట్ల ఆకులు సన్నని జోల పాటల్లాంటి సడి చేస్తున్నాయి. ఘాటైన పరిమళాన్ని వెదజల్లే పూవులు, కబుర్లు చెప్పుకుంటున్న పిట్టలు.

ఉస్మానియా యూనివర్సిటీ క్యాంపస్‌లోకి వేగంగా నడిచివెళుతున్నాడు వీర. ప్రత్యేకమైన రూపం. చూడగానే హైదరాబాద్ మనిషి కాదనే విషయం అర్థమవుతుంది. లోపలికి వస్తూనే అన్ని వైపులకు ఆశ్చర్యంగా చూశాడు. కొద్ది నెలలలోనే ఎంత మార్పు. ఎప్పటికప్పుడు కొత్త ప్రపంచమే దర్శనమిస్తున్నట్లుగా ఉంటుంది. ఈ క్యాంపస్‌కున్న ప్రత్యేకత అదే. సత్యాన్వేషణ చేస్తున్న పురాయుగపు యోగిలా ప్రాచీనతను, ఆధునికతను రెంటినీ దర్శనీయం చేస్తుంది. అయితే ఈరోజు మాత్రం, భవనాల కంటే ఎత్తుగా ఎదిగినట్లు, శిఖరాగ్రంపై నిలబడి, ఈ భవన ప్రపంచాన్ని తన పాదం కింద అణిచిపెడుతున్నట్లుగా, ఎంతో ఎత్తుకు ఎదిగిన వామనుడిలా ఈ వీర (వీర నరసింహం).

మెత్తటి పచ్చిక... పక్కకు ఒరిగినట్లు ఉండే ఆర్ట్స్ కాలేజీ బిల్డింగ్... మనుషుల దయకు, పోషణకు నోచుకోని అశోక వృక్షాలు... చెట్ల పొదల మధ్యన రాతి బల్లలు... క్యాంపస్‌లో చిన్న చిన్న సమూహాలు... ఎన్నో యేళ్ళుగా మూలనపడి ఉన్న పాతకాలపు జీపు, దాని చక్రమొకటి ఊడి వచ్చి భూమి మధ్యలో తలను పాతుకున్నట్లుగా... ఈ సన్నివేశమంతా ఒక చివరి దృశ్యానికి కావలసిన వాతావరణ సూచికలా ఉంది అనుకున్నాడు వీర.

బహుశా యిది చివరి సందర్శన కావచ్చును. సిద్ధాంత వ్యాసం సమర్పించటం, వైవా పూర్తికావటం, మరింక యూనివర్సిటీతో చుట్టుకొన్న పేగు తెగిపోయినట్లే అనుకున్నాడు.

క్యాంపస్ మధ్యలో నిలబడి సమస్త మానవ, మానవేతర సమూహాలకు మౌనంగా గుడ్‌బై చెబుతున్నాడు.

పచ్చిక, ఒంటరి అశోకవృక్షాలు, ఎన్నాళ్ళుగానో కదలని జీపు- వీటన్నింటికి ఏదో ఒక రోజు ప్రాణం వస్తుందని అతనికి గాఢమైన నమ్మకం. గతం, జ్ఞాపకాలు, బాల్యం, ఇవన్నీ ఇట్లాంటి నిర్జీవ సంగతులే. అయినా అవి మనిషిలో సంచరిస్తూనే ఉంటాయి. అట్లాగే వీటికి అభౌతికము, బౌద్ధికమయిన లక్షణాలు వస్తాయని అతని వింత నమ్మకము.

పురాతనమైన తోట, గుండ్రంగా అమర్చబడ్డ కుర్చీలు, రంగు దీపాలు, పండగ వాతావరణం వచ్చిందా తోటకు. సీనియర్స్ కోసం ఫేర్‌వెల్ పార్టీ ఏర్పాటు చెయ్యబడింది. తోట అంతా తిరిగాడు. ఇంకా ఎవరూ వచ్చినట్లు లేదు. నలుగురైదుగురు జూనియర్లు ఏర్పాట్లు అన్నీ చూస్తున్నారు. పార్టీ అనుకున్న సమయానికి గంట ఆలస్యంగా మొదలౌతుందని చెప్పారు వాళ్ళు. ఆ ఫార్మాలిటీ ఏదో అయిపోతే ఈ ప్రాంతం నుంచి పారిపోవచ్చని వీర ఆలోచన. పది నిమిషాలు అక్కడే తిరిగి, ముఖానికున్న పౌడరు తుడిచేసుకొని, టక్ చేసిన చొక్కాను పైకి లాక్కొని ఈసురోమంటూ హాస్టల్ వైపు నడిచాడు. పుస్తకాలన్నీ కట్టలు కట్టి ఉన్నాయి. సూట్‌కేసు సర్ది ఉంది. ఇనుప మంచం ఒకటి నిరంతర ఆహ్వానంలా అతనివైపు చూస్తోంది. గాఢంగా కౌగలించుకుంటున్నట్లుగా మంచంపై వాలిపోయి, అతనికెంతో ఆత్మీయమైన నిద్రలోకి జారిపోయాడు.

గంట తరువాత నిద్ర లేచి, చిక్కనైన సాయంకాలంవైపు తృప్తిగా చూశాడు. ముఖం కడుక్కుని, అల్మైరాలో ఉన్న చిన్న అద్దంలోకి చూసుకొని, తృప్తిగా నిట్టూర్చాడు.

తన సౌందర్యపు వివరాలు తెలిసిన ఈ రహస్యపు అర, తన శరీరపు స్పర్శను, ఆలోచనల వాసనలను తెలిసిన ఈ గది, తన చరిత్రను మరికొన్నేళ్ళపాటు నిక్షిప్తం చేస్తాయని అతనికెందుకో గట్టి నమ్మకం కలిగింది.

డ్రమ్స్, గిటార్, ఫ్లూట్, తోటనిండా పాటలు. చెట్లకు కట్టిన ఫ్లడ్ లైట్ల వెల్లువలో అక్కడున్న వాళ్ళందరూ మిలమిల మెరుస్తున్నారు, దేవతల సంతానంలా. వేసవికాలపు రాత్రి. మత్తైన గాలులు. నిర్మలమైన ఆకాశం.

పాత హిందీ పాటల్ని, పాప్‌తో మిక్స్ చేసి, రీమిక్స్ పాట పాడుతున్నారు. ఏ మాత్రం అర్థంకాని ఆ పాటల హోరు మధ్య సన్నని వయొలిన్ రాగమొకటి దుఃఖభరితమైన జ్ఞాపకంలా క్షణంపాటు వినపడి, అంతలోనే మాయమవుతోంది. శబ్దాలను దాటి అదృశ్యమైన ఆ వయొలిన్ రాగమొక్కటే, వీర గుండెలోకి చొచ్చుకొచ్చింది. అది వాద్యపు ధ్వనిలా కాకుండా మానవుల ఆత్మలేవో మంద్రంగా రోదిస్తున్నట్లుగా, ఆ రోదన ఎక్కడి నుంచో అదృశ్య దేశాల నుంచి వస్తున్నట్లుగా తోచింది వీరకు. బహుశా వీళ్ళెవరికీ తెలియని, అతని దేశంనుంచి కావచ్చు అతను పుట్టిన ప్రదేశం, ఉందో, లేదో తెలియని అతని తల్లికి చెందిన దేశం.

"చామంతీ" అని పెద్దగా అరిచాడు. "ఏమిటి" అంటూ చూసింది, అతని పక్కనే నిలబడ్డ అమ్మాయి.

"ఏం లేదు. అది మా అమ్మ పేరు. వందల మైళ్ళ అవతల ఎక్కడో, అడవుల మధ్యన మా ఊరు. ఈ సంగీతం వింటూంటే అడవులపై నుంచి అమ్మ జ్ఞాపకమేదో..." అన్నాడు సంజాయిషీగా.

డ్రమ్స్ హోరు ఆగి, వయొలిన్ ఒక్కటే వినిపిస్తోంది. మంద్రంగా మొదలై, మహోద్వేగాల్ని ఎగజిమ్మేట్లుగా మారింది. పక్కన ఎవరో పాడుతున్నారుగానీ, వయొలిన్ వరదలో ఆ పాట అదృశ్యమైపోయింది. డాన్స్ మొదలైంది. పెద్దగా అరుచుకుంటూ శరీరాల్ని సుడులు రేగే సముద్రాలుగా మార్చే ఆ కోలాహలం ఎంతో బాగుంది వీరకు. సమస్తమూ ఇక్కడే, ఇట్లాగే ఆగిపోతే బాగుండు అనిపించింది. రేపటిలో ఏ సంతోషమూ లేదనేది నిజం. అది దుఃఖ గాథల పుస్తకంలా ఎదురు చూస్తుంది. అందులోకి ప్రవేశించాలంటే అయిష్టంగా ఉంది వీరాకు.

వీరాకు ఎదురుగా నిలబడ్డ అమ్మాయి కళ్ళను రెండు వెలుగు దీపాల్లా మార్చి అతని వైపే విస్మయంగా చూస్తోంది. నీలిరంగు చీర, నున్నటి ఇందిరాగాంధీ తరహా క్రాపు, ఆ అమ్మాయి యూనివర్సిటీ తాలూకు అమ్మాయిలా కనబడలేదు. ఎవరితోను కలవకుండా ఒంటరిగా నిలబడి ఉంది. వీర కళ్ళలోని దుఃఖంలాంటి, దయలాంటి మృదుత్వాన్ని గమనిస్తుందామె. అతని రూపురేఖలు ప్రత్యేకంగా ఉన్నాయి. అంత పొడగు కాదు. నునుపైన ముఖం. గుబురు గడ్డం, మేధావుల వరుసలోని వాడిలా తోస్తాడు. లోపలేవో రహస్యాన్ని దాచుకున్న వాడిలా అనిపిస్తాడు. అతని ముఖంలో ప్రవక్తల ముఖంలో కనబడే వెలుగు, రహస్య ప్రేమికుడి ముఖంలో కనబడే దుఃఖం, ఏకకాలంలో కనిపించసాగాయి. అతనిపై తనకు కలిగిన భావాల్ని దాచుకోలేదా అమ్మాయి. వీర వైపు చూసి ప్రేమగా నవ్వింది. అతనామెను పట్టించుకోలేదు.

రీసెర్చి స్టూడెంట్లు, పి.జి.స్టూడెంట్లు, ప్రొఫెసర్లు ఆల్కహాలు ఇచ్చిన రెక్కల్ని ధరించి కొత్త కలల లోకంలోకి పరిగెడుతున్నారు. కొద్దిమంది అమ్మాయిల చుట్టూ అభిమాన బృందాల్లా మూగారు. వీర ఎదురుగా ఉన్న అమ్మాయి ఆ గుంపులోకి అదృశ్యమైంది. ఆమె చేతిలో చల్లటి చిల్డ్ బీరు.

రాత్రి మరికాస్త చిక్కనైంది. తూలుతున్న

వన్యమృగంలా ఉంది తోట. సంగీతం, నాట్యం, విందు ముగిసినాక వాళ్ళంతా మోహభరితమైన కబుర్లుగా మారిపోయారు. స్త్రీలు, పురుషులు విడివిడి జంటల్లా, నడుస్తున్న మధు పాత్రల్లా మారిపోయారు. ప్రొఫెసర్లు, డీన్ వెళ్ళిపోయారు. వీరకు వాతావరణమంతా విసుగ్గా తోచింది. మాట్లాడటానికి ఎవరూ కనపడలేదు. కళ్ళలో వెలుగులు ప్రదర్శించిన అమ్మాయి, దూరంగా, ఒంటరిగా నిలబడివుంది. ఇప్పుడు ఆమె నవ్వులు కనిపిస్తున్నాయి. అవి దుఃఖంతో తడిసిన పువ్వుల్లా ఉన్నాయి. చిరకాలపు మిత్రుడితో మాట్లాడినట్లుగా ఏవేవో కబుర్లు చెబుతోంది. వీర ఆ ఉధృతికి కంగారుపడ్డాడు. పక్కనే నడుస్తున్న ఆమె శరీరపు దగ్గరితనం అతనికి ఎంతో హాయినిస్తోంది. ఆమె శరీరపు పరిమళం వందలాది తోటల నుంచి సేకరించిన పుష్ప



## రచయిత పరిచయం

ప్రయోగాత్మక దృష్టితో తెలుగు కథా సాహిత్యంలో కొత్త వెలుగులను విరజిమ్ముతున్న డాక్టర్ వి. చంద్రశేఖరరావు విలక్షణ రచయిత. ప్రకాశం జిల్లా, బసవన్న పాలెంలో 1959లో జన్మించిన వీరి బాల్యం, విద్యాభ్యాసం గుంటూరు జిల్లాలో గడిచాయి. 'డ్యూటీ' కథతో కథా సాహిత్యంలో ప్రవేశించిన చంద్రశేఖరరావు ఇప్పటికే 'జీవని', 'లెనిన్ ప్లేస్', 'మాయ లాంతరు' కథా సంపుటాలను వెలువరించారు. 'మోహనా! ఓ మోహనా!', 'చిట్టచివరి రేడియో నాటకం' వంటి కథలతో అందరినీ ఆకర్షించారు. వీరి కథా సంపుటాలకు వివిధ అవార్డులు లభించాయి. తొలినవల 'ఐదు హంసలు' ఆటా అవార్డు గెలుచుకోగా, రెండోనవల 'ఆకుపచ్చని గాయం' చతుర నవలల పోటీలో రెండోస్థానంలో నిలవడం అపురూపమే అంటారు చంద్రశేఖరరావు.

కళ్ళలో నిర్లిప్తతో, నిరాశో. గాఢంగా నిట్టూరుస్తూ ఆమె పార్టీలోంచి బయటకు నడిచింది. ఆకాశంలో నక్షత్రాల విన్యాసం మొదలైంది. రాత్రి తన నడకను పెంచింది.

వీరాకు బోరు కొట్టడం మొదలుపెట్టింది. పార్టీలో ఉత్సాహం ఆగిపోయింది. జంటలు పొదల మధ్యన కూలబడి పోర్నోగ్రఫీ పుస్తకాల్లా మారిపోయారు. వీరా చెప్పే గుడ్‌బై ఎవరూ పట్టించుకోలేదు. వీర మెల్లగా రూమ్‌వైపు కదిలాడు.

కాస్త దూరంలో చెట్ల మధ్యలో ఆ అమ్మాయి కనబడింది. వీరాను చూస్తూనే ఆగింది. 'హలో' అంది. సోషియాలజీలో యమ్.ఫిల్ చేస్తున్నానని చెప్పింది. ముఖం నిండా సౌగంధంలా ఉంది. ఈ తాత్కాలిక స్నేహితురాలి ప్రభావం అతన్ని విస్మయపరుస్తోంది. ఒక మోళీలోకి నడుస్తున్న వాడిలా మారిపోయాడు.

తోటలోని కోలాహలం ఇంకా కొనసాగుతూనే ఉంది. రాత్రికి పోటీగా కొనసాగుతోందా ఉత్సాహగానం. వీర అతని కొత్త స్నేహితురాలు యూనివర్సిటీ రోడ్లపై నడుస్తున్నారు. ఆ అమ్మాయి గాంధీనగర్ వైపు వెళ్ళాలి. అక్కడిదాకా నడిచి వెళ్ళాలన్నట్లుగా నడుస్తున్నారు. వీరకు ఈ హైదరాబాదు రోడ్లంటే ఇష్టం. రాత్రివేళల్లో అట్లా నడుచుకుంటూ వెళ్ళటం, అతనికిష్టమైన పాస్‌టైమ్. చార్మినార్ చుట్టూ ఉన్న సందులన్నీ అతనికి

తెలుసు. ఏ టైములో వెళ్ళినా దొరికే ఇరానీ టీ, చార్మినార్ చుట్టూ ఉండే అనంతమైన జీవోత్సవం అతనికెంతో ఇష్టం. అట్లాగే టాంక్‌బండ్ కూడా. ప్రియురాలి నడుం చుట్టూ చెయ్యివేసి నడుస్తున్న అనుభూతి. నిశ్శబ్దమైన రోడ్లపై వాళ్ళ సంభాషణ ఒక్కటే సన్నగా వినిపిస్తుంది. అప్పుడప్పుడు కనబడే మోటారు సైకిళ్ళు, పెట్రోల్ వాన్ మిన హాయించి, రోడ్లు నిర్మానుష్యంగా ఉన్నాయి. స్ట్రీట్‌లైటు వెలుగులో ఆ అమ్మాయి ముఖం లో కొత్త అందాలు కన్పిస్తున్నాయి వీరాకు. గుప్పుమని సువాసన వెదజల్లే చామంతి పా దలా (అతనికెంతో ఇష్టమైనది) ఉంది. నిశ్శ బ్దపు నదిలా కూడా ఉంది. ఎన్నో యేళ్ళుగా పరిచయమున్న స్నేహితురాల్లా తోచింది. నిండయిన ముఖం, అలసటను సూచించే ముడతలు (వయసు తాలుకు ముడతలు అనుకోవడం అతనికిష్టం లేదు). నిశ్శబ్దాన్ని, కోరికను దాచుకొన్న వెడల్పాటి కళ్ళు, సన్నటి పెదాల చాటున మార్మిక భాషలేవో దాగు న్నట్లు, ఆమె సౌందర్యం అతన్ని అబ్బురపరి చింది. ఆమెతో అట్లా నడుస్తున్నకొద్దీ అజ్ఞా త స్నేహితురాలు, అతని జీవితంలో సంభ వించబోయే ఒక అందమైన సంఘటన కాబోతుందనే బలమైన నమ్మకం అతనికి కలగసాగింది. కలలాంటి (మోహభరితమై న), భ్రమలాంటి మానసిక స్థితిలోకి వెళ్ళిపో యాడు వీర.

క్రాస్ రోడ్స్ దాకా వచ్చాక "ఇంక ఉండండి, నేను వెళతాను" అంది.

"ఇంటిదాకా వస్తాను. బహుశా మళ్ళీ మిమ్మల్ని కలవటం కుదరదు. ఈ వారమే హైదరాబాద్ వదలి వెళుతున్నాను" అన్నాడు.

కొద్దిగా ఆశ్చర్యపోయి రమ్మని తల ఊపింది.

వాళ్ళట్లా నడుస్తూ వెళ్ళారు చాలా దూరం. సన్నని రోడ్లు, సందులు ఎన్నో దాటారు. హఠాత్తుగా నడక ఆపి, "ఇదే నేనుండే అపార్ట్‌మెంట్" అంది.

"పదండి నేనూ వస్తాను. మీరు రెస్టు తీసుకుందురుగాని, నేను కాసేపు కూర్చుని వస్తాను" అన్నాడు వీర.

ఆ మాటలకు విస్తుపోయింది ఆమె. 'ఏమిటితని చనువు' అని ఆశ్చర్యపోయింది. గాఢంగా నిట్టూర్చి "రండి" అంది.

గది బయట 'మోహిని ఎం.ఫిల్, కో-ఆర్డి నేటర్, స్త్రీ శక్తి' అంటూ బోర్డు ఉంది. మోహిని గది చాలామంది అమ్మాయిల గదిలాగే ఉంది. ప్రత్యేకతలు ఏమీ లేవు. కర్టెన్లు మూసి, ఒక మూలంతా ఖాళీగా, వెలితిగా, రూమునిండా దుఃఖపు పాట అల ముకున్నట్లుగా ఉంది.

మోహిని అతని కోసం టీ చెయ్యటం మొదలు పెట్టింది. ఉత్తరపువైపు గోడనంతా ఆక్రమించిన పెయింటింగ్ వీరను ఎంతో ఆకట్టుకొంది. అది మోహిని బెడ్ పక్కనే వేలాడదీసి ఉంది. ఆ మంచంపై పడుకున్న వాళ్ళను ఆ చిత్రం తనలోకి లాక్కుంటుం దేమో అన్నంతా దగ్గరగా ఆ పెయింటింగ్. అదొక కలలోని దృశ్యం. భూమిపై నిలబడి, ఒక మహాపురుషుడు ఆకాశాన్ని తన పిడికి లితో గుద్దుతున్నాడు. శిరస్సు మరో ప్రపం చంలోకి చూస్తోంది. కళ్ళనిండా వందలాది, వేలాది యుద్ధ బీభత్సాల గుర్తులు.

పెయింటింగ్ రెండో సగంలో అదే చిత్రం, కాని వివరాలు మారాయి. మహాపు రుషుడు శుష్కించి, వేల యేండ్ల వార్ధక్యంతో ఉన్నాడు. శరీరం ఎండిపోయి, ఎముకల గూడులా ఉంది. శిరస్సు భిక్షా పాత్రలా మా రింది. కళ్ళు మరణాన్ని పాడుతున్నాయి.

చిత్రంలో రెండో సగం చూసి ఉలిక్కిప డ్డాడు వీర. ఆ రెండో మనిషిలో తన పోలి కలున్నాయేమోనని దిగులు పడ్డాడు. ఈ అజ్ఞాత యువతి చుట్టూ భీరువులా, పిచ్చివా డిలా పరిగెడుతూ...

# పేద ప్రజల



## వైద్యఖర్చులకు చింతలేదిక



**అత్యాధునిక పరికరాలు,**

**విశేష అనుభవంగల వైద్యబృందంతో**

అంతర్జాతీయ ప్రమాణాలు గల వైద్యసేవలందిస్తుంది







# బొల్లినేని

## సూపర్ స్పెషాలిటీ హాస్పిటల్

నెల్లూరు. ☎ 2315836, 37, 38

HARSHA 9849188889

**ఇతర కార్పోరేట్ హాస్పిటల్ కంటే తక్కువ చార్జీలు**

**ఖచ్చితమైన వైద్యవిలువలు**

**గుండె వైద్యంలో నిష్ణాతులైన వైద్యబృందం**

**పేద, మధ్య తరగతి వారికి అందుబాటులో వైద్యం**

పేదప్రజల వైద్య ఖర్చులకు **ముఖ్యమంత్రి సహాయనిధికి**

అదనంగా **ప్రధాన మంత్రి సహాయనిధి** కూడా

పొందేందుకు గుర్తింపు పొందినదని

తెలియచేయుటకు సంతోషిస్తున్నాము.

**- మేనేజ్‌మెంట్**

మోహిని రెండు కప్పులతో టీ తెచ్చింది. టీ తాగుతూ,ఏ ఉపోద్ఘాతం లేకుండా మోహిని చెయ్యి పట్టుకున్నాడు. మోహిని అతని చేతిని తీసివేసే ప్రయత్నం చెయ్యలేదు. అతన్ని అర్థం చేసుకోడానికి ప్రయత్నిస్తోంది. ఒక రాత్రి సెక్స్ అనుభవం కోసం వెంపర్లాడే యూనివర్సిటీ కుర్రాళ్లు ఆమెకు తెలుసు. ఇతని ముఖంలో అట్లాంటి వాంఛగానీ, చాపల్యంగానీ కనిపించటంలేదు. పిరికితనం, ఎంతో అమాయకత్వం కనిపిస్తున్నాయి.

"నాకు పెళ్ళయింది. అఫ్‌కోర్స్, ఇద్దరం ఇప్పుడు కలసి ఉండటంలేదు. ఆల్సో, ఐయామ్ క్యారీయింగ్" అంది, ఆ వివరాలు అతనికి అవసరం అన్నట్లుగా.

"మనం పెళ్ళి చేసుకుందాం" అన్నాడు వీర చెయ్యి వదలకుండా. అతని కళ్ళలో నిసర్గమైన ఇష్టం ఏదో. "ఇతనికేం కావాలి? " ఆశ్చర్యపోయింది మోహిని. 'ఒట్టి శరీరమే అయితే పోనీ, జాలితో ఈ ఒక్క రాత్రికి. ఊహు, అట్లా లేదు ఇతని ధోరణి. దేనికోసమో వెతుకులాట. స్నేహం కోసమో, మనిషి దగ్గరతనం కోసమో'. మెల్లగా అతణ్ణి దగ్గరకు తీసుకొంది. రెండు చేతుల్ని అతని చుట్టూ వేసింది. ఏ సంభాషణా లేదు. ఒట్టి నిశ్శబ్దం.

పురుష స్పర్శ ఆమెకు కొత్త కాదు. కానీ ఈ మనిషి స్పర్శ కొత్తగా ఉంది. అతని శరీరంలోంచి వింత వాసన. మహారణ్యాల మీదుగా వీచే ఘాటయిన పరిమళం- ఇప్పపూలు, వెదురుపొదలు, తేనే తుట్టెలు. మోహినికి గొప్ప సుఖంగా ఉంది. ఎందుకో దుఃఖం కూడ కలిగింది. కళ్ళలో నీళ్ళు తిరిగాయి. కన్నీళ్ళు అట్లా కారుతూనే ఉన్నాయి. అవి వీర తలపైన పడి ఎండిపోతున్నాయి.

అతను దుఃఖాన్ని తెలుసుకొన్నవాడిలా మరింత గట్టిగా ఆమెను అదుముకున్నాడు. గాఢంగా ఆమె శరీరంలోకి చొచ్చుకుపోయేంత గాఢంగా మృదువైన మరో శరీరపు స్పర్శ కూడా అతనికి తగిలింది. చిత్ర నిద్రలో ఉన్న శిశువు శరీర స్పర్శ కాబోలు.

"మనం పెళ్ళి చేసుకుందాం" అన్నాడు, గొప్ప నిర్ణయానికి వచ్చినవాడిలా. మోహిని మాట్లాడలేదు. ఎందుకో నవ్వు వచ్చింది.

"నా మొదటి భర్త బతికే ఉన్నాడు. నన్ను వదిలేసినా, నాపై హక్కులున్నాయని నమ్ముతుంటాడు. నా పరిచయాల మీద, కదలికల మీద గూఢచర్యం చేస్తుంటాడు" అంది నవ్వుతూ.

"మనం రేపే రిజిస్ట్రార్ ఆఫీసులో పెళ్ళి చేసుకుందాం" అన్నాడు, ఇంకా ట్రాన్స్‌లో ఉన్నవాడిలా. ఎందుకో అతనిమీద జాలి వేసింది మోహినికి. అతని తలను పైకెత్తి గాఢంగా ముద్దు పెట్టుకుంది. అతని శరీరంలోని ప్రకంపనాలు తెలుస్తూనే ఉన్నాయి.

బయట నగరం మేలుకొంటోంది. బస్సుల, ఆటోల చప్పుళ్ళు, తొందరగా నిద్ర లేచిన పక్షుల అరుపులు- అవేమి వాళ్ళ చెవుల్లోకి చేరటంలేదు. ఆ ఇద్దరి శరీరాలు, గాఢమైన నిశ్శబ్దంలో, మోహశాంతిలో ఒదిగిపోయాయి.

ఆ రోజంతా వీర, మోహిని గదిలోనే ఉన్నాడు.

మోహినిని ఇంకా కలలాంటి భావన వెంటాడుతోంది. తన మాజీ ప్రియుడు (భర్త) చేసిన గాయం పచ్చిగా ఉండగా, ఈ కలలోని మనిషితో పరిచయం మోహినికి ఓదార్పుగా ఉంది.

ఈ వీర ప్రపంచం చాలా చిన్నది. యూనివర్సిటీలో గడిపిన ఐదారేళ్ళు మినహా, అతనికేం జీవితం లేదు. ఆశ్రమ పాఠశాలలు, వెల్ఫేరు హాస్టళ్ళు తప్ప, అతనికి చెప్పుకోదగ్గ సాంఘిక చరిత్ర లేదు. శ్రీశైలం ప్రాంతంలోని ఒక గూడానికి చెందినవాడు. తల్లి అనుకుంటున్న ఒక స్త్రీ మాత్రం అతనికి గుర్తుంది. పిల్లలందరూ జ్వరాలు, ఆకలితో చచ్చిపోతుంటే ఇతణ్ణి అడవుల అవతల నాగరిక ప్రపంచంలో వదిలేసి వచ్చిందా తల్లి. ఆకలి, ఒంటరితనం మినహా మరే కొత్త విషయం అతనికి తెలియదు. ఉద్యమాలు, ఎమ్.ఎల్ పార్టీలు, ఊహు... అతనో తెల్లకాగితం. మోహినికి ఈ పరిచయం ఆశ్చర్యంగా ఉంది. మోహిని అయిదేళ్ళక్రితం దాకా ఎమ్.ఎల్. పార్టీలో కార్యకర్త. క్రమంగా పార్టీని వదిలేసి ఫెమినిస్ట్ ఉద్యమంలోకి వచ్చింది. జర్నలిస్టు మిత్రుడు మనోహర్ పరిచయం అయినాక ఎన్.జి.ఓ. సంస్థను మొదలుపెట్టింది.

ఒకపూట గడిచినాక వీరపై విసుగు కలిగింది మోహినికి. అతనికి యూనివర్సిటీ, హాస్టల్, తన రీసెర్చి గురించి తప్ప మరే విషయమూ తెలియదు. అతనితో మాట్లాడాలంటే కష్టంగా ఉంది మోహినికి. టి.ఆర్.ఎస్., దళిత రాజకీయాలు, దేన్ని గురించీ అవగాహన లేదు. కనీసం ఆదివాసీ పోరాటాలు గురించి కూడా తెలియదు. కానీ అతని సమక్షంలో పొందే వింత ఓదార్పు కోసం అతనితో స్నేహాన్ని కొనసాగించింది మోహిని.

వారం దాటాక వాళ్ళిద్దరు రిజిస్ట్రార్ ఆఫీసులో పెళ్ళి చేసుకున్నారు. రెండు పూలదండలు, ఒకళ్ళిద్దరు మిత్రులు, హడావుడి లేని పెళ్ళి. అతనో బంగారు ఉంగరం తొడిగాడు ఆమెకు. ఆమె అతని మెడలో బంగారు గొలుసు వేసింది.

రోజూ సాయంకాలాలు మోహిని ఇంటికి వెళతాడు వీర. అతని రాకతో ఆమెలో ఆనందం కలగటం ఆ ఆనందపు వెలుగులతో ఆమె దీపశిఖలా మిలమిలలాడటం, వీరకు ఇదంతా ఒక అద్భుతం. స్త్రీ, పురుషుల మధ్యన రగిలే మోహావిశేషాలు అతనికింకా

స్వప్నంలోని సంగతుల్లాగే ఉన్నాయి. వీర మోహినిని దగ్గరకు తీసుకునేటప్పుడు లోప లున్న శిశువు జాగ్రత్త అని హెచ్చరిస్తున్నట్లే ఉంటుంది. క్యారీయింగ్ ఉమెన్‌తో సెక్స్ ఎట్లాగో అతనికి బోధించింది మోహిని. వీర కిది కొత్త జీవితం. అతనికో ప్రియురాలు. కొడుకు లేదా కూతురు ఉన్నారన్న ఊహ ఉద్వేగాన్ని కలిగిస్తుంది. మోహినితో కలిసి సాయంకాలాలు, ట్యాంక్ బండ్ పై నడవటం, బజారులో ఇద్దరు చేతులు పెనవేసుకొని నడవటం ఎంతో థ్రిల్‌గా ఉంది వీరకు. బాల్కనిలో కూర్చుని ఆకాశంవైపు చూస్తూ మోహిని పాటలేవో పాడుతూ ఉంటే ఆ పాటలేమీ అర్థం కాకపోయినా, ఆ పాట లన్నీ అతని చుట్టూ మూగి, మృదువుగా అతణ్ణి ముద్దాడుతున్నట్లుగా ఉంటుంది.

అయితే వీర పూర్తిగా మోహిని మనిషి కాలేకపోయాడు. ఇద్దరికి మధ్యన కనపడని తెర ఏదో అడ్డు ఉన్నట్లుగా అనిపిస్తుంది అతనికి. ఉప్పెనలా తోసుకొచ్చే మోహం, దాన్ని అణిచివేస్తాడు. ఈ కాస్త స్నేహం, సాహచర్య పరిమళం, ఆమె చుట్టూ అల్లుకు పోతున్న కొత్త జ్ఞాపకాలు అన్నీ హఠాత్తుగా మాయమవుతాయనే భయం. ఆత్మీకమైన ఆరాధనలాంటి భావనని ఆమె చుట్టూ అల్లి, మొత్తం పరిచయానికి తాత్విక స్థాయిని ఇవ్వాలని ప్రయత్నిస్తాడు. ఆమె శరీరం చుట్టూ నగ్నంగా అల్లుకుపోయిన క్షణాల్లో, ఎందుకో దుఃఖం పొగిలివచ్చేది. ఇదంతా ఎట్లా సాధ్యం, తనలాంటి ఒంటరికి, అనా థకు, ఇంతటి భాగ్యం ఎట్లా కలిగింది అనే సందేహం వస్తుంది. రోడ్లపై నగ్నమైన పాదాలతో ఆకలిగా తిరిగే రోజులు జ్ఞాపకం వచ్చేవి. హోటల్ బయట అద్దాల్లోంచి కన బడే ఆహారపు పళ్ళాలవైపు ఆశగా, కసిగా చూసే రోజులు గుర్తుకొచ్చేవి. మోహినికి, అతనికి మధ్య సరిగ్గా అట్లాంటి అద్దమే అడ్డుగా ఉన్నట్లు అనిపించేది.




వేసవి నిప్పుల తోటలా ఉంది హైదరా బాదు. వేడిగాలులు అన్నివైపుల నుంచి వెంటాడుతున్నాయి. పచ్చటి వనాలన్నీ తగు లబడుతున్న భావన. బయటకు వెళ్ళాలం టేనే భయం వేసే కాలంలో 'మోహిని' బిజీ అయిపోయింది. ఎన్.జి.ఓ. సంస్థలన్నీ కలసి 'కొత్త ప్రపంచం' పేరుతో భారీ ఎత్తున సభను ఏర్పాటు చేశాయి. ఇదంతా కొత్త ప్రపంచం వీరకి. మోహినికొక ఆఫీసు. అందులో ఉద్యోగులు, మోహిని చుట్టూ ఒక అధికార వలయం, ఆశ్చర్యంగా ఉంది వీరకు. మోహిని, మనోహర్ నించి విడిపో యాక, కొత్త ఎన్.జి.ఓ. సంస్థ మొదలుపె ట్టింది. కుటుంబ హింసకు గురైన స్త్రీలకు సహాయం చేసే సంస్థ ఇది. స్త్రీ శక్తి దీని పేరు. లాయర్లు, సోషల్ వర్కర్లు, కార్యక ర్తలు అందరూ కలిసి ఇరవైమంది దాకా ఉన్న సంస్థ ఇది. రహస్య సైన్యాన్ని కలిగిన అధికార రూపంలా తోచింది మోహిని, వీరకు. యూనివర్శిటీలో ఒక సాయంకాలం, మాట్లాడుతూ, మాట్లాడుతూ తన ప్రపంచం లోకి చొరబడిన మోహినేనా అని ఆశ్చర్యప డ్డాడు. పాంప్లెట్లు, పోస్టర్లు, చిన్న చిన్న సెమినార్లు... ఇదంతా కొత్తగా ఉంది అత నికి. ప్రతి సమస్యకు సమాధానం ఇవ్వగలిగే మాంత్రికురాల్లా మోహిని. గిరిజనుల హక్కు ల పోరాటాలు, మైనారిటీలపై దాడులు, ఉద్యోగినుల భద్రత, ముంపు గ్రామాల ప్రజల సమస్యలు, ప్రపంచపు ఏకైక మెస్స య్యాలా తోచిందీ మోహిని. ఈ రెండు ప్రపంచాల మోహిని అతనికెంతో ఆశ్చర్యా న్ని కలిగించింది. బయట మోహిని పాద రస శక్తులున్న స్త్రీ. నాలుగు గోడల మధ్యన ఒంటరిగా, తన మనిషి కోసం ఎదురుచూ పులు చూస్తున్న ప్రేమికురాలిలా, ఈ రెండో మోహినిది ఒక స్తబ్ద ప్రపంచం. ఎంకి పాటలు, మల్లె పూవులు, మోహ తీవ్రత. ఏ మోహిని నిజం?

రవీంద్రభారతి ఎదురుగా ఉన్న లాన్‌లో కూర్చుని ఉండగా, మోహిని తామిద్దరి కోసం తను రచించిన ప్రణాళికను బయటకు తీసింది.

వెలిగొండ ప్రాజెక్టు ముంపుకు గురయ్యే చెంచుగూడాలు, వాటి పునరావాసం గురించి మాట్లాడింది. గూడాలలో ఉన్న చెంచు కు టుంబాలను, అక్కడనుంచి ఖాళీ చేయించి, జనావాసాలకు దగ్గరలో, వాళ్ళకు కేటాయిం చిన స్థలాలలోకి వాళ్లను తీసుకురావాలి. ఇదొక విదేశీ సంస్థ ఇచ్చే ఫండ్స్‌తో జరిగే ప్రాజెక్టు. ప్రాజెక్టు పూర్తయితే పది లక్షల లాభం. చెంచులను ముఖ్యంగా అడవుల లోపల ఉన్న వాళ్లకు ఒప్పించటమే ముఖ్య మైన అంశం. వీర మాత్రమే ఆ పని చెయ్య గలడని మోహిని నమ్మకం. నిజానికి వీరకు ఇదో జన్మ సాఫల్యం. అతనిదైన దేశం(? ), అక్కడకు తిరిగి వెళ్లే ఒక అవకాశం, బహు శా అతని తల్లో, బంధువులో ఎదురు కావ చ్చని, మోహిని చాలాసేపు వీరని ఉత్తేజితం చెయ్యాలని చూసింది. ఈ పునరావాస పథకం విని నివ్వెరపోయాడు వీర. గొప్ప ఆశయంతో నిర్వహించాల్సిన కార్యక్రమం. ఒక బిజినెస్ డీల్‌లా మోహిని దీనిని వివ రించటం, వీరకు వింతగా ఉంది. ఈ పథ కంపై ఎందుకో వీరకు ఇష్టం కలిగింది.

నల్లమల అడవుల్లోని ఒక గిరిజన తెగకు చెందినవాడు వీర. బహుశా అతని తల్లి ఇంకా బతికే ఉంటుంది. ఇరవై యేళ్ళ క్రితం ఆ ప్రదేశం నుంచి వేరు చెయ్యబడ్డాడు.

అన్నం మూట, ఒంటిపై కప్పిన కంబళి, ఒక చలికాలపు పొద్దున అడవుల మధ్య నున్న ఒక తారు రోడ్డుపై వదిలేసి వచ్చింది అతడ్ని వాళ్ల అమ్మ. ఆమె పేరు చామంతో, మరో పువ్వు పేరో అని గుర్తు వీరకు. ఆ రోడ్డు వెంటనే వెళ్ళమని ఆదేశించింది వాళ్లమ్మ. గూడెంలో ఆహారం లేదు, జ్వరాలు, ఎటు చూసినా చావులే.

ఏడ్చి, మొండికేసి, వెళ్ళనంటూ అరవడం వీరకింకా గుర్తుంది. ఇక్కడుంటే చచ్చిపోతావు అంటూ వాళ్ళమ్మ పెద్దగా ఏడవటం గుర్తుంది. పెద్దవాళ్ళం, వేరుగడ్డో, బంక మన్నో, ఎట్లాగో బతికేస్తాం. లేదా చస్తాం. నువ్వన్నా బతుకయ్యా అంటూ అమ్మ ఏడవటం అతనికి గుర్తుంది. వీర, బలహీనమైన ఆమె పాదాల్ని పట్టుకొని, వెళ్ళను గాక వెళ్ళనంటూ మొండికేయటం కూడా గుర్తుంది. అయినా తల్లి కరుణించలేదు. అతన్ని రోడ్డుపైన వదిలి అడవిలోకి అదృశ్యమైంది. అతని చిన్ని హృదయం గిలగిలలాడింది.

"ఎక్కడికీ పోను, ఇక్కడే ఉంటాను" అంటూ రోడ్డుపైన పొర్లి పొర్లి ఏడ్చిన జ్ఞాపకం, ఇంకా తడిగానే ఉంది వీరలో.

సాయంకాలం దాకా రోడ్డుపైనే పడుకున్నాడు. వాళ్ళమ్మ తిరిగి వస్తుందేమోననే ఆశ. చీకటి పడ్డాక భయం వేసింది. వాళ్ళమ్మ తిరిగి రాలేదు. ఎత్తైన చెట్లు, ఒంటరి రోడ్డు, బొయ్‌మంటూ శబ్దం చేసే గాలులు, చప్పుళ్లు చేస్తున్న అడవి. లేచి కూర్చుని సద్ది మూటను విప్పుకొని ఆ రెండు మెతుకులూ తిని, అటూ ఇటూ చూస్తే, అంతా కొత్తగా వేరే దేశంలా ఉంది. చెట్ల చాటునుంచి, చీకట్ల మధ్యన తన ఇల్లు చీకటిలో కలిసిపోయినట్లే ఉంది, సముద్రం మింగేసిన పడవలాగా. అడవి మరణ భూమిలా తోచింది. శవాలపై కప్పిన గుడ్డలా నల్లటి రాత్రి, చావు పాటలాగా వీస్తున్న గాలులు. నిన్న

## డా. సి.నారాయణరెడ్డి చతురోక్తులు



తెలుగువారికి రెండో జ్ఞానపీఠాన్ని సాధించి పెట్టిన డాక్టర్ సి.నారాయణరెడ్డి సరస సంభాషణలో దిట్ట. పదాలవిరుపులో సునిశిత హాస్యాన్ని పండించే ఆయన అప్పుడప్పుడూ చురకలూ వేసీ అందరినీ నవ్విస్తుంటారు. ఆయన చతురోక్తులలో కొన్ని ఈ నెల చతుర పాఠకులకు ప్రత్యేకం..

### అదే ప్రధానం

హైదరాబాద్‌లోని త్యాగరాయ గానసభలో ఓసారి ఎవరికో స్వర్ణకంకణ ప్రదానం జరుగుతోంది. ఆ సభాధ్యక్షులు డాక్టర్ నారాయణరెడ్డి. వేదికపైనున్న బ్యానర్‌లో ...ఫలానా వారికి స్వర్ణకంకణ ప్రధానం అని రాసి ఉండడం గమనించిన సినారె నవ్వుతూ 'సాధారణంగా స్వర్ణకంకణ ప్రదానం అని రాస్తారు.. కానీ ఈ నిర్వాహకులకు ఈ కార్యక్రమంలో స్వర్ణ కంకణం ఇవ్వడమే ప్రధానం కనుక అలా రాశారు.. సభాసదులు మరోలా అనుకోరాదు' అని చమత్కరించారు. మెత్తగా వేసిన ఈ చురకకు నిర్వాహకులతో సహా అంతా పెద్దపెట్టున నవ్వేశారు.



చూసిన మూడు శవాలు (మూడూ పిల్లలవే) వీరకు కళ్ళ ముందు కదలాడాయి. ఆకాశంలో సన్నటి వెలుగు మాత్రం ఉండీ ఉండీ తళుక్కుమంటోంది. ఆరేళ్ళ వీర కళ్లలో నీళ్ళు ఎండిపోయాయి గానీ, గుండెల్లోని దుఃఖం మాత్రం అట్లాగే ఉంది ఇప్పటికీ.

ఆ చీకట్లో, అట్లాగే రోడ్డు అంచున నడవటం మొదలు పెట్టాడు వీర. రోడ్డుపై అట్లా నడుస్తుంటే, అతని వెనుక అతని బాల్యం, అతని దేశం (అతడి ఊహల్లో వాళ్లుండే ప్రదేశమే వాళ్ల దేశం) క్రమంగా అదృశ్యమయ్యాయి. ఊళలు వేసి, రొద పెట్టే అడవి గాలి, దుఃఖపు పాటలా అతనికి వీడ్కోలు చెప్పింది. ఒకసారి భయపెట్టి, ఒకసారి ఓదార్చి రోడ్డు పొడవునా ఆ గాలి అతనికి నేస్తమయ్యింది. తోవలో చిన్న చిన్న గుడిసెలు కనబడ్డాయి. గూడెం గుర్తొచ్చింది. అయితే ఆ గుడిసెలు తెల్లగా మిలమిల లాడుతూ సమాధుల్లా కనబడ్డాయి. నడకను కొనసాగించాడు. చెట్లు అదృశ్యం అవటం మొదలు పెట్టాయి. వెంటాడుతున్న గాలి కూడా ఆగిపోయింది. ఊళ్ళు, మనుషులు కనబడటం అతనికి ఆశ్చర్యం వేసింది. రోడ్డు అట్లా నిరంతరం కొనసాగటం కూడా అతనికి ఆశ్చర్యం వేసింది.

మనుషుల నీడలు అట్లా కనబడి, వెంటనే అదృశ్యం కావటం అతను గమనించాడు. అడవి, అదృశ్యమైన పొదలు ఎదురయినాయి. పొదల మధ్య రేగుచెట్టు కనబడింది. రేగు పళ్ళు కోసుకొని, రోడ్డుపైన ఉన్న చప్టాపై పడుకొని అట్లాగే నిద్రపోయాడు. ఉదయం నిద్రలేచి భయంతో బిగుసుకుపొయ్యాడు. రోడ్డు ఉందిగాని, పొదలు లేవు. ఆ పొదలు అదృశ్యం అవటం, ఇప్పటికీ అతనికి ఆశ్చర్యమే. ఇన్నేళ్ళ తరువాత కూడా అతనికా సంగతులన్నీ గుర్తున్నాయి. ముఖ్యంగా పొదలు అదృశ్యం అయిన ప్రదేశం. పొదలు అదృశ్యమైనచోట అతనికి మేకలమంద, కాపాలా కాస్తున్న గొల్లవాళ్ళు కనబడ్డారు. వాళ్ళు దయతో అతనికి అన్నం పెట్టారు. వివరాలేం అడక్కుండానే వాళ్ళతో తీసుకెళ్లారు. ఆరునెలలు వాళ్ళతోనే తిరిగాడు. అతనిలో భయం పోయినాక, వాళ్ళు అతన్ని ప్రభుత్వానికి అప్పగించారు. గిరిజనుల్ని ఉద్ధరించడానికి సిద్ధంగా ఉన్న ప్రభుత్వం, అతణ్ణి స్వీకరించింది, శిశువుల కోసం ఎదురుచూస్తున్న వృద్ధమాతలా సంక్షేమ ప్రభుత్వం అతణ్ణి దత్తత తీసుకుంది.

ఇన్నేళ్ళ తరువాత కూడా ఏదీ మర్చిపోలేదు వీర. అమ్మ గురించిన తీయని జ్ఞాపకం, లోలోపలే అతన్ని మురిపిస్తూ ఉంటుంది. అమ్మ గుర్తుకొస్తే బాల్యం ఇంకా కొనసాగుతున్నట్లే ఉంటుంది. వీరకి అతని తండ్రి ఎట్లా ఉంటాడో తెలియదు. చిన్నతనంలోనే మలేరియాతో చనిపోయాడు. ఆయనకు వ్యవసాయం గురించిన కలలు ఉండేవని వాళ్ళమ్మ చెప్పేది. పొలం దున్ని, మేకల్ని సాకి, ఆ ప్రాంతంలోనే సంపద ఉన్న వ్యక్తిగా పేరుండేదట. పొలంగట్ల గురించి, పంట చేల గురించి కలలుకనే మనిషిగా ఆయన్ను గుర్తుంచుకునేవాళ్ళట. వీర పుట్టక ముందు చనిపోయిన ఇద్దరు పిల్లల గురించి కథలుగా చెప్పేది వాళ్ళమ్మ. రెండు మేకలు తనతోపాటే ఇంట్లో తిరిగే జ్ఞాపకం అతనికింకా గుర్తుంది. తల్లి పొద్దున్నే కొడవలి, పార, లిక్కి, బుట్టలతో అడవికి వెళ్ళటం అతనికి గుర్తుంది. కట్టెల మోపులను తారు రోడ్డుపైన పెట్టుకొని అమ్ముకునే దృశ్యం కూడా అతనికి గుర్తుంది. శీతాకాలపు రాత్రుల్లో, తల్లి గట్టిగా కరుచుకొని గొనేపట్టలాంటి, ఒక లావాటి దుప్పటిని కప్పుకొని రోజంతా పడుకోవటం కూడా అతనికి గుర్తుంది. తారురోడ్డు అతనికో అందమైన కల. తారు రోడ్డును అద్భుతాలు చూపించే ప్రదేశంలా అతను గుర్తు పెట్టుకున్నాడు. వేగంగా వెళ్ళే వాహనాల్ని అక్కడే చూశాడు. మనుషుల్ని

మోసుకెళ్ళే ఎర్రటి బస్సు, ఒక సాయంకాలం అమ్మతోపాటు తాగిన తీయ టి నీళ్ళు (టీ) కూడా, అతనికి ఇష్టమైన జ్ఞాపకాలు. రోజుల తరబడి ఆహారం తినకుండా గుడిసెలో పడుకునే రోజులు అతనికింకా గుర్తున్నాయి. అమ్మ సారా తాగి, వారం పొడవునా గుడిసెలో నిర్జీవమైన శవంలా పడుండే జ్ఞాపకం, అతని వెంటే ఉంది. అడవిలోకి వెళ్ళటం మానివేసింది అమ్మ. ఎందుకనంటే కారణం చెప్పేది కాదు. అమ్మే కాదు, గూడెం అంతా ఆకలి మరిచిపోయిన వాళ్ళలా రోజుల తరబడి గడిపేవాళ్ళు. పొయ్యి వెలిగేది కాదు. ఉండీ ఉండీ హఠాత్తుగా మనుషులు కనబడకుండా పోయేవాళ్ళు. ఒక రాత్రి గూడెంలోని మనుషులందరూ చనిపోయినట్లుగా కల వచ్చి, లేచి పెద్దగా ఏడ్చుకుంటూ గుడిసెలోంచి బయటకు వచ్చినా అతని ఏడుపును ఎవరూ పట్టించుకోలేదు. ఎంత ఏడ్చినా తల్లి నిద్ర లేవలేదు. చుట్టుపక్కల గుడిసెల్లో అలికిడి లేదు. నిజంగానే అందరూ చనిపోయుంటారని నమ్మాడు అతను. ఆ కల చాలా రోజులు వెంటాడింది అతనిని.

తల్లి రూపం అతనికింకా గుర్తుంది. అడవుల్లో తరచుగా కనబడే ఎర్రపూల చెట్టులా ఉండేది. దువ్వని తల, జుట్టు అటూ ఇటూ గాలికి ఊగుతూ, అచ్చం అడవి పూవులాగే ఉండేది. తల్లి గుర్తుకొస్తే అతనికి దుఃఖం వస్తుంది. తల్లే కాదు, బాల్యపు ఏ సంఘటన గుర్తుకొచ్చినా అతనికి దుఃఖం వస్తుంది. నిజానికి బాల్యం దాటిపోయి దాదాపు ఇరవై యేళ్ళు అవుతుంది. అయితే ఆ కాస్త భాగమే అతని అసలు జీవితం అయినట్లు, మిగిలినదంతా చెరిపివెయ్యాల్సిన కాలం అని అతని నమ్మిక.

"నీ కళ్ళలో, హఠాత్తుగా ఎందుకట్లా నీళ్ళు తిరుగుతాయి" అని అడిగింది మోహిని.

"అమ్మ గుర్తుకొచ్చినప్పుడు, ముఖ్యంగా దయగలిగిన ముఖం, నన్ను చూసినపుడు అమ్మ ముఖంలో వెలిగే నవ్వు- అవన్నీ

గుర్తుకొచ్చి" అనేవాడు.

"మీ అమ్మ నవ్వు ఎట్లా ఉండేది" అని అడిగేది మోహిని.

"నాకు స్పష్టంగా గుర్తు లేదుగానీ, బాగా పూలు పూసినప్పటి అడవిలా ఉండేది. బాగా సంతోషంతో ఉన్నప్పుడు అమ్మ నవ్వే నవ్వు, దోసిళ్ళతో ఏరుకోవాలనిపించేది" అనేవాడు వీర.

తండ్రి గురించిన కథలెన్నో తల్లి చెబుతుంటే, ఇష్టంగా ఉండేది వీరకు. కోపంరాని మనిషిగా అతని గురించి చెప్పేది. ఎప్పుడైనా దుఃఖం వేస్తే అడవిలోకి వెళ్ళిపోయేవాడని, అక్కడే ఉండిపోయి, చాలా రోజుల తరువాత వచ్చేవాడని, వచ్చిన తరువాత, చాలా ఇష్టంగా ఉండేవాడని చెప్పేది.

## 3

వీర ప్రయాణానికి ఏర్పాట్లు సిద్ధమయినాయి. మోహిని దగ్గరుండి, అన్ని వస్తువులు సర్దుతోంది- కొత్తబట్టలు, సెల్‌ఫోను, కెమెరా, వీరకు అంతా కొత్తగా ఉంది. ఈ ప్రయాణం అతనికి ఇష్టంగా లేదు. తను పూర్తిగా మర్చిపోయిన ప్రదేశంలో, మళ్ళీ కొత్తగా తనను పరిచయం చేసుకొని, అదేదో సినిమాలోలాగా, ఒక దేశంనుంచి ఇంకో దేశానికి తరలిపోదామని చెప్పటం (మోజెస్, యూదుల్ని నడిపించినట్లుగా అని మోహిని వివరించింది)- ఇది సాధ్యమేనా? ఈ వ్యవహారంలో తనను ఇరికించినందుకు విసుగ్గా ఉంది వీరకు.

ఆ సాయంత్రం ఇద్దరూ కలిసి స్నేహితుల ఇళ్ళకు వెళ్ళారు. బహుశా ఇంకో మూడు గంటల తరువాత మోహిని అనే ఉత్తేజకరమైన కలలోంచి, తను విడిపోతాడు, తల్లిని విడిచి వెళ్ళే బిడ్డ మనసులా ఉంది వీర మనసు. మధ్యలో మళ్ళీ షాపింగ్ చేసింది మోహిని. వీర కోసం కొత్తవాచీ, లెదర్‌బ్యాగ్. పిల్లవాడిని కాలేజీకి పంపే తల్లిలాగా హడావుడి చేస్తోంది మోహిని.

బజారు నుంచి వస్తూ, అందమైన అపార్టుమెంటులోకి తీసుకెళ్ళింది మోహిని. రెండో ఫ్లోర్‌లో ఉన్న ఇల్లది. ముసలి పనిమనిషి తలుపు తీసింది. "స్వప్న ఉందా? బయటకు వెళ్ళిందా?" అని అడిగింది. లోపల పడుకుని ఉందని, ఒక గదిలోకి తీసుకెళ్ళిందామె.

విశాలమైన హాలు అవతల అందమైన బెడ్‌రూమ్. మంచంపై ఇరవై



యేళ్ళ అమ్మాయి శరీరాన్ని విసిరేసి, స్పృహ లేనట్లుగా నిద్రపోతోంది. నల్లటి ఆమె కురులు మంచంపై పాముల గుట్టలా పరుచుకుని ఉన్నాయి. ఫ్యాను గాలికి జుట్టు పైకి లేచి, మళ్ళీ కిందకు జారి, గ్రీకు కథల్లోని మెడ్యుసాలా ఉందా అమ్మాయి.

ఉలిక్కిపడి నిద్ర లేచిన అమ్మాయిని స్వప్న అని పరిచయం చేసింది. షేక్‌హాండ్ ఇచ్చిందా అమ్మాయి. మృదువైన చేతులు... కొద్దిగా పాలిపోయి ఉన్నాయి. ఇష్టంగా నవ్వి 'హలో' అంది స్వప్న.

స్వప్న రూపం ప్రత్యేకంగా ఉంది. జీవితపు సూత్రాలకు కట్టుబడని మనిషిలా తోచింది. ముఖమంతా తీవ్రమైన అలసట. కళ్ళు వింతగా మెరుస్తున్నాయి, చాలా రోజులు దుఃఖపు తడిలో నానిన పువ్వులా. కంటి పాపలు ఒకటి నీలంగా, ఒకటి నల్లగా ఉన్నాయి. కొంత దుఃఖం, కొంత అలసట, కాస్త ఉత్సాహం- అన్నీ కలిసిపోయి, ముఖం అనేక భావాల కేన్వాస్‌లా ఉంది.

ఎన్నో యేళ్ళుగా దాహంతో ఉన్నట్లుగా పెదాలు ఎండిపోయి ఉన్నాయి. అందమైన పూలతోట, పూలు పూయటం ఆగిపోయినట్లుగా ఉందా ముఖం.

చాలా సేపటి వరకు ఆ ముగ్గురి మధ్యన మౌనం. "స్వప్న చాన్నాళ్ళు చెంచుల మధ్య పనిచేసింది. నాతోపాటు మనోహర్ సంస్థ నుండి బయటకు వచ్చింది. మూడు మరణాల్ని జయించిన వ్యక్తి. తన అనుభవాలు నీకు ఉపయోగపడతాయని ఇక్కడకు తీసుకు



వచ్చాను" అంది మోహిని. స్వప్న అల్మైరా తెరిచి, పెద్ద మందుల పెట్టె తెచ్చింది. క్లోరో క్వినైన్, ఏంటిబయోటిక్స్ ముఖ్యంగా రిఫామ్ సిన్, మెబెండజోల్ అంటూ ఒక్కో మందునే తీసి చూపించింది.

"నా మొదటి మరణం సెరిబ్రల్ మలే రియా" దిగులుతో కూడిన నవ్వుతో అంది. "దాదాపు చావుదాక వెళ్ళి వచ్చాను. గూడా ల్లో తిరిగేటప్పుడు వచ్చింది" అంది స్వప్న. మోహిని దూరంగా జరిగి, కిటికీలోంచి నగ రాన్ని, దాని అవతల ఉన్న శూన్యాన్ని చూస్తోంది.

"నా రెండో మరణం రేప్. పట్టపగలు సి.ఆర్.పి.ఎఫ్. జవాన్లు వాళ్ళ టెంట్‌లోకి

అదంతా కృతకంగా ఉంటుందేమోనని ఆగి పోయాడు. అక్కడి నుంచి పారిపోతే బాగుండు అనిపించింది. ఏదో తెగింపు వచ్చినట్లుగా, ఆ అమ్మాయికి దగ్గరగా వెళ్ళి రెండు చేతుల్ని పట్టుకొని ఏదైనా చెప్పాలని పించి, నోటమాట రాక, ఆ చేతుల్ని అట్లాగే గుండెలపై పెట్టుకొని, ప్రేమగా తలనిమిరి "నేను అద్భుతాన్ని నమ్ముతాను" అన్నాడు.

స్వప్నకు నవ్వు వచ్చింది. "థాంక్యూ" అంది ప్రేమగా. అట్లా అన్నదేగాని, వేరు వేరు రంగులున్న ఆమె కళ్ళలోంచి బాధ తన్నుక వచ్చింది. తట్టుకోలేని దుఃఖంతో పెద్దగా ఏడ్చింది. చాలాసేపు ఆ అమ్మా యిని ఓదారుస్తూ ఉండిపోయారు వీర,



**తెలియని దుఃఖం ఇద్దరినీ వెంటాడుతోంది. జీవించటం, ఇంత కష్టమా అని వ్యథ చెందాడు వీర. జీవితంనిండా ఆనందం నింపుకోవటం మనిషి హక్కని ఇన్నాళ్లు నమ్మేవాడు వీర.**

లాక్కుపోయి" అని ఆగిపోయింది. ఆమె కళ్ళలో నీళ్ళు. నక్సలైట్‌లకు కొరియర్‌గా పనిచేస్తున్నానని వాళ్ళ అనుమానం.

"నా మూడో మరణం హెచ్.ఐ.వి."అంది తాపీగా. వీర ఒక్కసారిగా ఊపిరి ఆగిపో యినట్లయినాడు."నిన్న మొన్నటిదాక యాక్టి వ్‌గా పనిచేసేదాన్ని. నిజంగా ట్రైబల్స్‌కి ఏదైనా చెయ్యాలని నా కోరిక. ఇప్పుడేమీ యాక్టివిటీస్ లేవు. అసలు మనుషులే లేరు నా ప్రపంచంలో. మోహిని మినహాయించి, అందరూ పారిపోయారు, నా జీవితం లోంచి" అంది కళ్ళలో నీళ్ళు తిరుగుతుం డగా.

వీరకు ఇదంతా కొత్తగా, భయంగా ఉంది. ఎందుకో అతని కాళ్ళు వణికాయి. గుండెలోంచి దుఃఖం తన్నుకు వచ్చింది. ఓదార్పు మాటలు చెప్పాలనిపించిందిగానీ,

మోహిని.

"మనం వెళ్దాం" అంటూ మోహిని బయ లుదేరింది. స్వప్న పర్సులో కాస్త డబ్బు పెట్టి, వీర చెయ్యి పట్టుకొని కిందకు నడి చింది మోహిని.

వాళ్ళిద్దరూ మౌనంగానే బజారులన్నీ తిరి గారు. రాత్రెపుడో ఇంటికి చేరారు. మోహిని గదిలో ఇద్దరూ వెంటాడుతున్న నిశ్శబ్దాన్ని నిరోధించలేకపొయ్యారు. బట్టలు కూడా తీయకుండా అట్లాగే మంచంపై కూలబడిం ది మోహిని. కుర్చీపై వీర. తెలియని దుఃఖం ఇద్దరినీ వెంటాడుతోంది. జీవిం చటం, ఇంత కష్టమా అని వ్యథ చెందాడు వీర. జీవితంనిండా ఆనందం నింపుకోవటం మనిషి హక్కని ఇన్నాళ్లు నమ్మేవాడు వీర. కానీ చాటునుండి మరణపు స్పర్శ మనల్ని రాసుకుంటూ వెళ్ళటం వీరని వణికిస్తోంది.

ఇదంతా దేన్నికైనా సంకేతమా అని ప్రశ్నించుకున్నాడు వీర. ఎన్నో విషయాల్ని వివరించి చెప్పే మోహిని కూడా ఏం మాట్లాడలేదు.

"హాస్పటల్‌కి వెళ్ళి రెగ్యులర్‌గా చెకప్ చేయించుకో" అన్నాడు, మోహిని దగ్గరగా వెళ్ళి ముందుకు పొడుచుకొచ్చిన ఆమె పొట్టను ప్రేమగా నిమిరి "సంతోషం మానవుడి హక్కు అని ప్రకటించే శిశువు వీడు" అన్నాడు.

మోహినికి నవ్వు వచ్చింది. వీర అంత ఎమోషనల్ కావటం ఆమెకు ఆశ్చర్యంగా ఉంది. "వెళ్ళు బ్యాగ్, సూట్‌కేసు సర్దుకో" అంది. "దుఃఖం, మరణం మనుషుల పైన దాడి చెయ్యని ప్రపంచం ఎక్కడైనా ఉందా!" అన్నాడు ఇంకా అదే మూడ్‌లో.

లేచి, వీరాని దగ్గరకు తీసుకొని తలనిమిరి "నీ హృదయం నిర్మలమైంది. నీలాంటివాళ్ళే సాధించాలి, అట్లాంటి ప్రపంచాన్ని ఎప్పటికైనా" అంది. హఠాత్తుగా మోహినికి దుఃఖం వచ్చింది. కళ్ళ నిండా నీళ్ళు. గుండె ఎగిసి పడేలా వెక్కివెక్కి ఏడ్చింది. వీర కంగారు పడ్డాడు. మోహినిని గట్టిగా హత్తుకొని, ఓదార్చాలని చూశాడు. చాలా సేపటిదాకా ఆమె ఏడుస్తూనే ఉంది. కన్నీళ్లతో తడిసిన మోహిని ముఖం కొత్తగా ఉంది వీరకు. తనకు ప్రియమైన మోహినిలోంచి ఓ అపరిచితురాలు బయటకు రావటం చూసి హతాశుడైనాడు. దుఃఖం, దిగులు తప్ప, మనుషులకు, మధురస్పందనలు కలిగే కాలం రాదా ఇదని ప్రశ్నించుకున్నాడు.

మోహిని దగ్గర సెలవు తీసుకొని బస్సెక్కుతున్నప్పుడు వీర కళ్ళలో నీళ్ళు తిరిగాయి. గుండెలో అలజడి పెరిగింది. మోహిని ముఖం నిశ్చలంగా ఉంది. వ్యూహకర్త చూపే నిబ్బరం ఆమెలో కనిపిస్తుంది. అయితే మోహిని కళ్ళలో నీటిపొర కనపడీ కనపడక తళుక్కుమనింది. వీరకు ఆనం

దమూ, దుఃఖమూ- రెండూ కలిగాయి. ఈ ప్రయాణమంతా పజిల్‌లా ఉంది. గూడా నిదో, గ్రామానిదో దాని పునరావాసం, రెవిన్యూ అధికార్లో, గిరిజన సంస్థలో చేయాల్సి వుండగా, వీర అనే వ్యక్తి ఒక తెగ మొత్తాన్ని ఉద్ధరించాలని బయలుదేరటం ఆశ్చర్యంగానూ, మిస్టరీగాను ఉంది. ఇది ఒక ఉద్యోగంలాగా అనుకోమంటుంది మోహిని. ప్రాజెక్టు పూర్తి అయితే పది లక్ష లదాకా ఆదాయం వస్తుంది అంటుంది. మార్కాపురం దగ్గరలో వాళ్ళకోసం సేకరిం చిన స్థలాల డాక్యుమెంట్లు అతని సంచిలో ఉన్నాయి. ఆ స్థలాల్లో ఇళ్ళు నిర్మించే కాంట్రాక్టు మరో సంస్థది. వాళ్ళను వాళ్ళ నివాసాల్లోంచి తరలించటంతో వీర బాధ్యత ముగుస్తుంది. ఇదంతా ఒట్టి ఫిక్షన్‌లా అని పించసాగింది వీరకు. పాతాళభైరవిలో నిముషాల్లో రాజమహల్ నిర్మించిన నేపాళ మాంత్రికుడు గుర్తుకొచ్చాడు. తను తోటరా ముడి పాత్ర నిర్వహించాలి కాబోలు అనుకో గానే సన్నటి నవ్వు వెలిగింది వీర ముఖంలో. మోహిని వీర ముఖంలోని అన్ని ఆలోచనల్ని చదవగలుగుతుంది. వద్దు వెనక్కు వెళ్దాం అని అనాలనుకొని, మళ్లీ ఆగిపోయింది. తన సంస్థ పెరగాలి. ఆద ర్శాల కాలం వెళ్ళిపోయింది. పోరాటాల చివరన కాస్తంత సుఖ జీవితాన్ని అను భవించే హక్కు తనకుంది. అందుకే ఈ వీర ప్రయాణం కొనసాగాలి అనుకుంది.

బస్సు నల్లమల అడవుల ప్రాంతానికి వస్తూనే తనలో ఒక సంచలనం కలగటం గమనించాడు వీర. చిన్నతనంలో అతను నడిచిన భూములివి. ఇవే కాకపోవచ్చు ఇలాంటివే. చెట్లను వరుసుకుంటూ వీచేగా లులు తనకు చిరపరిచితమైనవే. సుయ్ మంటూ శబ్దాలు చేస్తూ వీచే గాలులు ఆత్మల గానంలా వినిపించాయి.

వీరకు బస్సు దిగి అట్లా అడవుల్లోకి పరి గెత్తుకుంటూ వెళ్ళాలనే కోరిక కలిగింది. బస్సులోంచి చూస్తుంటే అడవి బాల్యయవ్వ నాల్ని కోల్పోయి వృద్ధ మాతలాగా కనబడ సాగింది. అక్కడడక్కడ ఖాళీ గూడాలు, కూలిపోయిన గుడిసెలు, మనుషులందరూ సామూహికంగా వలస పోయినట్లుగా, ఎండుకట్టెల మోపుల్ని రోడ్లపైన పెట్టుకొన్న గిరిజన స్త్రీలు, తుపాకులు మోసుకెళుతున్న పోలీసులు, తనకు పరిచయమైన అడవి ఇది కాదేమో అనిపించింది వీరకు. అడవి మధ్య నున్న ఒక బస్సు స్టేజీ దగ్గర (లోపలెక్కడో గూడమో, ఊరో ఉండి ఉంటుంది) అతి చిన్న ఎన్.టి.రామారావు విగ్రహం కనిపిం చింది. దగ్గరగా చూస్తే తప్ప అది ఎన్. టి.రామారావు విగ్రహంలా లేదు. పొట్టిగా ఏ వృద్ధ చెంచు మనిషో అనుకుంటాం. అయితే నడుంపై చెయ్యి, ప్రపంచం వైపుకు సాచిన మరో చెయ్యి, ఆ భంగిమతోటే అది రామారావు విగ్రహం అనుకుంటాము. రామారావు విగ్రహం అక్కడ ఉండటం ఆశ్చర్యం కలిగించింది వీరకు. ఆయన అను కున్న రామరాజ్యం(?)లోకి గిరిజనుల్ని రమ్మని పిలుస్తున్నాడా? ఆయనకే దిక్కు లేని ఆయన రాజ్యంలోకి ఆహ్వానమా అని నవ్వుకున్నాడు వీర.

టీ కోసం బస్సు ఆపినచోట, బస్సు దిగి, ఉద్వేగంతో ఆకుపచ్చని చెట్లవైపు నడిచాడు. మిగిలిన వాళ్ళంతా బస్సులో నిద్ర పోతు న్నారు. పూర్తిగా వెలుతురు రాని ఉద యంలో, పక్షి ఏదో 'కేవ్'మంటూ అరిచింది. ఉలిక్కిపడ్డాడు వీర. ఆ తరువాత మొత్తం అడవంతా పక్షుల అరుపుల బృందగానం అయింది. ఈ అరుపులన్నింటిలో ముందు అరిచిన పక్షి గొంతు ప్రత్యేకంగా ఉంది. కాస్త లోపలికి వెళ్ళి పచ్చగా నవనవలాడు తున్న ఒక చెట్టును కౌగలించుకొని, "గుడ్ మార్నింగ్" అంటూ సన్నగా గొణిగాడు. చెట్టు అతనికి ప్రతిస్పందన ఇస్తున్నట్లుగా,

## నిద్ర లేమిని నివారించండిలా...

మానసిక రోగులు, ఫ్యాక్టరీల్లో రాత్రి డ్యూటీలు చేసే వాళ్లు నిద్రలేమి (ఇన్‌సోమ్నియా)తో తరచూ బాధపడుతుంటారు. నిద్రలేమి వల్ల శారీరక పరిస్థితిలో మార్పు జరిగి, రక్తంలో గ్లూకోజ్ ఎక్కువై మధుమేహ వ్యాధి వచ్చే ప్రమాదం ఉంది.

నిద్రలేమి నుండి బయట పడటానికి, రాత్రిళ్ళు కాంతిమంతమైన లైట్ల వెలుగులో నిద్రించకుండా, "ఈ రోజు హాయిగా నిద్ర పోగలను" అని మానసికంగా సిద్ధపడి నిద్రకుపక్రమించండి. ఉదయం నిద్ర లేవగానే మార్నింగ్ వాక్‌కి వెళ్తూ "నా దినచర్యను ఈ రోజు ప్రశాంతంగా ప్రారంభిస్తున్నాను" అని ఆలోచిస్తూ రోజువారీ కార్యక్రమాన్ని ప్రారంభిస్తే మానసిక విశ్రాంతి పొంది రాత్రిళ్లు చక్కగా నిద్ర పోగల్గుతారు. మూడు, వారాలు ఈ పద్ధతిని ఆచరించగలిగితే అది అలవాటుగా మారి హాయిగా నిద్రించగలుగుతారని" న్యూయార్క్‌కి చెందిన స్లీప్ డిజార్డర్ సెంటర్ స్పెషలిస్ట్ డాక్టర్ నీర్ కొవే ఘంటాపథంగా చెబుతున్నారు.

ఒక నిర్ణీత సమయానికి నిద్రకుపక్రమించడం, ఒకే సమయానికి నిద్ర లేవడం, పరిశుభ్రమైన వాతావరణంలో నిద్రించడం, నిద్రించబోయే ముందు హెర్బల్ టీ తాగటం వంటివి మన శరీరానికి తగిన విశ్రాంతిని, మంచి నిద్రని అందిస్తాయని, విత్తనాలు, పళ్ళు, కూరగాయలు, తక్కువ ప్రోటీన్లు వుండే ఆహారం మంచి నిద్రని ఇస్తాయని ఫ్లోరిడాకు చెందిన లిసాడెరో సిమో అనే న్యూట్రిషనిస్ట్ పేర్కొంటున్నారు. పని వత్తిడి, మానసిక వత్తిళ్ళు నిద్రపై ప్రభావం చూపుతాయి. దీనినుండి బయట పడేందుకు నిద్రపోయే ముందు ఆల్కహాలు, కెఫిన్, నికోటిన్ వంటి వాటిని దూరంగా ఉంచితే నిద్రలేమినుండి బయట పడవచ్చని... వాషింగ్టన్‌కి చెందిన జెరాల్డ్ లియోల్ అనే హృద్రోగ నిపుణుడు సూచిస్తున్నారు.



ఆకులతో చప్పుడు చేసింది.

మరికాస్త లోపలికి నడిచాడు వీర. వందలాది, వేలాది చేతులతో ఎవరో అతన్ని ఆహ్వానిస్తున్నట్లుగా ఉంది. అతని చెవులకు మాత్రమే వినపడేలాగా ఏదో సంభాషణ. లోపలికి వెళ్ళేకొద్దీ పాదాలకు మెత్తగా అల్లుకుపోతున్న గడ్డిమొక్కలు, పొదలు, అడవి, తన శరీరాన్ని మెల్లగా అతని చుట్టూ పెనవేస్తున్నట్లుగా అనిపించసాగింది. ఒకచోట ఆగి, నేలపై కూలబడి, మోకాళ్ళను భూమికి ఆన్చి దూరంగా బస్సు హారన్, కండక్టరు అరుపులు వినబడ్డాయి. స్వప్నమేదో చెదిరినట్లుగా, వెనక్కు నడిచాడు వీర. ఆకుపచ్చని వాసనేదో అతని చుట్టూ అలుముకుంది. అతను వడివడిగా నడుస్తుంటే పిట్టలన్నీ చెదిరిపోయి అడవి మొత్తానికి, ఈ అపరిచితుడి గురించి సందేశం పంపాలని ఎగిరి వెళుతున్నట్లుగా ఉంది.

అతని ప్రస్తుత గమ్యస్థానం మార్కాపురం. అక్కడ అతను అలల సుందరం

అనే మనిషిని కలవాలి. ఈ అలల సుందరం చెంచుగూడాలకు దగ్గరగా ఉన్న గ్రామానికి చెందిన యువకుడు. రకరకాల రాజకీయ సమీకరణాల కారణంగా, అతను ఈ మధ్యనే మండల పరిషత్ ఛైర్‌పర్సన్ అయ్యాడు. అతని సహకారం తీసుకొమ్మని మోహిని ఆదేశం.

"నేను ఈ గూడాల్లోనే పుట్టాను. గూడెం పేరు, ప్రదేశం గుర్తులేవు గానీ, నేను చెంచుల మనిషినే. నా తల్లి బతికి ఉంటే, ఈ గూడాల్లోనే ఉండి ఉంటుంది" అన్నాడు వీర, పరిచయం చేసుకుంటూ.

"నిన్ను చూస్తే చెంచుల మనిషిలా లేవే" అన్నాడు అలల సుందరం. ఏం మాట్లా

గుండె చప్పుళ్ళు వింది. అంతా పర్‌ఫెక్ట్ అంది. ఆ చప్పుళ్ళు నాకూ వినిపిస్తుంటాయి. ముఖ్యంగా రాత్రుళ్ళు పడుకునేటప్పుడు. వాడు నాతో సంభాషిస్తుంటాడు. 'లోపల గొప్ప సుఖంగా ఉంది. నన్ను బయటకు రమ్మన వద్దు' అంటాడు. వాడి శరీరంలోని ప్రతి అవయవం నన్ను ముట్టుకొని, ప్రేమగా నన్ను నిమురు తున్నట్లుగా ఉంది" మోహిని పూర్తి ట్రాన్స్‌లో ఉంది. మాతృ స్వప్నాల పరవశంలో ఉంది.

అలల సుందరం గురించి చెప్పాడు. "ఎవరూ ముందుకు రారు. అయినా నిరాశపడకు. ముందుకు వెళుతూనే ఉండు. మీ అమ్మ కనబడేదాకా ప్రయాణిస్తూనే



**ముంపు సమయానికి తట్టా, బుట్టా తీసుకొని వాళ్ళే ఎటోకటు వెళ్ళిపోతారు. మీరు ఏకంగా ఇళ్ళే కట్టేస్తామంటున్నారు. వాళ్ళు అడవుల్ని వదిలి వస్తారా అనేది సమస్య.**

డాలో తెలియలేదు వీరకు.

"ఇక్కడంతా గొడవగా ఉంది. ముంపు గ్రామాల జనం, రోజూ నిరసనలో, ధర్నాలో చేస్తున్నారు. ఇదో పెద్ద లా అండ్ ఆర్డర్ సమస్య అయ్యింది. అఖిలపక్ష కమిటీ అని ఒకటి తయారైంది, అన్ని పార్టీలతో. చెంచు గూడాల గురించి ఎవరూ పట్టించుకోవటం లేదు. ముంపు సమయానికి తట్టా, బుట్టా తీసుకొని వాళ్ళే ఎటోకటు వెళ్ళిపోతారు. మీరు ఏకంగా ఇళ్ళే కట్టేస్తామంటున్నారు. వాళ్ళు అడవుల్ని వదిలి వస్తారా అనేది సమస్య. అయినా ట్రై చేయండి" అన్నాడు అలల సుందరం నిర్లిప్తంగా. 'ఇంక నాతో మాట్లాడేది ఏమీలేదు, నువ్వింక వెళ్లచ్చు' అన్నట్టుగా చూశాడు.

మోహినికి ఫోన్ చేశాడు. ఫోన్ చేసే సమయానికి మోహిని, హాస్పిటల్‌లో ఉంది, గైనకాలజిస్టు దగ్గర. "డాక్టర్ ఇప్పుడే వాడి

ఉండు" అంది ప్రవక్తలా.

కాసేపాగి, "జేబులో గుర్తింపుకార్డులు పెట్టుకొని తిరుగు. పోలీసులతో జాగ్రత్తగా ఉండు" అంది చివరగా. "గొట్టిపడియ గ్రామంలో నవమణి అనే దళిత నాయకురాలు ఉంది. గూడెంలో జనం ఆమె మాట వింటారని చెబుతారు. ఆమెను కలువు. ఈ అలల సుందరం ఆమె కొడుకే" అంది.

మోహినితో మాట్లాడినాక, వీరలో కొత్త ఉత్సాహం వచ్చింది. మంత్రించినట్లుగా అలసటంతా ఎగిరిపోయింది. ఆ పూట అక్కడే ఉండి, సాయంకాలం గొట్టుపడియ గ్రామానికి బయలుదేరాడు.

## 4

గొట్టిపడియ గ్రామ చరిత్ర జ్ఞాపకాల పుటల్లోంచి పుట్టింది. ముసలివాళ్ళ ఒళ్ళో కూర్చుని, వాళ్ళ మనవళ్ళో మనవరాళ్ళో విన్న ముచ్చటల్లోంచి పుట్టింది. రాత్రిపూట

వెన్నెల్లో పిల్లల తలలు నిమురుతూ, పెద్ద వాళ్ళు కథలుగా ఎరుక పరిచిన నిజాల్లోంచి పుట్టింది ఆ గ్రామ చరిత్ర. ఆ గ్రామ చరిత్రలో ముఖ్యమైన ఘట్టం నవ మణి.

మరో కొద్ది నెలల్లో లేదా సంవత్స రంలో గొట్టిపడియ అదృశ్యం అవు తుంది. వెలిగొండ ప్రాజెక్టుల పని పూర్తి అయితే గొట్టిపడియతో సహా పదిహేను గ్రామాలు, రెండు చెంచుగూడాలు జల మయం అవుతాయి.

వీర ఆ గ్రామం చేరేసరికి, గ్రామం మొత్తం నవమణి ఇంటిముందు మూగి, గ్రామ చరిత్రను, ఆమె కథను కలగలిపి చెప్పుకుంటున్నారు.

నవమణి ఆ ఉదయమే చనిపోయింది. విడిచివెళ్ళిన వాళ్ళు పోగా గ్రామంలో మిగిలి ఉన్నవాళ్ళు, పక్కగ్రామాల జనం, నవమణి ఇంటి ముందు మూగారు. ఎక్కడ చూసినా దుఃఖపు చప్పుడే.

ఆ చుట్టుపక్కల ఎన్నో గ్రామాల్లో, ఎంతో మందికి వూపిరి (పురుడు) పోసిన పురుడు దాదీ నవమణి. గ్రామమంత వయసు ఆమె ది. భుజాలు వంగిపోయి, వార్ధక్యం ముంచు కొచ్చినా, ముఖం నిండా వందలాది ముడు తలు రేగినా, వెడల్పాటి ఆమె కళ్ళలో, గొప్ప వెలుగు కనిపించేది.

ఆమె కొడుకు అలల సుందరం మండల పరిషత్ అధ్యక్షుడిగా పదవీ స్వీకారం చేసి నాలుగు నెలలే అయ్యింది. అతను గెలిచి నరోజు గొట్టిపడియ గ్రామంలో గొప్ప



ఆనందం... జనం రోడ్డుపై ఊరేగింపులు తీశారు, గులాలు చల్లుకొంటూ, తప్పెట్లు, టపాసుల మోతలో పండుగ చేసుకొన్నారు. అలల సుందరం గెలవటమంటే గొట్టిప డియ బతికి పోయినట్లే అనుకున్నారు. ఆ ఆనందం చూసి నవమణి దిగులు పడింది. అలల సుందరం గెలిచాడు గానీ గ్రామం గెలవలేదని ఆమెకు తెలుసు. చాలా రోజులు ఆమె కలల్లో వరదలుగా నీళ్ల కని పించేవి.

అలల సుందరానికి కబురు వెళ్లింది, ఇప్పుడో మరి కాస్సేపటిలో వస్తాడంటు న్నారు.

ఒక్కొక్కళ్ళే నవమణి శవం దగ్గరకు వచ్చి, ముఖానికి కప్పి ఉన్న సన్నటి గుడ్డను పైకి తీసి, ప్రశాంతంగా నిద్రిస్తున్నట్లున్న ముఖా న్ని చూసి పెద్దగా రోదిస్తున్నారు.

వీర ఆ వాతావరణానికి కదిలిపోయేడు. ఆమెకు దగ్గరగా వెళ్ళి పెద్దగా రోదించాలని పించింది.

నవమణి నెల రోజుల క్రితం మార్కాపు రంలో అఖిలపక్ష కమిటి ఏర్పాటు చేసిన మీటింగ్‌లో మాట్లాడటం గురించి జనం గుసగుసలాడుకుంటున్నారు. అంత వయ సులో ఆమె మార్కాపురం దాక వెళ్లటం ఆశ్చర్యమే. వెళ్ళి, కొడుకుకు వ్యతిరేకంగా అతనికి ఇష్టం లేనటువంటి మాటలు మాట్లాడటం అందరినీ అబ్బురపరిచింది.

నవమణి ఆ రోజు ఆవేశంతో ఊగిపో యింది. సుదీర్ఘమైన ఆమె ఉపన్యాసం ఇప్ప టికీ వాళ్ల చెవుల్లో వినిపిస్తూనే ఉంది.

"గొట్టిపడియ నుంచి వెళ్ళిపోయిన వాళ్ల సంఖ్యే ఎక్కువ. ఊళ్ళో ఇవాళ కిరాణా కొట్టు లేదు. టీ బంకు లేదు. బళ్ళు లేవు. పంతుళ్లు లేరు. బస్సులు రావటం మానివే శాయి. ఆఖరికి శ్మశానం కూడా ఊరిని దాటి వెళ్లింది. గుడి ఉందిగాని పూజారి లేడు. ఏపుగా ఎదిగి పచ్చగా నవనవలాడు తోంది పచ్చిక. తినడానికి పసరాలు లేవు. రోజురోజుకీ ఊళ్ళో ఉండే వాళ్లు తగ్గిపోతు న్నారు. గొట్టిపడియ చచ్చిపోతుంది."

"నా చిన్నతనంలో ఒకసారి వరుసగా పదేళ్ళు వానలు లేక కరువు విరుచుకుపడిం ది. పిట్టల్లా రాలిపోయారు జనం. కలబంద, ఏరుగడ్డ తిని బతికారు జనం. పెళ్ళిళ్ళు లేవు. పిల్లల్ని కనటం లేదు. గొట్టిపడియలో ప్రతి ఇంటి కథా నాకు తెలుసు. ఆ మూడే ళ్లలో ఒకే ఒక కాన్పు చేశాను. చాకలి రంగమ్మ కూతురుది. ఊరు ఊరంతా పండుగ చేసుకున్నారు, చావులు ఆగిపోయా యని. నా పెనిమిటి తాలుకు వాళ్లకు పదె కరాలు మాన్యం ఉండేది. మాదిగోళ్లలో ఆసాములు వాళ్లు. ఇప్పటికీ ఆ మాదిగ మాన్యం మా ఏలుబడిలోనే ఉంది. మిసమి



సలాడే చీనీకాయలు బస్తాలు బస్తాలు దిగేవి."

"ఇరవైయేళ్ల క్రితం ఊళ్లో గొడవలు జరిగాయి. మాదిగలు, గొల్లలు కొట్టుకున్నారు. తలకాయలు పగిలాయి. మగోళ్లంతా మార్కాపురం జైళ్లలో ఉన్నారు. పది నెల్ల కొడుకును సంకనేసుకొని అడవులవైపు పరిగెత్తాను. చెంచుల గూడాల్లో తలదాచుకున్నాను. కడుపులో పెట్టుకొని చూసుకున్నారు."

"నా పెనిమిటి టి.బి.తో పొయ్యాడు. ఒంటిచేత్తో పదెకరాల మాన్యాన్ని సాగు చేశాను. పురుళ్ళు పోసుకునే లంజ, దీనికెంత నీలుగు అని ముక్కున వేలు వేసుకున్నారు. పంటచేల మధ్యన కూర్చుంటే అవి నేను, బొడ్డు కోసి, పురుడు పోసిన పిల్లల్లాగే కనిపిస్తాయి."

"మనకెందుకే ఈ భూముల మీద భ్రమ



**ఇళ్లన్నీ ఖాళీ అయినాయి. ఈ ఏడాది పండుగల్లేవు. ఇళ్లలో దీపాలే వెలగలేదు. మనకెందుకీ ఖర్మ? మన ఊళ్లే మనకు సమాధులెందుకు కావాలి?**

అనేవాడు నా కొడుకు. ఇప్పుడు చాలా గొప్పోడయ్యాడులే. నాజూకైన మనిషి. సిటీ లో చదుకున్నవాడు. 'ఎందుకే నీకీ భ్రమ' అంటూ తిట్టేవాడు. ఈ ఊరులోనే చావాలి నేను అనేదాన్ని. తల్లిలా సాకి, పిడికెడు గింజల్ని ఇచ్చి ప్రాణాలు నిలిపిందీ ఊరు."

"ఇళ్లన్నీ ఖాళీ అయినాయి. ఈ ఏడాది పండుగల్లేవు. ఇళ్లలో దీపాలే వెలగలేదు. మనకెందుకీ ఖర్మ? మన ఊళ్లే మనకు సమాధులెందుకు కావాలి? "

నవమణి మాటలు మీటింగ్ కొచ్చిన జనాన్ని కదిలించాయి. మీటింగ్ అయినాక అఖిలపక్ష కమిటీకి గౌరవ అధ్యక్షురాల్ని చేశారు.

సాయంకాలపు గాలులు బలంగా వీస్తున్నాయి. కబుర్లలోంచి నవమణి జ్ఞాపకాలు వెలికి వస్తున్నాయి. ఆ ప్రదేశమంతా ఆమె జ్ఞాపకాల గుర్తులే. ఒక్కసారి పైకి లేచిన ధూళిలోంచి వందలాది నవమణి జ్ఞాపకాలు పైకి లేచి, ఆమె సజీవంగా అక్కడ నడిచిన చప్పుడు.

అలల సుందరం ఇంకా రాలేదు. హైదరాబాదు నుంచి జిల్లా నాయకులు వచ్చారు. వాళ్లు వెళ్ళిన వెంటనే వస్తానని కబురు చేశాడు. అరగంట క్రితం తానిక రానని, దగ్గరి బంధువు ప్రేమసుందరంతో కర్మకాండ కానివ్వమని కబురు పంపాడు.

ఇప్పుడో పెద్ద రాజకీయ జంతువుగా పరిణామం చెందిన అలల సుందరం సంవత్సరం క్రితం, రాజకీయాలు, ఉద్యమాల గురించి తెలియని పొలిటికల్ అజ్ఞాని.

మార్కాపురానికి చెందిన ఒక కమ్యూనిస్టు నాయకుడి కూతురితో ప్రేమ కథ నడుస్తుండేది. అరుణ ఆ అమ్మాయి పేరు. అలల సుందరం వ్యక్తిత్వంలోని నిర్లక్ష్యం, మొండితనం, పద్ధతులపైన, క్రమశిక్షణల పైన ఉండే కసి అరుణకు బాగా నచ్చాయి. 'మన కమ్యూనిస్టు కుటుంబాల్లో' అంటూ పదే పదే ఇంట్లో గుర్తు చేయటం అరుణకు కోపంగా ఉండేది. సినిమాలూ, షికార్లు, ఫ్యాషన్లు అన్నింటినీ 'బూర్జువా' లక్షణాలని కొట్టి పడవేసే తండ్రి అంటే కోపం అరుణకు. అలల సుందరాన్ని ఇంటికి తీసుకెళ్ళినపుడు, తండ్రి అతన్ని సాదరంగా ఆహ్వానించటం అరుణకు ఆశ్చర్యమే.

శ్రీశ్రీ, గురజాడల పేర్లు కూడా అలల

సుందరం వినకపోవటం, మార్క్స్, లెనిన్‌ల గురించి ఏమీ తెలియకపోవటం ఆయన్ను బాగా నిరుత్సాహపరచాయి.

ఆ నిరుత్సాహంలో ఉండగానే, అలల సుందరం దళిత కుటుంబానికి చెందినవాడని చెప్పింది అరుణ. ఒకప్పుడు కులాంతర వివాహాలు సాధారణమైన కమ్యూనిస్టు కుటుంబాల్లో, ఇవాళ, రేపు అన్నీ కులం సరిహద్దుల్లోనే జరుగుతున్నాయి. బొత్తిగా రాజకీయ పరిజ్ఞానం లేని కుర్రాణ్ణి తమ కుటుంబంలోకి ఆహ్వానించటం- అదీ దళితుణ్ణి ఇష్టం లేదు అరుణ తండ్రికి. జిల్లా కమిటీతో చర్చించి నిర్ణయం తీసుకుంటానని చెప్పాడు.

దండోరా ఉద్యమం తీవ్రంగా ఉన్న మార్కాపురం ప్రాంతంలో ఈ ముచ్చట ఓ కార్చిచ్చు అయ్యింది. కమ్యూనిస్టు నాయకులు దళిత వ్యతిరేకులన్న ప్రచారంతోపాటు కరపత్రాల పంపిణీ, ఊరేగింపులు, బహిరంగ సభలు జరిగాయి. ఈ హడావుడిలో అలల సుందరం వార్తల్లోని వ్యక్తి అయ్యాడు. జిల్లా కమిటీ ఇరుకున పడింది. పంచాయతీ ఎలక్షన్ల నేపథ్యంలో ఈ గొడవ పార్టీ విజయాలకు విఘాతమవుతుందని ముఖ్యంగా వినుకొండ చుట్టుపక్కల గ్రామాల్లో, కమ్యూనిస్టు ప్రాబల్యం ఉన్న ప్రాంతాల్లో దళిత వ్యతిరేకముద్ర పడితే ఓట్లు పడే ఛాన్సు లేదని వాళ్ళకు తెలుసు. అరుణ తండ్రిపై ఒత్తిడి పెరిగింది. రాజకీయ పరిజ్ఞానం అనేది క్రియాశీలక కార్యక్రమాల్లో పాల్గొంటే అదే వస్తుందని, అలల సుందరాన్ని పార్టీ తరఫున పంచాయతీ ఎలక్షన్లలో నిలబెట్టమని పార్టీ జిల్లా కమిటీ ఆదేశించింది. ఎలక్షన్లలో గెలిచినాక అరుణనిచ్చి పెళ్ళి చేయమని కూడా తీర్మానించింది.

గోడలమైనా, కరపత్రాల్లో ఎటు చూసినా అలల సుందరం పేరే. అలల సుందరంలో కొత్త ఆశలు రేగాయి. తననో గొప్ప వ్యక్తిగా ఊహించుకోవటం మొదలుపెట్టాడు. గెలుపుపై కోరిక, ఆశ కలిగాయి. ముంపు గ్రామాల ఉద్యమం ప్రధానాంశమైన ఎన్నికల్లో, దళితుల్ని ఉద్యమానికి దూరం చేస్తానే షరతుతో కాంగ్రెస్ సపోర్టు తీసుకున్నాడు అలల సుందరం. ఎన్నికల్లో గెలిచాడు. అరుణని పెళ్ళి చేసుకున్నాడు. క్రమంగా తన చుట్టూ ఒక కాంతివలయాన్ని ఊహించుకోవటం మొదలుపెట్టాడు. తల్లి ఐక్యవేదిక సభలో మాట్లాడటం అతనికి రుచించలేదు. అకారణంగా ఆమెను దూషించాడు. ఆమె మనసును గాయపరచాడు.

నవమణి శవం కదిలింది. శవం వెనుక వరదలా జనం. ఒక దళిత స్త్రీ మరణానికి అంతమంది తరలిరావటం ఆ ప్రాంతాల్లో ఒక వింత. చనిపోవడానికి ముందురోజు కూడా గ్రామం కోసం పోరాడింది. రెండుసార్లు హైదరాబాద్ వెళ్ళింది. స్తబ్దంగా ఉన్న గ్రామాల్లో అలజడి రేగింది. జనంలో మళ్ళీ కదలిక వచ్చింది.

### ముత్తాత

శ్రీశ్రీ, ఆరుద్ర, నారాయణరెడ్డి ఇత్యాది కవులంతా హాజరైన వేదిక. ఆ సమయంలో శ్రీశ్రీ గురించి మాట్లాడుతూ నారాయణరెడ్డి 'మీరు ముత్తాత' అన్నారు.

శ్రీశ్రీ సహా అంతా ఆశ్చర్యపోయి చూస్తుంటే- 'అవును.. సాహిత్యంలో మూడుతరాలకు మీరు తాత.. అందుకే మిమ్మల్ని ముత్తాత అంటున్నాను' అని వివరించి అందరినీ నవ్వించారు.



నిద్రపోతున్న మనిషి ముఖంలా ప్రశాంతంగా ఉందామె ముఖం. బహుశా ఆమె ఆత్మ ఊరు చుట్టూ తిరుగుతూనే ఉండి ఉంటుంది. పొలిమేరల దగ్గరున్న గుడి దగ్గరే (ఇప్పుడు దాదాపు శిథిలమైంది) ఆమె ను ఖననం చెయ్యాలని నిర్ణయించారు. ఆ గుడిలో నలుగురు గ్రామదేవతలుండేవాళ్ళు (అక్క చెల్లెళ్లు). చాలా ఏళ్లపాటు ఊరంతా భక్తిశ్రద్ధలతో అక్కడ పూజలు చేసేవాళ్ళు. చనిపోయే ముందుదాకా కూడా నవమణి ఆ గుడిలో పూజలు చేస్తూ ఉండేది. ఊరి ముంగిటే ఉన్న ఆ గుడి, ఊళ్ళోకి నీళ్ళు రాకుండా కాపాడుతుందని ఆమెకు నమ్మకం ఉండేది. గ్రామదేవతల గురించి తమాషా అయిన కథ ఇప్పటికీ ప్రచారంలో ఉంది. చెప్పుకున్నారు.

ఇళ్ల కప్పులపైన, మిద్దెలపైన ప్రత్యక్షమయ్యేవట ఆ గ్రామదేవతలు. చీనీకాయల్ని వలుచుకొని తింటూ, తొక్కల్ని జనాలపై విసిరేస్తూ, నవ్వుకుంటూ, కబుర్లు చెప్పుకుంటూ గడిపేవట. ఇప్పుడు గ్రామ పెద్ద భూమయ్య తాత (సింగయ్య)ను వీధి మధ్యలో ఆపి "ఒరే సింగా, రాత్రికి కోళ్ళు కోయించరా, ఆకలిగా ఉంది" అన్నాయట.

ఆయన ధైర్యం చేసి కళ్ళు పైకెత్తి వాళ్ల వైపు చూశాడట (దేవతల రూపురేఖల గురించి ఊరంతటికీ వర్ణించి చెప్పింది ఆయనే). బంగారు రంగు కళ్ళు, మన చేతివేళ్ళ కన్నా లావాటి వేళ్ళు, పాచిపట్టిన పళ్ళు, దువ్వని తల, వాళ్ళ చుట్టూ మెరుస్తున్న



**బంగారు రంగు కళ్ళు, మన చేతివేళ్ళకన్నా లావాటి వేళ్ళు, పాచిపట్టిన పళ్ళు, దువ్వని తల, వాళ్ళ చుట్టూ మెరుస్తున్న వెలుగు. "ఎక్కడ నుంచి వచ్చారు?" అని అడిగాడు.**

అది కథ కాదు నిజంగా జరిగిన విషయమే అనేది నవమణి.

నవమణికి అప్పుడు ఆరేళ్ళు. తోటల్లోంచి చీనీకాయలు దొంగలించినందుకు ఆమెను చెర్నాకోలతో కొట్టి ఊరి మధ్యన గుంజకు కట్టివేశారు.

ఆ రాత్రి ఊళ్ళో నలుగురు గ్రామదేవతలు అవతరించారు. ఊరు నివ్వెరపోయింది. ఊరి చివరన ఉన్న గుడిలోని నలుగురు అప్పచెల్లెళ్లు గ్రామం మధ్యలోకి వచ్చారు. ఊరు భయంతో వణికిపోయింది. కొంగులో నిప్పుల్ని మూటగట్టుకొని వచ్చి చీనీ తోటల్ని తగలబెట్టటం ఊరంతా చూసింది. వారం రోజులదాకా మంటలు ఆరలేదు "ఆ నవి ముండ కట్లు విప్పదీసుకుందట. అన్ని దెబ్బలు దిన్న అది, ఏమి కానట్టే నడుచుకుంటూ ఇంటికెళ్లిందట" అంటూ నవమణి గురించి

వెలుగు. "ఎక్కడ నుంచి వచ్చారు? " అని అడిగాడుట ధైర్యం చేసి.

"నా ఊళ్ళో నన్ను ఎక్కడ నుంచి వచ్చావని అడుగుతావురా" అని గద్దించాయట.

ఊళ్ళో పెద్దలందరూ మీటింగ్ పెట్టుకొని, గ్రామ దేవతలకు కొలుపులు చెయ్యాలని నిర్ణయించారు. మాదిగలకు కొంత మాన్యం-ముఖ్యంగా నవమణి కుటుంబానికి ఇవ్వాలని కూడా నిర్ణయించారుట.

నవమణి ఒకరోజు గుడిసెపైకి ఎక్కి, ఆకాశంవైపు చూస్తూ, చేతులు పైకెత్తి, పెద్ద పెద్దగా అరుస్తూ, ఆడుకొంటూ కిందకు దిగి గుడిసెలోకి వస్తే, గుడిసె మధ్యలో వాళ్ళు నలుగురు కూర్చున్నారట. "ఆకలే పిల్లా" అన్నారట. "పున్నీళ్ళే ఉన్నాయని" నవమణి గొణిగిందట. "ఫరవాలేదు పట్టుకురా" అన్నారట. మూకుళ్ళలో వాళ్ళు పున్నీళ్ళు




# PREMA HOSPITALS
# PREMA INSTITUTIONS
## Managed by Free Polio Surgical & Research Foundation Visakhapatnam

### 1. PREMA SCHOOL OF NURSING:

Recognized by 1) Govt. of A.P., A.N.M.C. - Hyderabad
2) Indian Nursing Council - New Delhi

**Course** : General Nursing & Midwifery - 3 1/2 years
**Age** : Should have completed 17 years
**Eligibilty** : Pass in Intermediate - BiPC Group preferable
**Application Cost** : Rs. 250/- (Rupees two hundred and fifty only)

Applications and prospectus are available from The Principal, Prema School of Nursing 14-37-16 Muppidi Colony Layout, T.S No - 138, Block No. - 4 and Prema Hospital, 14-3-18, Maharanipeta, Visakhapatnam - 530 002
Contact Telephone Numbers: **0891-2526792, 6635069, Mobile: 99495 56747**

**STATE FIRST**

### 2. Dr. VYAGHRESWARUDU INSTITUTE OF PHYSICAL MEDICINE

(Managed by Free Polio Surgical & Research Foundation, Visakhapatnam)

**Approved by** : Govt. of Andhra Pradesh, and affiliated to Dr. N.T.R. University of Health Sciences, Vijayawada, A.P
**Course** : Bachelor of Physiotherapy (B.P.T) - 4 1/2 years
**Eligibility** : Pass in Intermediate with BiPC
**Age** : Should have completed 17 years
**Application Cost** : Rs. 500/- (Rupees five hundred only)

Applications and prospectus are available in the office of the Prema Hospital, # 14-3-18, Nowroji Road, Maharanipeta, Visakhapatnam - 530 002
Email: **premahospital@hotmail.com**
Contact Telephone Number: **0891-2526792, 08933-224015, Mobile: 99484 40615**

**STATE FIRST**

### 3. PREMASAGARI COLLEGE OF NURSING:

(Managed by Free Polio Surgical & Research Foundation)

**Approved by** : Govt. of Andhra Pradesh, and affiliated to Dr. N.T.R. University of Health Sciences, Vijayawada, A.P
**Course** **BSc Nursing** 4 years Degree Course
**Eligibility** : Pass in Intermediate - C.B.Z., or Botany, Zoology or Vocational MPHW (F) Examination, conducted by Board of Intermediate Examination, A.P
**Age** : Should have completed 17 years
**Application Cost** : Rs. 500/- (Rupees five hundred only)

Applications and prospectus are available in the office of the Prema Hospital, # 14-3-18, Nowroji Road, Maharanipeta, Visakhapatnam - 530 002
Email: **premahospital@hotmail.com**
Contact Telephone Number: **0891-2526792, 08933-224016, Mobile: 99484 40615**

**Managing Trustee,**
Free Polio Surgical & Research Foundation, Visakhaptnam.

తాగుతున్న దృశ్యాన్ని నవమణి ఇప్పటికీ వర్ణించి చెప్పేదట. ఆ రాత్రే వాళ్లు ఊరు వదిలి మళ్ళీ గుళ్ళోకి వెళ్లేరట. భయంకర మైన కరువు రోజుల్లో, గొట్టిపడియలో ఐదుగంటలపాటు వాన కురిసిందట. ఎప్పుడూలేంది, అడవుల్లోంచి జింకలు, కుందేళ్ళు షికారు చేసి వచ్చాయట. ఎప్పుడూ గూడెం దాటి బయటకురాని చెంచులు ఇరవై కిలోమీటర్లు నడు చుకుంటూ వచ్చారట. గుడి దగ్గర ఒక పూట గడిపి వెళ్ళిపోయారట.

గ్రామ దేవతలు వెళ్ళిపోయే ముందు మంగయ్య ఇంటికి వెళ్ళి 'మీ ఇల్లు నాశనం చెయ్యడానికి' వచ్చామని చెప్పారట. 'మీ ఇష్టం తల్లుల్లారా' అన్నాడుట. ఈ మంగ య్యే నవమణిని కట్టేసి కొట్టింది. ధాన్యం దాచిన కుండల్ని పగలగొట్టి, ధాన్యాన్ని వీధుల్లో వెదజల్లి, ఇంటిలోని భోషాణాన్ని వీధిలోకి విసిరి, దానిలోని చీరల్ని, నగల్ని ఎత్తుకెళ్లి అడవుల్లో విసిరేసి వచ్చాయట. ఆ చీరల్ని చెంచు ఆడవాళ్ళు కట్టుకొని తిరి గేవారని చెప్పుకునేవారు. రాత్రి పన్నెండు దాకా, ఆ నలుగురు అప్పచెల్లెళ్ళు వీధుల్లో అల్లరి చేస్తూనే ఉన్నారట.

చనిపోవడానికి నాలుగు రోజుల ముందునుంచి, మగతలో ఉంది నవమణి. కొడుకు గురించి దుఃఖపడేది. గ్రామం గురించి ఏడ్చేది, ముఖ్యంగా తన మాన్యాన్ని గురించి. ఆ మగతలోనే తనను గుడి దగ్గర సమాధి చెయ్యమని చెప్పిందట.

రాత్రి ఏడు గంటలకు నవమణి ఖననం ముగిసింది. గుడి పక్కనే ఉన్న ఊటబా విలో స్నానంచేసి అందరూ గ్రామంవైపు బయలుదేరారు. వీర ఒక్కడే కొండ అంచునున్న గుడి పక్కన ఉన్న రాళ్ళపై చాలాసేపు గడిపాడు. నవమణిని బతికుం డగా కలుసుకోలేకపోవటం అతనికి దిగు లుగా ఉంది. నవమణి జీవితం, అతనికి అద్భుతమైన సాహస కథలా ఉంది. ఊరి కోసం పోరాటం చేసిన ఆమె, అతనికో స్ఫూర్తిలా తోచింది. ఆమెను ఖననం చేసిన ప్రదేశానికి, నమస్కారం చేసి, వెనక్కు బయలుదేరాడు వీర. బయలుదేరే ముందు ఉన్న సందిగ్ధత, ఆందోళన ఇప్పు డతనిలో లేవు.




సుంకేసులదాకా ఆటోలో వెళ్ళి అక్కడ నుంచి కాలిబాట పట్టాడు వీర. చెంచు గూడెం వైపు అతని ప్రయాణం. సుంకేసుల ఊరు నిర్మానుష్యంగా ఉంది. వందల యేళ్లుగా అలవాటైన జీవనాన్ని అక్కడే వదిలి, కాందిశీకుల్లా కొత్త ప్రదేశాన్ని వెతు క్కుంటూ వెళ్ళారు, ఊళ్ళో చాలామంది. భూములు ఉన్నవాళ్ళు, ఇళ్ళు ఉన్నవాళ్ళను మినహాయించి ఊరు దాదాపు నిర్మా నుష్యంగా ఉంది. పల్లెటూళ్ళకు సహజమైన కోడి కూతలు, పశువులు నిద్రలేస్తున్న చప్పుళ్ళు ఏమీ వినబడలేదు. మట్టి, దుమ్ము నిండిన బాటలో ఒంటరిగా నడుస్తున్నాడు వీర. ఒకళ్ళిద్దరు అతనివైపు ఆశ్చర్యంగా చూసి, 'ఎవరు? ఏం పని?' అని అడుగు దామని చూసి, అంతలోనే సొంత భూముల్లో అపరిచితులుగా బతుకుతున్న సందర్భంలో, కొత్తవాళ్ళ ఊసు మనకెందు కని ఆగిపోయారు.

ఆరేడు కిలోమీటర్లు నడిచినాక అడవి మొదలైంది. ఆకుపచ్చని నేలను చూస్తూనే

వీరలో కలల సందడి మొదలైంది. సూర్యుడింకా రాని ఉదయాన, మంచుతో తడిసిన పచ్చికపై కూర్చుని, అడవితో మౌన సంభాషణ మొదలుపెట్టాడు వీర. కాలిబాటన వస్తున్నప్పుడు రెండు శిథిలమైన గూడాలు కనబడ్డాయి. నల్లటి బూడిద కప్పుకొన్న మొండి గుడిసెలు, ఖాళీగా ఉన్న మేకల దొడ్డి, నిన్నటి, మొన్నటి కథల్ని వినిపిస్తున్నాయి. అడవి అంచునే ఒక ఆశ్రమ పాఠశాల కనిపించింది. పిల్లల సందడి లేని పాఠశాల బయట, ఒకే ఒక్క కుర్చీ దానిపై కూర్చుని, రాని విద్యార్థుల కోసం ఎదురుచూపులు చూస్తున్న అయ్యవారు. స్కూలు మధ్యలో వంట పొయ్యి, పాత్రలు, బియ్యం, పప్పు ఆరబోసి కనిపించాయి. అయ్యవారితో మాట్లాడాలని చూశాడు గానీ, ఆయన చాలా నిర్లిప్తంగా, ఆసక్తి లేని చూపుల్ని విసిరి "త్వరగా వెళ్ళిపోండి. లేదంటే ఏ పోలీసోడో మిమ్మల్ని లాక్కువెళతాడు" అని ఉచిత సలహా ఇచ్చాడు. ఆ దృశ్యాలన్నిటిని చెరిపివేసి, అడవివైపు చూపు సారించాడు వీర. ఆకుపచ్చని పచ్చికలోకి చేతులు జొనిపి, దాన్ని తడిమి, నిమిరి, "ఇన్నేళ్ళకు మళ్ళీ తిరిగి వచ్చాను. గమనించారా? గుర్తు పట్టారా? " అంటూ నేలతో మాట్లాడేడు. దట్టంగా ఉన్న అడవివైపు చూశాడు. పొడవాటి చెట్లు, మేధావుల్లా గంభీరంగా ఉన్నాయి. ఆ చెట్ల సందుల్లోంచి, దూరంగా గుడిసెలు మసక మసగ్గా కనిపిస్తున్నాయి.

లేచి గుడిసెలు కనిపిస్తున్న వైపుగా నడక సాగించాడు. నడిచేకొద్దీ దూరంగా జరుగుతున్నాయి గుడిసెలు. ఇవన్నీ తనకు చిరపరిచితమైన ప్రదేశాలే. చిన్నప్పుడు తాను నడిచినచోట్లే అనుకున్నాడు గానీ, నిజానికి అంతా కొత్తగా ఉంది. దట్టమైన పొదల మధ్య చిక్కుబడి, మళ్ళీ వెనక్కు నడిచి, అట్లా చాలా గంటలసేపు నడిచాడు. చిన్న చిన్న పక్షులు, ఉడుతలు చెట్లపై అటూ ఇటూ తిరుగుతూ, అరుస్తూ, వీరని ఆశ్చర్యంతో గమనిస్తున్నట్లుగా, పొడవాటి టేకు వృక్షాలు అతన్ని గుర్తు పట్టినట్లుగా తలలు ఊపుతున్నాయి. ఒక చెట్టు మొదలున, ముడుచుకొని పడుకొన్న మానవ రూపం కనబడింది వీరాకు. ఆ మనిషి పక్కన బలహీనమైన కుక్కపిల్ల నిలబడి ఉంది. వీర అలికిడిని కూడా పట్టించుకోలేదా కుక్కపిల్ల. మంత్రించబడ్డదానిలా, ఆ పడుకున్న మనిషివైపే చూస్తోంది. దాని కళ్ళలో దుఃఖమో, దిగులో. ఆ మనిషి నిద్రలోనో, మగతలోనో ఉన్నాడు. సగం తెరుచుకున్న కళ్ళు. ఏ కదలికా లేని కళ్ళు. శరీరంపై ముసిరిన ఈగల్ని, కీటకాల్ని కూడా పట్టించుకోవటంలేదు. ప్రాచీన మానవుడిలా, వయసు, ఇంతని తెలియనంత ముసలితనం... అది వయస్సుతో వచ్చిన ముసలితనంలా కాక, దుర్భరమైన జీవితం, ఆకలి అన్నీ కలిపి శిథిలం చెయ్యగా ఏర్పడ్డ శరీర స్థితిలా ఉంది.

ఆ మనిషి పడుకునే కళ్ళు తెరిచి, కనుగుడ్లను వీరవైపు తిప్పి, అతన్ని గుర్తు పట్టాలని ప్రయత్నించి, విఫలమై, మళ్ళీ కళ్ళు మూసుకున్నాడు. అతని పేరు పెదమంతయ్య. సగటు చెంచు జీవిత కాలాన్ని దాటి బతికినవాడు. రెండు మూడు తరాల్ని తెలిసినవాడు. అన్ని సత్యాలు అతనికి తెలుసు అనుకుంటాడు. అతనికి కాలజ్ఞానం కూడా ఉందని నమ్ముతాడు. మొలచుట్టూ సన్నని ధోతీ తప్ప, దాదాపు నగ్నంగా ఉన్న అతన్ని చూస్తే దుఃఖం, భయం కూడా వేస్తుంది. ఎముకలు, దానిపై తోలు మినహాయిస్తే, మనిషికి సంబంధించిన ఆనవాళ్ళు ఆ శరీరంలో కనబడవు. నల్లని గొంగళి తలకింద పెట్టుకొని, ఎన్నో యేళ్ళుగా యోగ నిద్రలో ఉన్నవాడిలా కనబడుతున్నాడు. ఏళ్ళు కాదు గానీ, వారం రోజులుగా అదే అవస్థలో ఉన్నాడు. ఐదారు సారాయి సీసాలు వెంట

తెచ్చుకొని, ఈ చెట్లకింద జీవించటం మొదలుపెట్టాడు. ఈ వారం రోజులుగా సారాయి తప్ప, ఆ శరీరం మరే ఆహారాన్ని ఎరుగదు- యోగ నిద్రలా కనబడేది, ఆహారలేమితో వచ్చిన నీరసం కాలి మడెమపై అంగుళం లోతు గాయం. అది సెప్టిక్ అయి శరీరం జ్వర సముద్రంలా ఉంది.

వీరకు పరిస్థితి అర్థమైంది. భుజానికున్న సంచితీసి, బిస్కెట్ల పొట్లం తీసి అతనికి ఇచ్చాడు. జ్వరానికి రెండు బిళ్ళలు వేసి, కాలికి కట్టు కట్టడానికి బ్యాండేజ్ బయటకు తీశాడు.

మంతయ్య వీర వైపు తీక్షణంగా చూసి 'నువ్వు నాకు తెలుసు' అన్నాడు, కాలజ్ఞానిలా. వీర మాట్లాడలేదు. "తిండానికే బతికే మడుసులు మీరు. మీకేం తెలియదు. నా సంగతి వేరు. నాకంతా తెలుసు" అన్నాడు. జ్ఞానబోధ చేస్తున్నట్లుగా, లేచి కూర్చోడానికి ప్రయత్నిస్తున్నట్లుగా.

లేచి కూర్చున్న మనిషిని చూసి ఉలిక్కిపడ్డాడు వీర. మరణాన్ని చూస్తున్నట్లుగా ఉంది. రెండు లోతైన గుంటలు, ఆ లోపలెక్కడ, తిరుగాడుతున్న కనుగుడ్లు, ఎండిపోయిన పాము చర్మంలా, ముఖం పొలుసులు, పొలుసులుగా... జీవితం గురించి, జీవించటం గురించి ఈయన మర్చిపోయినట్లున్నాడు, అనుకున్నాడు వీర.

వీర తన గురించి చెప్పుకున్నాడు. ఇరవైయేళ్ళ క్రితం, ఈ ప్రదేశాల్లోనే తిరుగాడానని, ఈ గూడమో, పక్కగూడమో తన భూమి అని, తనకింకా స్పష్టంగా అన్నీ గుర్తు ఉన్నాయని, ఆకుపచ్చని ఈ దేశం ఇన్నేళ్ళుగా అతని కలల్లో ఉందని, ఇరవైయేళ్ళ క్రితం, తారురోడ్డుపై వదిలి, 'అట్లా నడచుకుంటూ వెళ్ళు, ఎక్కడో ఒకచోట బతుకు' అని తల్లి, తనను వదిలేసింది. తల్లి 'చామంతి' పువ్వులా ఉండేదని, తల్లి కోసమే తిరిగొచ్చానని వినిపించాడు.

మంతయ్య ముఖంలో ఏ కదలికలూ లేవు. కళ్ళు మూసుకొని వీర చెప్పేదంతా వింటున్నాడు. వీర చెప్పే సంగతులన్నిటినీ దృశ్యాలు, దృశ్యాలుగా చూస్తున్నాడు. ఆ దృశ్యాల్లోంచి ఇరవైయేళ్ళ వెనక్కు ప్రయాణించాలని చూస్తున్నాడు మంతయ్య.

హఠాత్తుగా వీర గతంలోంచి వర్తమానంలోకి వచ్చాడు. చెంచుగూడాలకు రాబోయే ఆపద గురించి చెప్పాడు. వెలిగొండ పూర్తయితే ఈ రెండు గూడాలు నీటిలో మునిగిపోతాయని, పక్కవూళ్ళలో ఈ విషయంపై చాలా గొడవలు అవుతున్నాయని, ఉద్యమాలు, ధర్నాలు చేస్తున్నారని, ఒక్కొక్కళ్ళే ఊళ్ళను ఖాళీ చేస్తున్నారని, చెంచులు కూడా మరో ప్రాంతానికి తరలిపోవాల్సిన అవసరం ఉందని వివరించాడు.

వీర చెప్పే మాటల్ని దృశ్యంగా మార్చటం సాధ్యంకాలేదు పెద మంతయ్యకు. అడవులోకి నీళ్ళు రావటం అనే విషయాన్ని అతను ఊహించలేకపోతున్నాడు. వీరవైపు అనుమానంగా చూశాడు. వీర తల్లి



గురించి కొన్ని ప్రశ్నలు వేశాడు. సంతృప్తిగా సమాధానాలు ఇవ్వలేకపోయాడు వీర. చెంచుల్లో చేమంతి పేరుతో ఆడమనిషి లేద న్నాడు. వీర తల్లి రూపురేఖల్ని వివరిం చటం మొదలుపెట్టాడు.

పెదమంతయ్యా జలప్రళయం గురించి అడిగాడు. వీర అతనికి నీటి ప్రాజెక్టుల గురించి, వెలిగొండ గురించి, ముఖ్యమంత్రి గురించీ చెప్పాడు. అనుమానంగా చూశాడు పెద మంతయ్యా.

"ముఖ్యమంత్రి అంటే" అన్నాడు పెదమం తయ్యా. ముఖ్యమంత్రి అంటే, దేశానికి రాజు లాంటి వాడని, తండ్రిలాంటి వాడని, మన మంచి చెడ్డలు చూసేవాడని వివరించాడు వీర. వీర చెప్పిన మాటల్ని చాలాసేపు ఆలోచించి "ఆకలితో పిట్టల్లా చచ్చిపోతు న్నారు చెంచులు. భూముల్లేవు, వ్యవసాయం లేదు. గుప్పెడు గింజలు లేవు. మనకే ముఖ్యమంత్రి లేడు. మనదీ దేశంకాదు. మనకెవుడూ లేడు" అన్నాడు, విషయం అర్థ మయిన వాడిలా.

"నేను, ఆపని మీద వచ్చాను" అన్నాడు ఆవేశంగా. ముడతలుబడ్డ పెద మంతయ్యా ముఖంలో విరక్తిలాంటి, అపనమ్మకం లాంటి నవ్వు. "ఎంతమందిని చూడలేదు నేను" అంటూ తనలో తాను గొణుక్కు న్నాడు. అతనిలో నమ్మకం కలిగించడానిక న్నట్లు, అతని ముఖంలోకి చూశాడు వీర.

"ఇక్కడుండొద్దు. అన్నలో, పోలీసులో ఎదురయితే కష్టం. ఎళ్లిపో" అన్నాడు పెద మంతయ్యా, వీరపై ప్రేమను చూపిస్తూ.

పెద మంతయ్యా ఎంత వారించినా, బల వంతంగా అతని వెంట నడిచాడు వీర. విసుగ్గా, కోపంగా అతనివైపు చూశాడు పెద మంతయ్యా. వీర మొండిగా అతని వెంట నడిచాడు. అంత బలహీనమైన శరీరంలో ఏ మూలన ఏ రహస్య శక్తులు దాగు న్నాయో గాని, పెద మంతయ్యాతో సమా నంగా నడవలేకపోయాడు వీర. ఆహారం లేకుండా, ఒట్టి గాలితో జీవించే శక్తులేవో, ఈ మంతయ్యకు సిద్ధించి ఉంటాయని వీర గట్టిగా నమ్మాడు.

ఎత్తైన ప్రదేశంలో ఆరు గుడిసెలు ఉన్నాయి. గొప్ప సమూహాన్ని ఊహించిన వీరకు అక్కడ ఎనిమిదిమంది మాత్రమే కని పించారు. పెదమంతయ్యా వయస్సున్న ఇద్దరు ముసలాళ్లు, నలుగురు చిన్నపిల్లలు, అందరూ పదేళ్ళ లోపువాళ్ళే. ఇద్దరు ఆడ వాళ్ళు, ముప్ఫయియేళ్ళలోపు మనుషులు, మరో ముసలమ్మ ఉన్నారు. ఆ గుడిసెల ఖాళీదనానికి నివ్వెరపోయాడు వీర. పొయ్యి వెలగని ఇళ్లు, తలుపులు లేని ఆ గుడిసెల్లో మానవ జీవనానికి అవసరమైన ఏ పని ముట్టూ లేదు. ఆహారాన్ని తయారు చేసుకో డానికి అవసరమైన వస్తువులు లేవు. ఆఖ రికి శరీరానికి అవసరమైన బట్టలు కూడా. మధ్యాహ్నపు ఎండలో విషాద మానవ గాథ నగ్నంగా, వికృతంగా అతనికి ఎదురైంది. పొలం దున్నటం, పంటలు పండించటం, పశువుల్ని కలిగి ఉండటం, ఇంటి చుట్టూ నాలుగైదు మేకలు, కోళ్ళు, ఇవన్నీ అబ్బు రంగా చెప్పుకునే కథలు. బహుశా పెదమం తయ్యా యవ్వనకాలం నాటి కథలయి ఉంటాయి. కనుచూపు మేరలో పండించదగ్గ పొలాలు ఎక్కడా కనిపించలేదు. అడవి వాళ్లకు దూరంగా జరిగిపోతున్నట్లు, సీతమ్మ వారి ముందు లక్ష్మణుడు గీసిన గీతల్లా అన్ని వైపులా నిషిద్ధ రేఖలే.

పెదమంతయ్యా గుడిసె ముందు కూర్చు న్నాడు వీర. వీర ఉనికిని ఎవరూ పట్టించు కోలేదు. కనీసం కొత్త మనిషిపట్ల చూపే ఆసక్తిని కూడా చూపలేదు. ఒక పదేళ్ళ పిల్ల మాత్రం, సారాయి సీసాను చాటుగా దాచి, తెచ్చి 'కావాలా' అన్నట్టుగా చూసింది. ఆ పిల్లను దగ్గరకు పిలిచాడు వీర. భయం భయంగా వచ్చింది. చిన్న పిల్లల్లో కనబడే

## మెగా షోరూమ్‌లను మించిన మహాషోరూం!

వివాహాది శుభకార్యములకు కావలసిన
బంగారు ఆభరణములు మరియు పట్టు, ఫ్యాన్సీ చీరలు,
సూటింగ్స్, షర్టింగ్స్ & మెన్స్ రెడీమేడ్స్ అన్నీ ఒకేచోట లభించే ఏకైక షోరూం.



ముందడా వారి

A/C

# శ్రీ మాధురి

జువెల్లర్స్ ✦ సిల్క్స్ ✦ టెక్స్‌టైల్స్ ✦ మెన్స్‌వేర్

మదీనా కాంప్లెక్స్ వద్ద, ఉస్మాన్‌పుర, కరీంనగర్

**JEWELLERS - SAREES - TEXTILES - MENSWARE**

91.6 KDM బంగారు ఆభరణముల ఏకైక షోరూం.

మృదుత్వం, కోమలత్వం లేవా పిల్లలో. ఎండిపోయిన శరీరం. ముఖం పెట్లిపోయి, కళ్ళు గుంతలు పడి, ముఖం చుట్టూ పిడచ గట్టుకుపోయిన జుట్టు, ఊడల్లా వేలాడుతూ సంచిలోంచి ఒక బిస్కెట్ పాకెట్‌ని తీసి ఇచ్చాడు. 'తీసుకోవాలా, వద్దా' అని చాలా సేపు సందేహించి, మిగిలిన పిల్లలవైపు చూసింది. 'ఫరవాలేదులే' అని వాళ్ళు సైగ చేస్తే బిస్కెట్ ప్యాకెట్ తీసుకొంది. జేబు లోంచి కొంత డబ్బుతీసి, ఆ పిల్లకిచ్చి, సారాయి సీసా తీసుకున్నాడు. దాన్ని పెద మంతయ్యకు ఇచ్చాడు. క్షణం ఆలస్యం లేకుండా, సారాయిని శరీరంలోకి పంపటం మొదలు పెట్టాడతడు. సారాయి శరీరంలో ప్రవేశించే కొద్ది పెదమంతయ్యలోని దార్శ నికత, భవిష్యత్తునీ, కలల్నీ వివరించే శక్తులూ (? ) పెరుగుతాయి. ప్రవక్తలాగా సందేశాల్నీ, సూచనల్నీ ఇస్తూ ఉంటాడు.

వీరకు దుఃఖం వేసింది. ఈ వాతావర ణాన్ని అతను ఊహించలేదు. యేళ్లతరబడి, అతని కలల్లో, అతను దర్శించిన భూమి ఇది కాదు. ఒక ఆదిమ సమాజం, కల్మషం అంటని ఆకుపచ్చని దేశాన్ని అతను కల గనే వాడు. ఇక్కడి పరిస్థితి వేరు. ఏ జీవనోత్సా హం లేదు. ఎటు చూసినా మరణం లాంటి నిశ్శబ్దం. చిన్న పిల్లలు బిస్కెట్ పాకెట్‌ని పరిశీలిస్తూ ఒకరి తలలోని పేలు ఇంకొకళ్ళు చూస్తూ కూర్చున్నారు. ఒక పిల్ల జ్వరంతో వెచ్చటి ఆవిర్లు కక్కుతూ గుడిసె ముందు నేలపై పడుకుంది. వీర, మందులివ్వబోతే భయంతో పారిపోయింది. గుడిసెలో నీర సంగా పడుకున్న ముసలమ్మ దగ్గరకు వెళ్ళా డు. తల్లి పోలికల కోసం వెతికాడు. ఆమె చాలా వృద్ధురాలు. అరవైదాటి ఉంటాయి. డెలీరియంలో లాగా, తనలో తాను ఏదో గొణుక్కుంటోంది. కొన్ని జ్ఞాపకాలు, కొన్ని భయాలు, అన్నీ కలగాపులగం అయ్యి, ఒక అసంబద్ధ వ్యాఖ్యానంలా ఉన్నాయి ఆమె మాటలు. వీరకు తిట్లలాగా, శాపాల్లాగా వినిపించసాగాయి. మిగతా గుడిసెల్లోని ఆడవాళ్ళు వీరను చూడగానే, అసౌకర్యాన్ని పొందినట్లుగా, ముఖాన్ని దాచేసుకుని గుడి సెల్లోకి వెళ్ళిపోయారు.

ఐదు కిలోమీటర్ల అవతల మరో గూడెం ఉందని చెప్పాడు పెదమంతయ్య. అక్కడకు వెళ్ళాలని ఆరాటపడ్డాడు. ఏదో అసంతృప్తి అతన్ని వెంటాడుతోంది. బహుశా తల్లి పోలికలున్న ఆడమనిషి కనబడలేదని కాబో లు లేదా తనూహించిన కలలోని గూడెంలా లేదని కాబోలు లేదా ఈ నిర్జీవ భూముల్ని ఇక్కడ నుంచి పెకిలించి, మరో ప్రాంతానికి తరలించటం అసలు సాధ్యమవుతుందా అనే భయంతో కాబోలు చాలాసేపు మంతయ్య గుడిసె ముందు పచార్లు చేశాడు. "అడవికి వెళ్లిన మగవాళ్లు వస్తారు, రాత్రికి వాళ్ళతో మాట్లాడుదువుగాని" అన్నాడు పెదమం తయ్య, వీర మనసులోని ఆలోచనల్ని చది విన వాడిలా. ఉలిక్కిపడ్డాడు వీర. ఏ ఉద్వే గమూ లేని ప్రవక్త ముఖాన్ని మరోసారి ప్రదర్శించాడు పెదమంతయ్య.

కొద్దిగా ఉత్సాహం రగిలింది వీరలో. పిల్ల ల్ని నలుగుర్ని దగ్గరకు పిలిచాడు. అనుమా నంగా అతనివైపు చూసి ముఖాన్ని తిప్పుకు న్నారు. తనే అక్కడకు వెళ్ళాడు. సంచిలోం చి నూనె, దువ్వెన బయటకు తీశాడు. ఇవన్నీ మోహిని సలహాలు. ఒక్కొక్కళ్ళ తల లకి నూనె పోసి, జడలు కట్టిన జుట్టును దువ్వటం మొదలుపెట్టాడు. జుట్టు కార్య క్రమం అయినాక సబ్బు ఇచ్చి స్నానానికి పంపాడు. అప్పటికి వాళ్ళలో అతనిపై కాస్త గురి కుదిరింది. అడవికెళ్లిన మరో ఇద్దరు మగపిల్లలు వచ్చారు. వాళ్ళకీ తలలు దువ్వి, స్నానం చేయించీ, వాళ్ళతో మెల్లగా కబుర్ల లోకి దిగాడు వీర.

"కీచురాళ్ళ యుద్ధం" ఆట తెలుసా మీకు అన్నాడు, తన చిన్ననాటి ఆటల్ని గుర్తు

## ఇందు గలవందు లేవని...

"ఇందు గలవందు లేవని సందేహము వలదు. బాక్టీరియా సూక్ష్మ క్రిముల్ ఎందెందు వెదికి చూచిన అందందే.... కలవు పెక్కు...." అంచేత నిర్లక్ష్యం తగదని పరిశోధకులు ఎలుగెత్తి హెచ్చరిస్తున్నారు. 'ఎందెందున అంటే...' అని ఎవరైనా ప్రశ్నిస్తే-

నిత్య వినియోగంలో భాగమైపోయిన సెల్‌ఫోన్లు, మనీపర్సులు కూడా మినహాయింపు కాదు పొమ్మంటున్నారు అరిజోనా యూనివర్సిటీకి చెందిన మైక్రోబయాలజిస్టు చార్లెస్ గెర్బా. 'సెల్ ఫోన్లకి కవర్లు వేస్తున్నాం గదా!' అనుకోవచ్చు మీరు. కాని మీరెన్ని కవచాలు వేసినా సెల్‌ఫోన్ల ఉపరితలం మీద కంటికి కన్పించని సూక్ష్మజీవులు బోల్డన్ని ఉంటున్నాయని దీనిపై ప్రత్యేకంగా పరిశోధన జరిపిన చార్లెస్ గెర్బా పేర్కొంటున్నారు. అంతేకాదు అవి చర్మానికి హాని కల్గించే సూక్ష్మజీవులని కూడా నిర్ధారించారు. మనం ఉపయోగించే సెల్‌ఫోన్లు ఇతరులకు ఇస్తే వాళ్ళ ద్వారా మరో 20 నుంచి 30 శాతం బాక్టీరియా అదనంగా వాటి మీదకు చేరిపోతుంటాయట.

అలాగే మనీ పర్సులలో కనుగొన్న బాక్టీరియా అపరిశుభ్రంగా ఉండే బాత్రూంలు, టాయిలెట్లనుంచి సంక్రమించే సూక్ష్మజీవుల రకానికి చెందినవని కనుగొన్నారు. కంటికి కనిపించని ఈ హానికారక జీవుల్ని దూరంగా ఉంచాలంటే టాయిలెట్ల నుండి బయటికి వచ్చేటపుడు చేతుల్ని డిస్ ఇన్‌ఫెక్టెంట్ ద్రవాలతో శుభ్రపరచుకోవాలి. ఆ తర్వాతే పర్సులూ- గర్రాలూ పట్టుకోవాలి. అలాగే చెవులతో బాటు, చెవికి ఆనించుకుని మాట్లాడే సెల్ ఫోన్లనీ, మనీ పర్సుల్ని కూడా పరిశుభ్రంగా ఉంచుకోవటం తప్పదండీ.



చేసుకుంటూ. రాత్రిపూట గీ, గీ అని అరిచే కీచురాళ్లను వెంటాడి బంధించి, అగ్గిపెట్టెల్లోనో, చిన్న ముంతల్లోనో పైన పల్చటి గుడ్డకట్టి దాచిపెట్టి, వాటి మెడలకు దారం కట్టి యుద్ధానికి వదిలేవాళ్ళు. కీచురాళ్ళలో రెండు రకాలు, నల్లటివి, లావుగా, మిలమిలలాడుతూ ఉంటాయి. వీటికి గొంతు ఎక్కువ. రెండవ రకం సన్నగా తెల్లరంగులో ఉంటాయి. ఇది పోట్లాడే కీచురాళ్ళు (వీరుల కేటగిరీలోనివి). ఎప్పుడూ సన్న కీచురాళ్ళే గెలిచేవి.

పిల్లలతో కలిసి అడవిలోకి నడిచాడు వీర, కీచురాళ్ళ వేటకోసం. అర్ధగంట వెతికి సుమారు ఇరవై కీచురాళ్ళను పట్టారు. అయితే అన్నీ నల్లటి కీచురాళ్ళే. తెల్లరంగు కీచురాళ్ళకోసం చాలాసేపు వెతికారు వాళ్ళు. దాదాపు గంట వెతికినాక, నిరుత్సాహంతో వెనక్కు వచ్చారు. తన ముఖంలోని నిరుత్సాహం పిల్లలకి తెలియనియ్యలేదు వీర. వాటికి సన్నటి, పొడవాటి దారాలు కట్టి, ఒక దానిపై ఇంకొకటి పోట్లాటకు దించడంతో ఒక చిన్న యుద్ధభూమి తయారయింది అక్కడ. పిల్లల ఉత్సాహానికి అంతులేదు. క్రమంగా పెద్దవాళ్ళు కూడా మూగారు.

## పొడిచేస్తుంది

సినారె కనిష్ఠకుమార్తె కృష్ణవేణి కంది పొడి, శనగపొడి వగైరాల తయారీలో దిట్ట. ఒక రోజున ఆయన భోజనం చేస్తుంటే మరోకుమార్తె పొడి వడ్డిస్తూ 'ఇది మన కృష్ణవేణి చేసిందే. పొడులు చేయడంలో దానికి తిరుగులేదు' అన్నారు.

'అయితే మన కృష్ణవేణి పొడిచేస్తుందన్న మాట!' అంటూ శ్లేషను కొంటెగా విసిరి ఇంటిల్లిపాదినీ నవ్వించారు నారాయణ రెడ్డి.




మహా వీరోచితంగా అరుచుకుంటూ కీచు రాళ్ళు చేసే యుద్ధం, ఆ సాయంకాలపు నీర సంలో ఎంతో ఉత్సాహాన్ని నింపింది.

క్రమంగా చీకటి పడటం మొదలుపెట్టాక, పిల్లలు, కీచురాళ్ళను అగ్గిపెట్టెల్లో దాచుకొని గుడిసెలకు వెళ్ళారు. వీరకు ఎందుకో దిగు లు వేసింది. తెల్ల కీచురాళ్ళు ఎందుకు అదృశ్యం అయ్యాయా అని. నిజానికి తెల్ల కీచురాళ్ళ ముందు నల్ల కీచురాళ్ళు నిముషం కూడా నిలువగలిగేవి కాదు. నిప్పురవ్వల్లా ఎగిరెగిరి దూకేవి తెల్ల కీచురాళ్ళు. అవి అట్లా అదృశ్యం కావటం గురించి చాలా సేపు దిగులు పడ్డాడు. అవి ఎక్కడికైనా వలసపోయాయా లేదా మొత్తం వాటి జాతి అంతరించిపోయిందా అని ఆలోచనలో పడ్డాడు.

గుడిసెలోని ముసలమ్మ అరుపులు పెద్దగా వినిపిస్తున్నాయి. దుఃఖంతోనూ, కోపంతోనూ తిడుతున్న తిట్లలా ఉన్నాయి. అయితే మాట్లాడే ఓపిక లేక ఆ అరుపులన్నీ సాగదీయబడి, అదేదో దుఃఖపు పాటలాగా వినిపిస్తోంది.

"పొలం పోయిందీ, మేకలు పోయ్యాయీ, తింటానికి బువ్వలేదు. సావొక్కటే... సావ టమే. అందరూ కలిసి సావటమే. గురయ్య పొయ్యాడు. పోతయ్య పొయ్యాడు (ఆమె కొడుకులయి ఉంటారు.) అందరూ దుమ్ము లోకి కొట్టుకుపొయ్యారు. గుంతలు తవ్వి పెట్టండి గుంతలు" అంటూ పెద్దగా అరు స్తోంది. మధ్యలో ఎవరితోనో ముచ్చటిస్తు న్నట్లు తన చిన్నప్పటి కబుర్లు, గూడెం కళ కళలాడినప్పటి సంగతులు, భర్త గురించిన విషయాలు, వ్యవసాయ విజయాలు, అన్ని టినీ పూస గుచ్చినట్టు వివరిస్తోంది. తను చూసిన ఒక్కొక్క మరణాన్ని వివరంగా చెబుతోంది. అన్ని ముచ్చట్లు కలిసి, ఆవిడ జీవిత చరిత్రను పాడుతున్నట్లుగా ఉంది.

గుడిసెల్లో కాస్త కదలిక కనపడింది. అంతలోనే ఏడుగంటలకు గుడిసెలపై నిశ్శ బ్దపు తెర అల్లుకొంది. దీపాలు ఆరిపోయి, గాఢమైన అంధకారం. ఏ గుడిసెలోనూ పొయ్యి వెలగలేదు. ఆహారం ఏం తిన్నారా అని సందేహం వీరకు. తన సంచిలోని బ్రెడ్ పెదమంతయ్యకు ఇచ్చాడు. పెదమం తయ్య దాదాపు యోగ నిద్రలాంటి పరిస్థి తిలో ఉన్నాడు. ఆహారం అవసరం లేద న్నట్టుగా సైగ చేశాడు. బలవంతంగా ఆయ నతో తినిపించాడు. ఎనిమిదికి, మిగిలిన గూడాలకు వెళ్ళాడు. అడవికి వెళ్ళిన మగవా ళ్ళను కలిశాడు. వీర చెప్పిన విషయాలు వాళ్ళెవరికి అర్థం కాలేదు. ఎవరూ పెద్దగా ఆసక్తి చూపలేదు. 'వేరే విషయాలు మాట్లాడి వెళ్ళు, ఇంక వెళ్ళు' అన్నట్టుగా వీర వైపు చూశారు.

రాత్రి బాగా పొద్దుపోయాక, ఆకాశం నిండా చుక్కలు పరుచుకొన్న సమయంలో, గుడిసె ముందు దిగాలుగా కూర్చున్న

వీరను పలకరించాడు పెదమంతయ్య- యోగ నిద్రలోంచి బయటకు వచ్చి

ఆ రాత్రి పెదమంతయ్య ఎన్నో కబుర్లు చెప్పాడు వీరకు. చెంచుల చరిత్ర అంతా చెప్పాడు. తన వీరోచితమైన యవ్వనపు రోజుల గురించి చెప్పాడు. అడవికి వెళ్ళినప్పుడు, పులి చేసిన దాడి గురించి చెప్పాడు. మేకల్ని తోలుకొని అడవికి వెళ్తే, మేకల కోసం పొదలో పొంచి ఉన్న పులి, హఠాత్తుగా తనపై దూకిన సందర్భాన్ని వివరించాడు. పులిపంజా అతని తలలో గుచ్చుకుపోవటం, అయినా ధైర్యంగా పులిని విదిలించుకొని, దూరంగా గుట్టలవైపు పరిగెత్తటం, బెదిరిపోకుండా దబ్బతో పులిని వేటాడటం- వీర చేతుల్ని తీసుకొని తలపైన ఇప్పటికి మిగిలి ఉన్న గాట్లను తడిమి చూపించాడు. చనిపోయిన ఇద్దరు కొడుకుల



**పులిపంజా అతని తలలో గుచ్చుకుపోవటం, అయినా ధైర్యంగా పులిని విదిలించుకొని, దూరంగా గుట్టలవైపు పరిగెత్తటం, బెదిరిపోకుండా దబ్బతో పులిని వేటాడటం- వీర చేతుల్ని తీసుకొని తలపైన ఇప్పటికి మిగిలి ఉన్న గాట్లను తడిమి చూపించాడు**

గురించి చెప్పాడు. కుటుంబమంతా కళ్ళ ముందే వెళ్ళిపోవటం గురించి చెప్పాడు. రెండుసార్లు టి.బి., రెండుసార్లు మలేరియాలను జయించిన వాణ్ణని చెప్పుకున్నాడు. అన్నల రాక గురించి, చాలా వివరంగా చెప్పేడు.

పెదమంతయ్య క్రమంగా, తన ఆత్మను వీరలో ప్రవేశపెట్టాడు. బ్రహ్మాండమైన సంచలనం కలిగింది వీరలో. లోపలెక్కడో మినుకుమినుకుమంటున్న వత్తి బ్రహ్మాండమైన జ్వాలలా మారింది. ఒక్కొక్క పొర విడిపోయి, వీర శిశువుగా మళ్ళీ జన్మించాడు.

పెదమంతయ్య చివరిగా, కలలు ఎరుకపరిచే సత్యాల గురించి వీరకు చెప్పాడు. కల ఒక ఎరుక అని, కల రేపు అని, కల ఒక మంత్రం అని తెలియజేశాడు పెదమంతయ్య. ఎన్నో మరణాల్ని తాను ముందు కలగన్నానని వివరించాడు. ఆఖరికి వీర రాకను కూడా కలలో చూశానని పెదమంతయ్య తెలియజేశాడు. కలలు చెంచు తెగను రక్షించే శక్తి అని, కలల్లోంచి రేపటిని దర్శించమని ఉపదేశించాడు పెదమంతయ్య. చివరిగా తన గుడిసెను వీర సొంత ఇల్లుగా చేసుకోవచ్చని అనుమతించాడు.

గుడిసె ముందు కంబళి పరుచుకొని పడుకొన్న వీరాకు అంతా కొత్తగా, ఆశ్చర్యంగా ఉంది. ముఖ్యంగా పెదమంతయ్యతో మాట్లాడిన ఈ నాలుగైదు గంటలు తనలో నూతన శక్తిని నింపినట్లుగా అనిపించింది. నిజానికి పెదమంతయ్య, వీరనుద్దేశించి మాట్లాడేడుగాని, అదంతా ఒక స్వగతంలాగా సాగింది. ఇంకోసారయితే ఒక తాగుబోతు ప్రేలాపనలా అనుకునేవాడు. కానీ ఇప్పుడలా అనుకోలేకపోతున్నాడు.

చాలా సేపు నిద్రపోలేదు వీర. అతని చుట్టూ గుట్టలు గుట్టలు దోమలు- దోమల నది ఏదో ప్రవహిస్తున్నట్లుగా, ఝుమ్‌ఝుమ్మంటూ భీకరమైన చప్పుళ్ళు చేస్తూన్నాయి. లేచి మస్కిటో కాయిల్ వెలిగించినా కానీ, అతనికి నిద్ర పట్టలేదు.

ఆ మరుసటిరోజు వీర, పెదమంతయ్యలు మరో గూడానికి బయలుదేరారు. అడవిలో పలకు ఉన్న గూడెం అది. నడుస్తున్న ప్రదేశాల్ని గుర్తుపట్టడానికి ప్రయత్నించాడు వీర. బాల్యపు కెమెరాలో చిక్కుబడిన ప్రదేశాల్ని గుర్తుపట్టాలని అతడి ప్రయత్నం. ఎత్తైన

గుట్టనొకదాన్ని గుర్తుపట్టాడు. ఆ గుట్టపై వీర, వాళ్ళమ్మ ఎన్నో గంటలు గడిపేవాళ్ళు. ఊరంతా జ్వరాలు, మరణాలు. రెండు రాత్రులు వీరను ఆ గుట్టపైన కూర్చోబెట్టింది వాళ్ళమ్మ. "భయం పడొద్దు" పదే పదే ధైర్యం చెప్పటం గుర్తుకొచ్చింది. మూడో రోజు వీరను గూడేనికి తీసుకెళుతూ, "కడుపులో పోయే బిడ్డే అదృష్టవంతుడు

మొలిచి ఉంది ఇప్పుడు. చెట్లు బాగా ఎత్తుకు పెరిగాయి. నిజానికి అతననుకొంటున్న గుట్ట అది అవునో కాదో స్పష్టంగా అతనికే తెలియదు. బాల్యం, బాల్యం తాలుకు జ్ఞాపకాలు, అతనికి గాఢమైన వ్యసనాల్లా



ఈ రోజుల్లో" అని లేదా ఆ అర్థం వచ్చేలాగ అనటం గుర్తొచ్చింది వీరకు.

ఆ గుట్టవైపు ఇష్టంగా చూశాడు. దట్టంగా గడ్డి

అంటుకుపోయాయి. చిరపరిచితమైన ప్రతి దృశ్యం అతన్ని ఉద్వేగానికి గురిచేస్తోంది. ఇక్కడ, ఇలాగు అని అతను అనుకునేదంతా ఒట్టి భ్రమ కావచ్చును. కానీ అట్లా అనుకోవటం, కలిగే ఉద్వేగం అతనికి ఇష్టంగా ఉంది.



పెదమంతయ్య పొదల మధ్యనుంచి వేగంగా అడుగులు వేస్తున్నాడు. వీరకిది కొత్త అనుభవం. అడ్డవచ్చే పొదల్ని తొలగించుకుంటూ, ముళ్ళకంపల్లో, చిక్కుకోకుండా వేగంగా నడవగలగటం కష్టంగా ఉంది. చాలాసార్లు వీర వెనకబడ్డాడు. కాస్త దూరం వెళ్ళినాక పెదమంతయ్య అతడి కోసం ఆగాల్సి వస్తోంది. అంత వార్ధక్యంలోనూ పెదమంతయ్య అంత వేగంగా నడవటం వీరకు ఎంతో ఆశ్చర్యం కలిగిస్తోంది. ఆత్మనిండా కలల్ని నింపుకొన్న మనిషిని అని వివరించాడు పెదమంతయ్య. ఆహారం, ముఖ్యమైన వనరు కాదేమో మనిషి బతకడానికి అనిపించింది వీరకు. నిజానికి వీర మధ్యలో ఆగి, కాస్త ఆహారం తిని, విశ్రాంతి తీసుకొని మళ్ళీ నడక మొదలుపెట్టాల్సి వచ్చింది.

గుబురు పొదలు, పొడవాటి వృక్షాల మధ్యన పదికి పైగా గుడిసెలున్నాయి. మనుషులతో కలకలలాడుతుంది గూడెం. లోపలికి అడుగు పెడుతూనే దోమలు ఝుమ్మంటూ మూగాయి. దండులాగా, శత్రుసైన్యంలాగా ఉన్నాయవి. హతాశుడైనాడు వీర. గూడాలకు వెళ్ళేటప్పుడు శరీరానికి 'ఓడోమస్' పూసుకోవాలనే ప్రాథమిక సత్యాన్ని మరిచినందుకు తనను తానే తిట్టుకున్నాడు. శరీరాన్ని చీల్చివేసే దోమలు. దోమకాటు పడినచోట శరీరాన్ని గీరి గీరి, చర్మం పుళ్ళుబడి, ఎముకలు బయటపడ్డాయి అక్కడ చాలామందికి. హఠాత్తుగా కొరడా

ఏదో శరీరంపై ఝుళిపించిన బాధ. దోమలు ఇక్కడ జీవనంలో భాగమయ్యాయి.

గూడెంలో మగవాళ్ళు ఎవరూ కనబడలేదు. పిల్లలు, ఆడవాళ్ళు ఉన్నారు. పిల్లలు మరింత అనారోగ్యంగా, ఎండిపోయి, వడలిపోయి ఉన్నారు. రక్తహీనతతో తెల్లగా పాలిపోయి ఉన్నారు. గుడిసెల్లోకెల్లా పెద్దగా ఉన్నదానివైపు దారితీశాడు మంతయ్య. అందులో పెదగురయ్య, అతని మనుమరాలు పోతమ్మ ఉన్నారు. పెదగురయ్యకు యాభైపైనే ఉంటాయి. చూపు పోయింది. ఎప్పుడూ గుడిసెకే అంటిపెట్టుకొని ఉంటాడు. పదేళ్ళ పోతమ్మ అతణ్ణి చూసుకుంటూ ఉంటుంది. ఆ ఇంటివరకు యజమాని పోతమ్మే. ఆహార సేకరణ, వంటా ఆ పిల్లే చేస్తుంది. పెదమంతయ్య గొంతుని గుర్తుపట్టాడు గురయ్య. మాట్లాడుకోడానికి ఏమీలేనట్లు, చాలాసేపు వాళ్ళిద్దరు మౌనం గా కూర్చున్నారు. కుశల ప్రశ్నలు వేసుకోడాలు లాంటి ఆనవాయితీలు ఇక్కడ లేవు. వీర అట్లాగే ఆ మౌనంలో చాలాసేపు కూర్చున్నాడు. తాగడానికి గంజిలాంటి పదార్థం ఇచ్చిందా పిల్ల. ఇది కూడా ఇక్కడ మర్యాద కాదు. ఆ చిన్నపిల్లకు ఎందుకో వాళ్ళకు కూడా ఇవ్వాలనిపించింది.

విషయం వివరించాడు పెదమంతయ్య. గూడెం మునిగిపోవటం గురించి, అందరూ మరో కొత్తచోటు వెతుక్కోవాల్సిన అవసరం గురించి చెప్పాడు. ఆ కొత్త ప్రదేశం ఎక్కడనే మాట మాత్రం చెప్పలేదు పెద మంతయ్య. మార్కాపురం దగ్గరి స్థలాల గురించి పెద మంతయ్యకు పెద్దగా ఆసక్తి లేదు. అయితే ఈ విషయాలేవీ గురవయ్యలో పెద్దగా స్పందన కలిగించలేదు. అడవిలోకి నీళ్ళు రావటం అనే విషయం, అతనికి నమ్మశక్యంగా లేదు. అయితే పెద మంతయ్య మాటలపై గురి ఉండటం చేత, ఎదురు మాట చెప్పలేదు. పెదమంతయ్య అతని ఆలోచనల్ని పట్టించుకోకుండా, 'కొత్త ఇళ్ళు కట్టిస్తారనే' విషయం కూడా చెప్పాడు. చివరిగా వీరాని పరిచయం చేశాడు. ఈ పని మీదే వచ్చాడు అని కూడా పరిచయం చేశాడు.

'చాలామంది ఇట్లాగే వచ్చారు. ఇట్లాగే చెప్పారు. అందరూ వెళ్ళిపోయారు' అన్నాడు గురయ్య చాలా నిర్లిప్తంగా. ఆ విషయంపై పెదమంతయ్యకు గురయ్యకు మధ్య చాలాసేపు సంభాషణ జరిగింది. తన బతుకంతా చీకటి, ఎక్కడున్నా ఒకటే అంటాడు గురయ్య. చీకటయితే మాత్రం బతకటం ఆగిపోదుకదా అని వివరిస్తాడు మంతయ్య.

పోతమ్మ ఇంటి మధ్యలో కూర్చుని, వేరు గడ్డల్ని గీరుతోంది. గీసిన దుంపల్ని, గిన్నెలో వేసి నీళ్ళతో కడుగుతోంది. ఎంత గీకినా దుంపల పైనిమట్టి రావటంలేదు. శ్రద్ధగా, దీక్షగా, ఆ పనిమీదే నిమగ్నమయి ఉంది ఆ పిల్ల. తన చుట్టూ జరుగుతున్న సంభాషణ ఆమె చెవులకేమీ ఎక్కటం లేదు. గాఢమైన ఆలోచన లేదా 'రహస్య స్వప్నం' ఏదో ఆ పాపలో కదలాడుతున్నట్లుంది. బహుశా తన రేపటి జీవితం గురించి ఏమో. ఆ ఆలోచన తప్ప, చుట్టుపక్కల మరింకే విషయాన్ని పట్టించుకోనట్లుగా ఉంది.

ఆ పిల్లను చూస్తుంటే వీర మనస్సు బాల్యపు జ్ఞాపకంలోకి పరుగులు తీసింది. అంతే శ్రద్ధగా గుడిసె ముందు కూర్చుని లాంతర్లు చేసేవాడు వీర. గూడానికంతా అదో అబ్బురం. వెదురు కర్రలతో చేసిన లాంతరు. మధ్యలో మట్టిదీపం. కర్రల చుట్టూ రంగురంగుల కాగితాలు చుట్టి, రాత్రి పూట ఆ లాంతర్ల వెలుగు, గూడెం మొత్తానికి ఆశ్చర్యం. పిల్లలందరూ వీర వెంటనే ఉండేవాళ్ళు

గూడానికి కాస్త దూరంలో రేగు పొదలు ఉండేవి. ఆ పొదల వెనుక, పొడవాటి టేకు వృక్షాలుండేవి. రాత్రివేళల్లో ఆ పొదల్లో

మిణుగుర్లు, మిడుతలు పాడే పాటలు గూడెందాకా వినిపించేవి.

రాత్రిపూట, చీకట్లో (రాత్రి ఎనిమిది గంటలవేళ) వీర ఒక్కడే లాంతరు తీసుకొని రేగు పొదలవైపు వెళ్ళేవాడు. మొదటిరోజు వీర ఒక్కడే ఎర్రరంగు లాంతరులో పొదల వైపు వెళ్ళాడు. పదిరోజుల్లోనే ఆ లాంతర్ల సంఖ్య పదో, పదిహేనో అయ్యింది. దూరం నుంచి చూస్తే, అడవిలో ఏదో ఉత్సవం జరుగుతున్నట్లు అనిపించేది. అడవిలో అప్పటికి చప్పుళ్ళు మొదలవ్వవు. మిణుగుర్ల గీ, గీ శబ్దాలు తప్ప. పొదల పక్కన నక్కి కూర్చునేవాళ్ళు పిల్లలు. వాళ్ళ చేతుల్లో లాంతర్లు- ఆకుపచ్చనివి, ఎర్రనివి, పసుపు పచ్చనివి, నీలపురంగువీ, రంగురంగు లాంతర్లతో మిరుమిట్లు గొలిపేదా ప్రదేశం. కొంతమంది పిల్లలు ఒట్టి మట్టి దీపాన్ని తెచ్చుకునేవాళ్ళు. అవి దిగులుగా ఏడుస్తున్నట్లు ఉండేవి. పిల్లలు లాంతర్లు పట్టుకొని, రేగు పొదల మధ్య నడుస్తుంటే, అడవి మధ్యలో రంగులు కురుస్తున్నట్లు ఉండేది, అచ్చం కథల్లో లాగ.

ముందు మొదలు పెట్టింది వీరనే. రేగు పొదలపైన పాడుతూ, ఆడుతూ ఉండే మిణుగుర్లు పట్టుకోడానికి వెళ్ళేవాడు. వీరను చూసి మరొకడు, మరొకడు...

ఒక్కో లాంతరు ఒక్కో అద్భుతం. కొంత మంది పిల్లలు రంగుకాగితాలపై బొమ్మలు వేసేవాళ్ళు, చెక్కేవాళ్ళు. పులులు, కుందేలు పిల్లలు, వాటి బొమ్మలుండేవి. రాత్రిపూట ఆ లాంతర్లలోంచి కుందేళ్ళు, పులులు బయటకు వస్తున్నట్లే ఉండేది.

లాంతర్ల వెలుగులు, అట్లా రాత్రిపూట చాలాసేపు మిలమిలలాడి, ఆ వెలుగులు అడవంతా పాకి, చుట్టుపక్కల ఊళ్ళలో కథలు కథలుగా చెప్పుకునేవాళ్ళు. అడవుల్లో దేవతలో లేదా కొరివిదయ్యాలో షికారు చేస్తున్నాయని పుకార్లు వచ్చేవి. రాత్రిపూట

అడవుల్లోకి రావడానికి భయపడేవాళ్ళు.

వీర లాంతరుపై చామంతి పూవు బొమ్మ ఉండేది. ఆ లాంతరులోంచి చామంతి పూల వాసన గుప్పుమనేది. చిన్న చిన్న ముంతల్లో, మిణుగుర్లను పట్టేవాళ్ళు ముంత పైన పల్చటి, తెల్లటి గుడ్డను కట్టేవాళ్ళు ముంతలనిండా తెల్లటి మిరుమిట్లు గొలిపే వెలుగు. పైనున్న తెల్ల గుడ్డలోంచి ఆ వెలుగు మిలమిలలాడుతూ కుండలో దాచిన నక్షత్రాల్లా ఉండేవి. లాంతర్లు ఆరిపోయినాక అడవిలో, ఈ ముంతల్లోంచి వచ్చే పాదరసపు రంగు వెలుగే పిల్లలకు దారి చూపేది. ఆ వెలుగుకు అబ్బురపడి, చెట్లపైన పిట్టలన్నీ పాటల్ని అందుకునేవి. కీటకాలన్నీ వంతపాడేవి. ఆ పాటలన్నీ వెంటరాగా, మిణుగుర్ల దీపాలతో పిల్లలందరూ గూడెంలోకి వస్తుంటే, ఆకాశంనుంచి, దేవతల పిల్లలు, నడిచి వస్తున్నట్లుగా ఉండేది.

పోతమ్మని, ఇంకా మిగిలిన పిల్లల్నీ కూడవేసి రాత్రికి మిణుగుర్ల వేటకు వెళ్ళాలని నిర్ణయించుకున్నాడు వీర.

రాత్రి పొద్దుబోయేదాకా అన్ని గుడిసెలూ తిరిగారు వీర, పెదమంతయ్యలు. ఎవరిలోనూ ఆ విషయం గురించి ఆసక్తి లేదు. కొత్తగా వచ్చే ఆపద ఏముంది అనేది వాళ్ళ వాదన. ఆశ్చర్యంగా వీర బదులు ప్రశ్నలన్నిటికీ మంతయ్యే సమాధానం ఇస్తున్నాడు. వీర భాష పూర్తిగా మారింది. యూనివర్సిటీల, సిటీల భాష అతను మాట్లాడుతుంటే వింతగా, అయిష్టంగా చూస్తున్నారు వాళ్ళు పెదమంతయ్య దాదాపు వీర ఆలోచనలకు రాయబారిగా మారాడు. వీర సాధించిన మొదటి విజయం యిదే. పెదమంతయ్య రాబోయే ఆపదను పసిగట్టినవాడిలాగే ఉన్నాడు. అందరికీ కథలాగా వివరించి చెబుతున్నాడు. నీళ్ళు ఎక్కడ బయలుదేరతాయి, ఎక్కడకు చేరతాయి, ఎంత దూరానికి చేరతాయి- అన్నీ వివరించి చెబుతున్నాడు. అప్పుడు చెట్ల మీదో, పుట్టల మీదో బతకాల్సి వస్తుందని వాళ్ళకు వివరించాడు. అదేదో కల్పిత కథలాగా వాళ్ళు దాన్ని కొట్టివేస్తున్నారు. చివరగా ఈ మనిషి (వీర) గురించి వారం రోజుల క్రితమే తనకు కల వచ్చిందని చెప్పిన మాట మాత్రం, వాళ్ళ మనసుల్లో నాటుకొంది. కొద్దిమంది ఆలోచనలో పడ్డారు. అయితే మొత్తాన్ని కూలదోసి మళ్ళీ మరో చోటకు వెళ్ళాలనే ఆలోచన, వాళ్ళను ఇబ్బంది పెడుతోంది. మరోచోటకు వెళ్ళాల్సినంత గట్టి కారణం లేదేమోనని వాళ్ళ వాదన.

ఈ సంభాషణకు అతీతంగా వీర, పోతమ్మ గురించి, ఆ వయసు పిల్లల గురించి ఆలోచిస్తున్నాడు. వాళ్ళ కళ్ళలో నీరసంతో కూడి కనిపిస్తున్న వెలుగుల గురించి ఆలోచిస్తున్నాడు. వాళ్ళ ఆలోచనల్ని చదవాలని ప్రయత్నిస్తున్నాడు. బహుశా అందమైన కలలేవో ఆ కళ్ళలో అటూ ఇటూ సంచరిస్తూంటాయేమోనని అనుకున్నాడు.

గూడెం నుంచి ఈ పిల్లల్ని తరలించి కాస్త చదువు నేర్పితేనో అనే ఆలోచన (ఐ.టి.డి.ఎ వాళ్ళలాగా కాకుండా) వీరకు వచ్చింది. మోహినిని ఒప్పించి కొద్దిమందినైనా దత్తత తీసుకుంటేనో అనే ఆలోచన వచ్చింది. అయితే ఈ గార్డియన్‌షిప్ వ్యవహారం ప్రమాదకరమయిందని కూడా వీర అనుకున్నాడు. వాళ్ళలో ఆత్మన్యూనత ఏర్పడే



**యూనివర్సిటీల, సిటీల భాష అతను మాట్లాడుతుంటే వింతగా, అయిష్టంగా చూస్తున్నారు వాళ్ళు. పెదమంతయ్య దాదాపు వీర ఆలోచనలకు రాయబారిగా మారాడు. వీర సాధించిన మొదటి విజయం యిదే.**

ప్రమాదం ఉందని కూడా అతను ఆలోచించాడు.

చర్చ ముగుస్తుండగానే గురయ్య గుడిసె వైపు వెళ్ళాడు. పోతమ్మ పనులు పూర్తిచేసి గుడిసె బయట కూర్చుంది. జుట్టుకు నూనె రాసి దువ్వి, పేలను ఏరుకుంది. రాత్రిపూట ఆ పనులన్నీ చెయ్యరని ఆ పిల్ల గడుసుగా చెప్పింది. తన సంచిలో ఉన్న దువ్వెనలు, నూనె సీసా, జడకు కట్టే బ్యాండ్‌లు అన్నీ ఆ పిల్లకు ఇచ్చాడు. గురయ్య గుడిసె బయటే పండుకున్నాడు వీర. నల్లటి చీకటి, దుప్పటిలాగా అటు ఆకాశాన్ని, ఇటు భూమిని కప్పింది. గాఢమైన చీకటి రాత్రిలో వీర వెలుగు కోసం, చాలాసేపు వెతికాడు. చిన్న నక్షత్రమైనా ఆకాశంలో మిణుక్కు, మిణుక్కుమంటుందేమో అని చూశాడు. ఊహు ఆకాశమంతా గుడ్డివాళ్ళ దేశంలా ఉంది. కీటకాల చప్పుడు, రాత్రిపూట సంచరించే కొన్ని జంతువుల అరుపులు తప్ప, అడవి కలల్ని పోగొట్టుకొన్న భూమిలా ఉంది.




అడవికంతా బంగారు రంగు పులిమింది ఉదయం. కుండపోతగా, వెలుగు కురుస్తున్నా మెలకువ రాలేదు వీరకు. తెల్లవారినా గుడిసె ముందు, గాఢనిద్రలో ఉన్న అపరిచితుణ్ణి గూడెంలోని పిల్లలందరూ వింతగా చూసి వెళుతున్నారు.

వీర తలవైపున కూర్చుని చాలాసేపటి నుంచి అతణ్ణే చూస్తోందో ముసలమ్మ. చాలాసేపటి నుంచి అట్లా చూస్తోందేగాని, ఆ చూపులకు ఏ జ్ఞాపకం అందట్లేదు. పెద మంతయ్య పొద్దున్నే కనపడి, "వెళ్ళు, నీ కొడుకు, అక్కడ పడుకున్నాడు" అనగానే కాస్త కంగారుపడింది. కొడుకు అనే ఊహ ఆమెలో చాన్నాళ్ళ క్రితమే చెరిపివేయబడింది. జ్ఞాపకాలు అదృశ్యమయిన ఆ ఆడమనిషిలో ఏదో గుర్తొచ్చీ గుర్తురాని స్పందన. వీర శరీరాన్ని ముట్టుకుంది ఆమె. చేతుల్ని నిమిరింది. తలపైన కాసేపు చెయ్యి పెట్టింది. నుదిటిని, కళ్ళను, మొత్తం ముఖాన్ని దీక్షగా చూసింది. జుట్టు లోపల చెయ్యిపెట్టి కాసేపు జుట్టు నిమిరింది. ఉత్తుత్తి పేలను కాసేపు చంపింది. వంగిపోయిన శరీరాన్ని మరికాస్త వంచి వీర ముఖంలోకి ముఖం పెట్టి, ఆనవాళ్ళ కోసం వెతికింది. అతని శరీరంలోని ప్రతి అవయవాన్ని గమనించింది. అతను వేసుకొన్న చొక్కా, జీన్‌ఫాంటు, బూట్లు, సమస్తాన్ని పరికించింది. మళ్ళీ ముఖం దగ్గరకు వచ్చింది. కనుబొమల్ని చుట్టుకుంది. ముక్కును తడిమింది. పెదాల్ని ముట్టుకుంది. అట్లాగే అతని చొక్కాను, ఫాంటును తడిమి చివరకు అతని కాళ్ళ దగ్గర తల పెట్టుకొని పడుకుంది, ఆ కాళ్ళు ఆమె విశ్రాంతి మందిరాలన్నట్లుగా. పక్షులు లేచి కాసేపు ఉదయగానం చేసి క్వేక్ క్వేక్ అంటూ, అటూ ఇటూ పరిగెడుతున్నాయి. సన్నని సీతాకోకచిలుకలు లేచి షికారుకని వచ్చి అద్భుతమైన భంగిమలో నిద్రపోతున్న వాళ్ళిద్దరిపైన వాలి, వాళ్ళ శరీరాలపై విహారం చేస్తున్నాయి. పక్షులు కూడా వాళ్ళ దగ్గరకు వచ్చి కీచ్, కీచ్‌మని అరిచి 'ఎంత లేపినా లేవటంలేదు' అన్నట్లుగా చూసి, మళ్ళీ చెట్లపైకి ఎగిరిపోతున్నాయి. చెట్లపై నుంచి వీచే గాలి కూడా, మెల్లగా వాళ్ళను ముట్టుకొని వెళ్ళింది.

ఆ ముసలమ్మ లేచి, ఏదో గుర్తుకొచ్చి నదాన్లా, వీర తలపైన చెయ్యివేసి, 'ఇంక లే' అని తట్టిలేపింది.

వీర కళ్లు తెరిచాడు. కళ్లు తెరిచేసరికి, నుదుటిపై ఎవరో అపరిచితురాలి చెయ్యి ఉంది. తన ముఖంపై ముఖం పెట్టి చూస్తున్న ఆ స్త్రీ వైపు ఆశ్చర్యంగా చూశాడు. ఆమె శరీరంలోని వణుకును గమనించాడు. కలలోని దృశ్యం కాదు కదా అని కాసేపు నిర్ధారించుకొన్నాక, ఆవిడవైపు పరిశీలనగా చూశాడు. పోలికలేవో తళుక్కుమన్నాయి. చాలా పరిచయమున్న రూపురేఖలు అనిపించాయి. ఆవిడ, తన తల్లి అయ్యుంటుదేమో అన్న ఆలోచన, అతనికి గొప్ప ఉద్వేగాన్ని కలిగించింది.

మళ్లీ ఆమెవైపు దీక్షగా చూశాడు. పాలిపోయిన ఆమె కళ్లవైపు చూశాడు. ఆ కళ్లు అతనికి గుర్తుకొస్తున్నాయి. చామంతి పూలలా మిలమిలలాడే కళ్లు. ఆ ముఖం అతనికి గుర్తురావటం మొదలు పెట్టింది. పోలికలన్నీ ధ్వంసమయినాయి. కానీ వాటి ఆనవాళ్లు మిగిలి ఉన్నాయి. అతని చిన్నతనంలో ఆమె కళ్లలో ప్రేమ, దయ కనిపించేవి. కళ్లు అవేకాని, ఇప్పుడా కళ్లలో మహా క్రోధం ఉన్నట్లుగా గమనించాడు వీర. విసుగు, కసి, నైరాశ్యం కూడా. మరణాన్ని దగ్గరగా చూసిన వాళ్లకళ్లలా ఉన్నాయి.

కాసేపు ఎలా స్పందించాలో అర్థం కాలేదు. ఆమె రెండు చేతుల్ని పట్టుకొని, సన్నగా, పీలగా, వడిలిపోయిన ఆమె శరీరాన్ని దగ్గరకు తీసుకున్నాడు. రెండేళ్ల శిశువును దగ్గరకు తీసుకున్నట్లుగా, ఆమెను దగ్గరకు తీసుకుని, గుండెల్లో పొదువుకున్నాడు. సమస్తమూ ధ్వంసం అయిన శరీరం. ఆకలి, దఃఖం, బాధ తప్ప ఏమీ తెలియని శరీరం. చావును చాలాసార్లు దగ్గరగా చూసిన శరీరం. ఇరవై యేళ్ల క్రితం, చామంతి పూల తోటలా నవనవలాడిన మనిషి, మరణించిన తోటలా ఉంది. ఎండిపోయి, నల్లగా వడిలిపోయి, (పూలన్నీ రాలిపోయి).

కాసేపు ఎలా స్పందించాలో అర్థం కాలేదు వీరకు. ఆమెను ఎలా పలకరించాలో కూడా అర్థం కాలేదు. సినిమాటిక్‌గా, 'అమ్మా' అని పిలవడం నవ్వు వచ్చింది వీరాకు. 'ఎక్కడ ఉంటున్నావు' అన్నాడు.

గొంతు పెకిలించి, 'అదుగో ఆ చివరి గుడిసె' అంటూ అటువైపు చూపింది.

ఇద్దరూ లేచి, అటువైపు నడిచారు. ఏదో సినిమాలో దృశ్యంలా ఉంది. లోపలేదో తెలియని ఆనందం చిప్పిల్లుతోంది. ఇన్నేళ్ళ తరువాత, తల్లి అనుకునే మనిషి, (ఈమె తన తల్లేనా అని ఇంకా ఆశ్యరం వీరాకు) అట్లా కలలో లాగా, కళ్లు తెరిచేసరికి కళ్ల ఎదురుగా ప్రత్యక్షం కావటం ఆశ్చర్యంగా ఉంది. గుడిసెల్లోని జనం వింతగా చూస్తున్నారు. పిల్లలకిదంతా ఏదో తమాషాలాగా, కలలోని సన్నివేశంలా ఉంది. తల్లి, తనదని చెపుతున్న గుడిసె, దాదాపు శిథిలావస్థలో ఉంది. గుడిసె ముందో కుక్కపిల్ల పడుకొని ఉంది. రెండు మూడు కోళ్లు మట్టిని కెలుకుతున్నాయి.

గుడిసె దగ్గరలో ఒక మనిషి నిలబడి ఉన్నాడు. దాదాపు నగ్నంగా ఉన్నాడు. సన్నటి గోచి తప్ప ఒంటిమీద ఏమీలేదు. ఎముకలు బయటకు పొడుచుకువచ్చాయి. ఎగశ్వాసతో రొప్పుతున్నాడు. తనలో తాను గొణుక్కుంటూ, తనదైన ప్రపంచంలో ఉన్నాడు. వీరా అతన్ని పలకరించాడు. వీరావైపు చూసి ముఖం తిప్పుకొన్నాడా మనిషి. వాళ్లిద్దరి వైపు తిరిగి ఏదో శపిస్తున్న వాడిలా గొణుక్కుంటూ అడవిలోకి వెళ్లాడు.

'గుడిసెలో ఇంకెవరుంటారు' అన్నాడు తల్లితో. ఎవరుంటారు? నేను తప్ప అన్నట్టుగా చూసింది. 'అతను ఎవరు' అనడిగాడు. చాలాసేపు పిచ్చిచూపులు చూసి 'నాకేదీ గుర్తుండదు' అన్నట్టుగా చూసింది. సైగచేసింది. వీరా మాటల కోసం వెతుక్కున్నాడు. తనమీద తనే విసుక్కున్నాడు, ఏం మాట్లాడాలో తెలియనితనానికి. కొన్ని లక్షల

సార్లు అనుకొని ఎదురు చూసిన దృశ్యం... వందల వేలసార్లు కలల్లో ఎదురైన దృశ్యం... వీరా కళ్లముందు ఎదురైతే, ఎట్లా స్పందించాలో తెలియకపోవడం... ఈ సన్నివేశం మొత్తం ఇంత మామూలుగా ఉండటం... అతనికి ఆశ్చర్యంగా ఉంది. ఏడ్చి, నవ్వి, దుఃఖపడి, ఎగిరి గంతేసి, లేక ఆకాశం వైపో, దేవుడి వైపో తిరిగి, పెద్దగా కేకలు వేసి, అట్లాంటిదేం లేకుండా అతి మామూలుగా ఆ సంఘటన జరగటం, బహుశా, ఇది ఇంతేనేమో. ఈ సంఘటన ఇట్లాగే ఉంటుందేమో అనుకున్నాడు.

'చామంతి' అని, తను గుర్తు పెట్టుకొన్న వాళ్లమ్మ పేరు 'చామంతి' కాదు. చిన్న లచ్చక్క, చామంతి, బహుశా కలల్లోనో, ఊహల్లోనో వాళ్లమ్మను పిలుచుకునే పేరు అయ్యుంటుంది. చిన్న లచ్చక్కకు జ్ఞాపక శక్తి క్షీణించింది. ఏమ్నీసియా లాంటి స్థితి. ఏదీ గుర్తుండదు. వీరాని ఆమె ఇంకా గుర్తు పట్టలేదు. సన్నని జ్ఞాపకమేదో, ఎక్కడో, మిణుక్కుమంటోంది ఆమెలో. తనకు బాగా తెలిసిన ఎవరో వ్యక్తి అనుకుంటోంది. కొడుకు అనే విషయం ఆమెకింకా స్ఫురణలోకి రావటంలేదు. గత నాలుగైదేళ్లుగా, ఆమె గుడిసె దాటటంలేదు. టి.బి. వచ్చినాక ఆమె శక్తి దాదాపు క్షీణించింది. దానికేమీ మందులు తీసుకోలేదు ఆవిడ. రోజుల తరబడి గుడిసెలోనే పడుకునేది. ఎవరైనా ఏదైనా తెచ్చిస్తే తినేది, లేదంటే అట్లాగే పడుకునేది. సారాయి దొరికినప్పుడు మాత్రం తనదైన విశ్వరూపంలోకి వెళుతుంది. కంది రీగ తుట్టెలాంటి జ్ఞాపకాలు, ఒక్కసారిగా ముందుకు తోసుకొస్తే కుటుంబంలోని నాలుగు మరణాలు గుర్తుకొచ్చి, కొడుకును అడవికి అప్పగించిన సంఘటన గుర్తుకొచ్చి, ప్రళయ భీకరంగా ఏడుస్తుంది. అట్లా రోజుల తరబడి ఏడుస్తూనే ఉంటుంది. సారాయి మత్తు దిగిపోయే వరకే. మత్తు తొలిగినాక, మళ్లీ జ్ఞాపకాలు లేనితనం ఆమెను ఆవహిస్తుంది. అది ఒక అద్వైత స్థితి. దుఃఖమూ, బాధ, ఆకలి కూడా లేని స్థితి. ఆ స్థితిలో అడవంతా తిరుగుతుంది. ఎప్పుడో గుర్తొచ్చినపుడు గూడానికి వస్తుంది.

వీర క్రమంగా ఒక ఉద్వేగ సముద్రం అయ్యాడు. తల్లి మానసిక స్థితి అతనికి తెలియదు. ఇన్నేళ్ల తరువాత తల్లిని చూడటం, ఒక కాల్పనిక సంఘటనగా ఉంది. ఆమెను చూడగానే తనవైన మూలాలేవో, మెల్లగా అతనిలో కదులుతున్నట్లుగా తోచింది. తన దంటూ ఒక భూమి, తన శరీరాన్ని మొత్తం వృక్షంలా మార్చి ఈ ఆకుపచ్చని భూమిలో

## బాబోయి

సభలలో చెణుకులు విసరడంలో సినారెకు ఎవరూ సాటిరారు. ఒకానొక సభాకార్యక్రమంలో డాక్టర్ బోయి భీమన్న సుదీర్ఘప్రసంగం చేయడంతో నారాయణరెడ్డి 'బోయి భీమన్న.. బాబోయి భీమన్న అనేలా ఇవ్వాళ మాట్లాడారు' అంటూ చురకవేసి అందరికీ కితకితలు పెట్టారు. మరోసారి 'ఆధునికాంధ్ర కవిత్వంలో గేయం' అంశంపై పరిశోధన చేసిన డాక్టర్ చెన్నకేశవరెడ్డి పుస్తకావిష్కరణ సభలో ప్రసంగిస్తూ 'ఈయన చిన్నకేశవరెడ్డి కాదు.. అన్నింట్లోనూ పెద్ద కేశవరెడ్డే' అని చమత్కరించారు. అంతే సభలోని వారంతా ఒకటే నవ్వులు.





తన వేళ్లను బలంగా పాతుకుపోయేలా భూమిలోకి ప్రయాణించాలని కోరిక కలిగింది. అనాథ శిశువుకు, అతని ప్రపంచం తిరిగి వచ్చింది. అడవి అన్ని మూలలకూ తిరిగి, చెంచు జాతి మొత్తాన్ని పలకరించి, నేను మీ వాణ్ణి అని ప్రకటించాలనిపించింది. ఈ పదిహేను గుడిసెల ఈ చిన్న ప్రపంచం, తన భూమి, తన దేశం. బహుశా తన భవిష్యత్తు కూడా ఇదేనేమో అనిపించింది. సూర్యుని వెలుగులో బంగారు రంగులో మిలమిలలాడుతున్న ఈ ప్రదేశం, ఎన్నో విధ్వంసాలను తట్టుకొన్న సౌందర్య భూమి అనిపించింది. ఆకుపచ్చని భూమి, ఆకాశాన్ని ముద్దాడే చెట్లు, వాటిని ఒరుసుకుంటూ వీచే గాలి, గాలి పాడే పోరాటపు పాటలు, ఇన్ని దుఃఖాలు, మరణాలు, ఆకలి, మానవహింస తరువాత కూడా, మళ్లీ మళ్లీ జీవించగల జీవభూమి ఇది అనిపించింది.

వీర ముఖంలో వెలుగు, సత్యాన్ని చూసిన వాడి ముఖంలో కనబడే వెలుగు. అతని తల్లి, చిన లచ్చక్క విశ్శబ్దంగా కొడుకు పక్కన నిలబడింది, బాగా వంగిపోయిన శరీరాన్ని పైకి ఎత్తాలని ప్రయత్నిస్తూ. గుడిసెలో ఆవేళ్టి ఆహారానికి ఎవరో తెచ్చిపెట్టిన దుంపలు, వేరు గడ్డలు ఉన్నాయి. వాటిని తన చేతులతో, తన పక్కనే నిలబడ్డ మనిషికి (అతనే తన కొడుకనే భావన ఆమెలో ఇంకా రికార్డు కాలేదు) తినిపించాలనే కోర్కె కలిగింది. మట్టిపాత్రలు, రేకు గ్లాసులు అందుకుంది. గుడిసె లోపలకెళ్లి హడావుడి చెయ్యడం మొదలుపెట్టింది. చిన్నప్పుడు బిడ్డకు అన్నం తినిపించిన జ్ఞాపకం (శిశువుకు స్తన్యమిచ్చినప్పటి జ్ఞాపకం కూడా) ఏదో ఆమెలో తళుక్కుమంది. జ్ఞాపకాలు తోసుకొచ్చినప్పుడల్లా, ఆమె వత్తిడికి లోనవుతుంది.

పెద మంతయ్య, గురప్ప ఇంకా నలుగు నైదుగురు గూడెం పెద్దలు ఆ గుడిసెలో మూగారు. వీర చెప్పిన చిన్నప్పటి కబుర్లన్నీ విన్నారు. తల్లిని వెతుక్కుంటూ రావటం వాళ్లను ఆర్ద్రంగా తట్టింది. పిచ్చిది అతన్ని పట్టించుకుంటుందో లేదో అని దిగులుపడ్డారు. పెదమంతయ్య వీరాని పక్కకు పిలిచి పండగ చేయాల్సిన సందర్భమని గుర్తుచేశాడు. వీర జేబులోంచి డబ్బులు బయటకు వెళ్లి, కాసేపట్లోనే సారాయి ఘుమఘుమలు గూడెమంతా చెలరేగుతాయి. కొలతలేని సందర్భమిది. అరుపులు, కేకలు, దుఃఖంలాంటి పాటలు, దీర్ఘంగా కొనసాగే రోదనలను, కేరింతలు, నిర్లిప్తంగా, శాపగ్రస్తంగా పడివున్న భూమి ఉత్సవ భూమి అయ్యింది. ఒకడు డప్పు తెచ్చాడు. పాటలు, నర్తనం మొదలైనాయి. చిన్నపిల్లలు బెరుకు వదిలి కేరింతలాడటం మొదలుపెట్టారు. అందరూ వీరవైపు వేలు చూపించి, కథలు కథలుగా చెప్పుకోవటం మొదలు పెట్టారు. వీర వైపు పరిగెత్తి, అతని జీన్ ప్యాంటు, చొక్కాని ముట్టుకొని చూస్తున్నారు. అతని శరీరాన్ని ముట్టుకొని వెంటనే పరిగెత్తుతున్నారు. పెళ్లికాని పిల్లలు కొద్దిగా సిగ్గు నటిస్తున్నారు. సూర్యుడి ఎండ మిలమిల లాడుతున్న సమయాన చింతల ముడిపి చెంచుగూడెం కోలాహల భూమి అయ్యింది.

మరుసటిరోజు ఉదయానికి ఉత్సాహమంతా అదృశ్యమైంది. గూడెంలో మామూలు జీవితం మొదలైంది. ఎప్పటిలాగే నిర్లిప్తం, మౌనం. చిన లచ్చక్క కొంతమంది ఆడవాళ్లతో కలిసి అడవికి వెళ్లింది, దుంపలు తవ్వుకురావడానికి. మధ్యాహ్నానికి తిరిగి వచ్చింది. దుంపలు తవ్వలేదో, తవ్వినవి తీసుకురాలేదో తెలియదు. గుడిసెలో ఆమె వచ్చేసరికి వీర ఒక్కడే ఉన్నాడు. వంట చేశాడు. బియ్యపు జావ, ఇంకేదో పచ్చడి. చిన లచ్చక్క వీర వైపు చూడకుండానే మౌనంగా ఇంటిలోకి వచ్చింది. గొప్ప ధ్యానంలో ఉన్నదానిలా గంభీరంగా మారిపోయింది. గుడిసెలో ఇద్దరి మధ్యన ఆశ్చర్యకరమైన మౌనం. వీర పలకరించినా విననట్టు ముఖం పెట్టేది. బయటి వ్యక్తి ఎవరో తన గుడిసెలో ఉంటున్నట్టు వీరాని చూసేది. నిన్నటి కొద్దిపాటి ఆనందపు క్షణాలు అయిపోయినాక అడవిలో పూర్వపు మరుపు వచ్చేసింది. వీర తిరిగి రావటం, కళ్ళ ముందు తిరగటం, ఇవేవీ ముఖ్యమైన విషయాలు కావనిపించింది ఆమెకు. ఎప్పటిలాగే గుడిసెలో ఒక మూలన ముడుచుకొని పడుకుంది. వీర ఆమె కోసం గంజి తీసుకొచ్చాడు. ఎదురుగా ఉన్న పళ్లాన్ని చాలా సేపు ముట్టుకోలేదు. తాగకపోతే ఎదురుగా కూర్చున్న వ్యక్తి వెళ్లేలా లేడని, పళ్లెం లాక్కుని గడగడా తాగేసింది. మళ్లీ మునగతీసుకొని పడుకొంది.

వీర ఆమె పక్కనే కూర్చున్నాడు. ఆమె క్రమంగా నిద్రలోకి జారుకోవటం గమనించాడు.

నిద్రో, నిద్రలాంటి కలో తెలియలేదు. దగ్గరగా చూస్తే, కళ్ళు రెండూ నిర్జీవంగా, జీవితేచ్ఛ లేనట్లుగా, చూడడానికి కూడా ఓపిక లేనట్లుగా, కదలిక లేని నిశ్శబ్దంగా మారిపోయాయి.

కాళ్ళు పగిలిపోయి, అక్కడక్కడా నెర్రెలిచ్చాయి. నెర్రల్లోంచి రక్తం కారుతోంది. కాళ్ళకు చెప్పుల్లేకుండానే అడవికి వెళ్లింది. శరీరాన్ని కప్పీకప్పనట్లున్న చిరుగుల చీర. ఎందుకో ఒక్కసారిగా దుఃఖం వచ్చింది వీరకు. ఈ మనిషి... తన తల్లి... ఈ చిన్నన్న లచ్చక్క మొత్తం చెంచుజాతి జీవన స్థితికి ప్రతీకలా ఉందనిపించింది. పాదాలను, తడిగుడ్డతో వత్తి, రక్తం తుడిచి, నూనె రాసి, మెల్లిగా రుద్దటం మొదలు పెట్టాడు. ఆమె కళ్ళు తెరచి అతనివైపు చూసి, మళ్ళీ కళ్ళు మూసుకుంది.

వీరాకు హఠాత్తుగా మోహిని గుర్తుకొచ్చింది. ఎందుకో తెలియదు, ఉన్నపాటున హైదరాబాద్ వెళ్ళిపోవాలనిపించింది. గాఢమైన, వెచ్చనైన మోహిని కౌగిలి కావాలనిపించింది. ఆమెను ముద్దు పెట్టుకుంటున్నప్పుడు క్షణాల్లో శరీరంలో కలిగే పులకరింత కావాలనిపించింది. తన ఆలోచనలకు క్షణంపాటు సిగ్గుపడ్డాడు. వీర జీవితం ఇప్పుడే, ఇరవై నాలుగు గంటల క్రితమే మొదలైంది. ఇప్పుడు హైదరాబాదుకా అని సమాధానం చెప్పుకున్నాడు. తనవరకు హైదరాబాదు అతిథిలాంటిదేనని సర్దిచెప్పుకున్నాడు.

నిద్రలో ఏదేదో మాట్లాడుతోంది లచ్చక్క. అన్నం తినే చేతివేళ్ళను నోట్లో పెట్టుకొని చిన్నపిల్లల్లా చప్పరించుకుంటోంది. బహుశా ఆకలి తీరలేదేమో అనుకున్నాడు. వందల యేళ్ళ ఆకలి, రెండు గంజి మెతుకుల్ని మింగితే ఏం తీరేను అనుకున్నాడు.

ఆ రోజంతా తల్లితోనే గడిపాడు వీర, రోజంతా ఆమె నిద్రబోతూనే ఉంది. నిద్ర లేచినప్పుడు వీర ఇచ్చిన గంజి తాగుతోంది. మళ్ళీ నిద్రపోతోంది. నిద్రపోతున్న తల్లిని ముట్టుకొని "చామంతీ" అని గొణిగాడు. చామంతి పూవులాగా మిలమిలలాడే తన బాల్యపు తల్లి కోసం ఆమెలో చాలా సేపు వెతికాడు.




తనదైన నేలపై వీర. రెండవరోజు సూర్యుడు నిన్నటిలా ప్రకాశవంతంగా లేడు. మబ్బులు ముసిరిన ఆకాశంలో కాస్త వెలుగు, కాస్త నీడల ముసురు. ఉత్సాహం లేనితనం గూడాన్ని కమ్మివేసింది. పెదమంతయ్య తన గూడానికి వెళ్ళాడు. అందరూ మార్మికమైన నిశ్శబ్దంలోకి కూరుకుపోయారు. రెండో రోజంతా గుడిసె చుట్టూ కంచె వేయటం, గుడిసెపైన రెల్లుగడ్డి కప్పటం లాంటి పనులు చేశాడు. పోతమ్మ సాయంతో గుడిసె లోపల ఎర్రమట్టితో అలికాడు. తల్లికోసం ఒక చాపను సంపాదించాడు. సుంకేసులదాకా వెళ్ళి తల్లికి, రెండు చీరలు కొనుక్కొచ్చాడు. గూడానికి అటు నాలుగు కిలోమీటర్లు, ఇటు నాలుగు కిలోమీటర్లు దూరం తిరిగి వచ్చాడు. రాత్రికి పెదమంతయ్య గుడిసెకు వెళ్లాడు. ఆయనకు అర్థమయ్యేలా ఇవాళ్టి రాజకీయాల గురించి, ప్రభుత్వ విధానాల గురించీ, ఈ నీటి ప్రాజెక్టుల గురించి, వీటిపై జరుగుతున్న ఆందోళనల గురించి, అంతట్నీ వివరించాడు. గూడెం ఖాళీ చెయ్యక తప్పదని వివరించాడు. చెంచుతెగ బతకాలంటే నాగరీకులతో కలవటం తప్పనిసరి అని వివరించాడు. దోర్నాల, శ్రీశైలం దగ్గర చెంచుల గురించి చెప్పాడు. చదువుకొని ఉద్యోగాలు చేస్తూ ఇళ్ళు కట్టుకొని ఎట్లా జీవిస్తున్నారో వివరించాడు. దాదాపు రెండు గంటలసేపు మంతయ్య చాలా ఓపిగ్గా వీర చెప్పినదంతా విన్నాడు. “ఇవన్నీ ఐటిడి వాళ్ళు ఎప్పుడూ చెప్పేదేగా, ఇంకా ఏమయినా ఉంటే చెప్పు” అన్నాడు. “నీ ఆలోచన మంచిదే, కానీ బయటకు వద్దు. అడవిలోనే ఇంకో చోటుకి వెళ్దాం. దానికైతే కుర్రాళ్ళను ఒప్పిస్తాను. ఆ విషయం నిన్ను పంపిన వాళ్ళతో (గవర్నమెంటు) మాట్లాడు” అన్నాడు పెదమంతయ్య.

వీర ఆలోచనలో పడ్డాడు. అడవులు మునుపట్లా లేవు. పోలీసు కూంబింగ్‌లు, ఫారెస్టు డిపార్టుమెంటు వాళ్ళ ఆంక్షలు... అడవులు రానురాను, ప్రమాదకరమైన నివాసాలయినాయి. బయటకు రావటమే మంచిదని అతని ఆలోచన. అయితే వాళ్ళ సెంటిమెంటు కాదనే ధైర్యం వీరకు లేదు. అడవులతో అల్లుకుపోయిన సంస్కృతి చెంచులది. దాన్ని వదిలి రావటమంటే కాళ్ళు నరుక్కోవటమేనని, పెదమంతయ్య వాదన. ఎటూ తేల్చుకోలేకపోయాడు వీర. మోహినితో మాట్లాడితే బాగుండు అనిపించింది. మోహిని చెప్పిన పది లక్షల ప్రాజెక్టు అతని మనసులో ఒక అసౌకర్య భావనలా మెదిలింది.

పెదమంతయ్య గుడిసెనుంచి బయలుదేరి గూడెంవైపు పయనమయ్యాడు వీర. ఏదీ తేల్చుకోలేని ఒక సందేహం తనలో. గూడెం దగ్గరకు వస్తుంటే, ఎవరో పిలిచిన చప్పుడు. గూడెం ఇంకా అర కిలోమీటరు దూరం ఉంది. శబ్దాలు వినిపిస్తున్నాయి, కానీ మనుషుల అలికిడి లేదు. “రా, బయటికి రా. మేకల్ని విప్పు, అడవికి పోవాలి” దూరం నుంచి ఎవరో పిలుస్తున్నారు. ఆ పిలుపు వినిపించినవైపు చూశాడు వీర. ఎవరూ కనపడలేదు. కాస్త దూరం పోయినాక ముసలివాడు ఒకడు కనబడ్డాడు. శోష వచ్చిన వాడిలా రొప్పుతున్నాడు. కళ్ళు మగతగా ఉన్నాయి. అర్థంకాని మాటల్ని కలవరిస్తున్నాడు. కలవరింత

ఒకసారి తీవ్రంగా, పెద్దగా, అంతలోనే శక్తి హీనమై, సన్నని గుసగుసలాగా వినబడుతోంది.

"రేయ్, ముసలోడా, ఇంటికి రా" దూరం నుంచి ఎవరో పెద్దగా పిలుస్తున్నారు. ముసలాడి చెవిలో ఆ మాటలు దూరుతున్నాయో లేదో తెలియదు. అతని దగ్గరికెళ్లి తట్టి లేపాడు వీర. కళ్లు తెరుచుకుని, మళ్లీ మూతలు పడుతున్నాయి. జ్వరంతో శరీరమంతా కాలిపోతోంది. గుడిసెలోంచి పాక్కుంటూ అడవిలోకి వచ్చాడు. అతని పేరు అంకయ్య. ముసలాడికి దూరంగా నల్లకుక్క ఒకటి. క్రూరంగా, కోప తీవ్రతతో అరుస్తోంది. అయితే నీరసంతో ఉన్న దాని శబ్దం బయటకు రావటంలేదు. కాళ్లు పైకెత్తి వీరవైపు దూకబోయింది. ఎత్తిన కాళ్లతో అట్లాగే నేలకు జారిపడింది. నోరు తెరిచి అరుస్తున్నట్లుగా దవడలు ఆడిస్తోంది. వీర దాని తల నిమిరి ఊరుకోమని సైగ చేశాడు.

ముసిలాడి కలవరింత కొనసాగుతోంది. ఇప్పుడు సన్నగా నవ్వుతున్నాడు. నవ్వు ఆగిపోయిన క్షణాల్లో ఎవరెవరినో గుర్తు చేసుకుంటూ పిలుస్తున్నాడు. వీర ముసలాడి దగ్గరకు వెళ్లి ముఖాన్ని తడిమాడు. ఊపిరి వెచ్చగా ఉంది. మాట్లాడటం కొనసాగిస్తూనే ఉన్నాడు. వేడివేడి పొగలతో ఆ మాటలు నోటిలోంచి బయటకు వస్తున్నాయి. క్షణంసేపు మాటలు ఆపి మగతలోకి వెళ్తాడు. అంతలోనే మేలుకుంటాడు. నవ్వుతాడు. మళ్లీ మాట్లాడతాడు. బహుశా నవ్వు, మాటలు, ఇవన్నీ అతని మెదడులో జరుగుతున్న ఏదో సంభాషణకు చెందినవి అనుకున్నాడు వీర. ఆ మాటలు, శ్వాస తప్ప ఆ మనిషి శరీరంలో మరేభాగమూ లేదు. గుండె, ఊపిరితిత్తుల లాంటి అవయవాలు అతని నుంచి అదృశ్యమై, ఒట్టి డొల్లగా మిగిలి ఉన్నాడనిపించింది. మెదడు మాత్రం జీవించి ఉన్నట్లుగా ఉంది. పరిసరాల స్పృహ లేదు. ఎదురుగా మనిషి ఉన్న ధ్యాస లేదు. ఆత్మ చివరి క్షణాల పెనుగులాట ఇదే కాబోలు అనుకున్నాడు వీర. శరీరం క్రమంగా చల్లనవుతోంది. వీరకు ఏంచెయ్యాలో తోచలేదు. ఇందాక కేకలు వచ్చినవైపు చూశాడు. అక్కడ మనషులెవరూ లేరు. "ఇంట్లోకి రా" అంటూ అరిచిందేదో అర్థం కాలేదు. తన భ్రమ ఏమో అని కాసేపు సరిపెట్టుకున్నాడు. ఆ మనిషిని భుజంపై వేసుకుని, సుంకేసులవైపు పరిగెత్తాలని చూశాడు. అయితే అప్పటికే శరీరం చల్లబడి, ప్రాణం ఉన్న సూచనలు అదృశ్యమైనాయి. వైద్య సహాయం అందించినా అందుకోలేనంత దూరం వెళ్లిపోయాడు. అతనికున్న కొద్ది పరిజ్ఞానంతో అర్థమైంది-ఇది ఆకలి చావని. వారం, నెల కాదు, ఇంకా ఎక్కువ కాలమే అయ్యుంటుంది. దాదాపు వారం పాటు ఆహారం లేకుండా ఉండగలనని మంతయ్య చెప్పాడు. చాలా నెలలు లేదా సంవత్సరమో అయ్యుంటది- ఆ మనిషి శరీరంలోకి ఆహారం వెళ్లి. గూడెంలో వీరకు ఎదురైన మొదటి మరణం. చావు ఎదురైన ఆ సందర్భం మొత్తం అతడికి షాక్ ట్రీట్‌మెంటులా ఉంది.

ఆకాశం నిన్నటిలాగే ఉంది. లేచి గూడెం వైపు నడవటం మొదలుపెట్టాడు. కాస్త దూరం నడిచినాక వీర గుండెల్లో తెలియని బాధ, ఆ మనిషినట్లా వదిలివెళ్లటం గురించి. మోసుకుని వెళ్లి ఏదైనా హాస్పిటల్‌లో చేర్చి ఒక చివరి ప్రయత్నం... ఊహు, అవన్నీ అద్భుత క్రియలనిపించాయి. దిగులుగా గూడెంవైపు వెళ్లాడు. నల్లకుక్కపిల్ల అతని వెంట వెళ్లింది. గూడెం నిద్రపోతోంది. ఆ చనిపోయి న మనిషిలాగే వీళ్లూ, ఒక కలను (బహుశా ఆహారం తింటున్న కల అయ్యుంటుంది) కౌగిలించికొని నిద్రపో

తున్నారేమో అనుకున్నాడు. గుడిసెలో అమ్మ ఆదమరిచి నిద్రపోతోంది. గిన్నెలన్నీ ఖాళీగా ఉన్నాయి. బహుశా అన్నం కూడా తిని ఉండదు. అట్లాగే పడుకొని ఉండి ఉంటుంది- ఉదయం నుంచీ. హతాశుడ య్యాడు వీర. ఆహారం లేకుండా రోజుల తరబడి జీవించగలిగే తెగ ఇదేనేమో అను కున్నాడు.

గుడిసెలో ఒక మూలన కాళ్లు ముడుచు కొని పడుకున్నాడు. గూడెం నిద్రపోవటం అతనికి వినిపిస్తోంది. వాళ్ల కలలు, కలవ రింతలు భూమి పొరల్లోకి ప్రసరితం అవు తున్నాయి. క్రమంగా అతన్ని నిద్ర కమ్ము కుంది. నిద్రలో చనిపోతున్న మనుషులు, వాళ్ల నవ్వులు... కలలో నవ్వులు కూడా మరణించటం... ఉలిక్కిపడి లేచాడు వీర. లేచి ముసలివాడు పడివున్న ప్రదేశంవైపు నడిచాడు. అప్పటికే అతను(అంకయ్య) చనిపోయాడు. ఆ రాత్రంతా శవానికి కాప లాగా అక్కడే ఉన్నాడు. మరుసటిరోజు శవం చివరి ప్రయాణందాక ఉన్నాడు. మామూలుగా జరిగిందా చివరి యాత్ర. ఏ హడావుడీ లేదు. ఎవరిలోనూ దుఃఖం లేదు. ఆ వెళ్లిపోయిన మనిషి షికారుకేదో వెళ్లినట్లుగా, ఎవరూ దిగులు పడలేదు. అసలా సంఘటనను ఎవరూ పట్టించుకో లేదు. ఇది తాత్విక పరిణితా, మనసు మొద్దుబారటమా తేల్చుకోలేకపోయాడు వీర.

మరో ఉదయం చిన్న లచ్చక్క నిద్ర లేచి ఇంటిపనులు చేసుకోవటం మొదలు పెట్టింది. వీర ఉనికిని పట్టించుకోనేలేదు. గుడిసెలో చాలా మార్పుల్ని ఆమె గమనిం చింది. నేల అలకటం, కొత్త చాప, కుండ లలో ధాన్యం, ఇదంతా వీర సమకూర్చిందే నని ఆమెకు తెలుసు. అయితే ఇవేవీ ఆమెకు ఉత్సాహాన్ని కలిగించలేదు. జీవితం ఎప్పటిలాగా నిర్లిప్తంగా ఉండటం ఆమె గమనించింది. ఎప్పటిలాగే బుట్ట తీసుకుని అడవికి బయలుదేరింది. ప్రేమ చూపటం, ప్రేమను స్వీకరించటం ఆమెకు అంతగా తెలియదు. వీరతో ఎట్లా సంభా షించాలో ఆమెకింకా అర్థం కాలేదు. వీర తన కొడుకనే విషయం, ఆమెలో ఇప్పటికీ రికార్డు కాలేదు. మొదటిరోజు కలిగిన ఉత్సాహం, ఇప్పుడు కనబడటంలేదు. మన సును ఏ ఆలోచనలు, ఉద్వేగాలూ లేకుం డా ఖాళీగా ఉంచటం అలవాటయింది ఆమెకు.

అడవినుంచి వచ్చినాక హఠాత్తుగా వీర దగ్గరకు వెళ్లి "నాకేదయినా ఇవ్వు" అంది అనాలోచితంగా. వీర జేబులోని డబ్బు లన్నీ రెండువేలకు పైగా ఆమెకిచ్చాడు. చేతికి ఉన్న వాచీ, సంచిలో ఉన్న ఉన్నికం బళి, మిగిలిపోయిన బిస్కెట్ పొట్లాలు, అన్నీ. అన్నిటినీ భద్రంగా చెక్కపెట్టెలో దాచుకుంది. ఎందుకో అవి చానాళ్లు దాచి పెట్టుకోవాల్సిన వస్తువులని, ఆమె మన సులో అనుకుంది.

ఆ రాత్రి చినలచ్చక్క జబ్బుపడింది. జ్వరం, చలి, వణుకు, చెమట, మలేరియా జ్వరం, ఆమె శరీరం చుట్టూ, కంబళి కప్పి, క్లోరోక్వినైన్ మాత్రలు ఇచ్చాడు వీర. రెండోరోజు కూడా జ్వరం ఉంది. మనిషి బాగా పీక్కుపోయింది. కళ్లు పాలిపో యాయి. ఆమె కూడా చనిపోతుందేమో అని భయం వేసింది వీరాకు. రోజంతా పక్కనే కూర్చుని సేవలు చేశాడు. చుట్టుప క్కల గుడిసెల్లో కూడా జ్వరాలు. కిందగూ డెం, పైగూడెం కలిపి యాభైమందిదాకా ఉంటారు. వాళ్లలో ముప్పయి మందికి జ్వరాలు. స్త్రీలలో, పిల్లలలో ఈ జ్వరాలు ఎక్కువ. వీరాకు ఎందుకో భయం వేసింది. జ్వరంతో చచ్చిపోయిన అంకయ్య గుర్తుకొచ్చాడు. కొత్తగా వెళ్లబోయే గూడా ల్లోకి శవాల్ని తరలిస్తున్నట్లుగా కల

వచ్చింది. మార్కాపురం వెళ్లి ఒక నర్సును, అవసరమైన మందుల్ని తీసుకొచ్చాడు. తాలుకా హాస్పిటల్ డాక్టరు, గూడానికి రావడానికి ధైర్యం చెయ్యలేదు. అయితే నాలుగో రోజు గూడెం దగ్గరలో అలల సుందరం ప్రత్యక్షమయ్యాడు. కొత్తగా కొన్న ఖరీదైన జీపులో వచ్చాడు. వెంట డాక్టరును కూడా తెచ్చాడు. డాక్టరు గూడె మంతా సుడిగాలిలా ప్రయాణించాడు. అలల సుందరంతోపాటు పత్రికా విలేఖ రులు కూడా వచ్చారు.

అలల సుందరం గుడిసె మధ్య పర్యటి స్తుండగా ఫొటోలు తీశారు. వీరని చూసి గుర్తుపట్టి, "ఏ కబురు లేదు నీ దగ్గర నుంచి" అని విసుక్కున్నాడు. రెండు గంట లపాటు ఆ ప్రాంతంలో అలజడి సృష్టించి, అక్కడ నుంచి వెళ్లిపోయాడు అలల సుందరం.

నిజానికి అలల సుందరానికి ఎన్జీవో గురించి పెద్దగా తెలియదు. మోహిని ఫోన్ చేసినప్పుడు, ఆ విషయాన్ని సీరియస్‌గా పట్టించుకోలేదు. అయితే, రెండు రోజుల క్రితం మరో ఎన్జీవో సంస్థ వచ్చి, నలభై ఇళ్ల కట్టి ఇవ్వబోతున్నామని, చెపితే ఆశ్చర్యపో యాడు. అనుమతి పత్రాలు అన్నీ చూపిం చాలి. అంతేకాదు. అలల సుందరానికి 'గుడ్‌విల్ / మెషర్'గా ఐదు లక్షలు ముట్టింది. ఆ డబ్బు చేతిలో పడ్డాక ఇది ఎంత ముఖ్యమైన కార్యక్రమమో అర్థమైంది. నిజానికి వీర కోసం వెతుకుతున్నాడు అలల సుందరం. "ఇక నుండి డాక్టర్లు, రోజూ వస్తారు. అవసరమైన మందులు సరఫరా చేయిస్తాను. వాళ్ల ఆరోగ్యాలు జాగ్రత్త" అంటూ ఎన్నో జాగ్రత్తలు చెప్పి వెళ్లాడు అలల సుందరం.

వారం రోజుల పోరాటం తరువాత మలే రియా జ్వరాలు అదుపులోకి వచ్చాయి. ఇదంతా వీర వంటరి పోరాటమే. నర్సు,

ఒక్కపూట ఉండి వెళ్లిపోయింది. అలల సుందరం చెప్పిన డాక్టర్లు, ఒక్కరోజు కూడా రాలేదు. ఆశ్చర్యంగా, గూడెంలో కూడా ఎవరూ దీన్ని సీరియస్‌గా తీసుకోలేదు. జ్వరాలకింత కంగారెందుకు అన్నట్టుగా చూశారు. వస్తాయి, పోతాయి, ఎందుకింత హడావుడి అని వీరాని ప్రశ్నించారు. ఆ నిర్లిప్తత చూసి వీర దిమ్మెరపోయాడు. వ్యాధి, మరణం- ఇవి రెండూ వీళ్లలో భయాన్ని కలిగించలేకపొయ్యాయే అని కలత చెందాడు. వీళ్ల మానసిక స్థితిని ఎట్లా వివరించాలో అర్థం కాలేదు వీరకు. ఎట్లా వీళ్లలో జీవనోత్సాహం నింపాలో అర్థం కాలేదు. అయితే ఈసారి, జ్వరాల్లో, ఒక్క చావు లేకపోవటం, వీర సాధించిన విజయం. గూడెంలో అతనిపై విశ్వాసం పెరిగింది.

సరిగ్గా వారం తరువాత కింద గూడెం, పైగూడెం చెంచులు గూడాల్ని వదిలి రావడానికి అంగీకరించారు. అయితే మార్కాపురం దగ్గర స్థలాలకు రావడానికి జనావాసాలకు దగ్గర ఉండే ఏ స్థలానికైనా రావడానికిగానీ ఇష్టపడలేదు వాళ్లు. అడవిలోనే మరో చోటకి వెళ్లాలని నిర్ణయించారు. గూడెం పెద్దలందరూ కలిసి, గొట్టిపడియకు పక్కనున్న అడవుల్లో, ఇరవై కిలోమీటర్ల లోపల ఉన్న ప్రదేశాన్ని గుర్తించారు. సరిగ్గా మూడు రోజుల నడక. పౌర్ణమి రోజు రాత్రి బయలుదేరాలని నిర్ణయించారు.

చెంచుల ఈ నిర్ణయం, తన విజయంగానే భావించుకున్నాడు వీర. తల్లిని కలుసుకున్న తరువాత (అంతకుముందు మోహినితో అనుబంధం తరువాత) అతని జీవితంలో జరిగిన అద్భుత సంఘటనగా భావించుకొన్నాడు.

అయితే ఊహించని ప్రతిఘటన మోహిని దగ్గర నుంచి వచ్చింది. “యు ఆర్ ఎ స్టుపిడ్” అంటూ మండిపడింది. ప్రాజెక్ట్ అంతా మట్టిపాలు చేశావని కోప్పడింది. మోహిని అంత పరుషంగా మాట్లాడగలదని వీర ఊహించలేదు. వీర జరిగిన సంఘటలన్నీ వివరంగా చెప్పాడు. మోహిని అంగీకరించలేదు.

“నాకు చెంచుగూడాల మీద ప్రేమలేదు. ముందే చెప్పాను. మనం వాళ్లను ఉద్ధరించటంలేదని. ఇది మనకో ఉద్యోగం. కెరీర్. అర్ధమయింది కదా. నా భూమి, నా వాళ్లు లాంటి సెంటిమెంటల్ మాటలు చెప్పొద్దు. వాళ్లను ఒప్పించి మర్కాపురం తీసుకురా. ఆచోటే వాళ్లకు మంచిది. లేదంటే అడవులే వాళ్లకు సమాధులవుతాయని చెప్పు. నేను ఇంకేమీ సంజాయిషీ వినను. రేపు వాళ్లు మార్కాపురం వస్తున్నారన్న వార్తను, నాకు చెప్పాలి నువ్వు” అంటూ మోహిని ఫోన్ పెట్టేసింది.

ఉద్యోగం, కెరీర్ అనే మాటలు చాలా సేపు వీరాని వేటాడాయి. దుఃఖం కలిగింది వీరాకు. కలలో లాగా తలుపులు తెరిచి ఆహ్వానించింది మోహిని. బహుశా అదే తీరుగా, తలుపులు మూసివేయడానికి సిద్ధంగా ఉందనిపించింది. భార్యాభర్తలు అనే మృదుభావాలు ఏమైనాయి? ఇద్దరి మధ్య ఉద్యోగం, కెరీర్- ఇవేనా మిగిలింది? వీర కాళ్లకింద భూమి కొద్దిగా కంపించినట్లయింది. ఎంతసేపు ఆలోచించినా, మోహిని నిర్ణయాల్ని అంగీకరించే స్థితిలోలేదు మనసు. తనువంతా దుఃఖం కాగా, ‘సెలవు, ప్రియతమా, సెలవు’ అని మనసులోనే గొణుక్కున్నాడు. స్థలానికి సంబంధించిన కాగితాలు, చెక్కుబుక్కు, మోహినికి రిజిస్టరు పోస్టులో పంపించాడు.

48 మందితో, పౌర్ణమినాటి రాత్రి చెంచులు తమ ప్రయాణాన్ని మొదలుపెట్టారు. మూడు రోజులకు అవసరమైన ఆహారాన్ని




## మాయదారిపువ్వు

పువ్వుమీద కందిరీగ వాలడంలో వింత ఏముంది అనుకుంటున్నారా? ఈ పువ్వు... మామూలు పువ్వు కాదండీ బాబూ! అచ్చం ఆడకందిరీగలా భ్రమింపచేస్తూ మగకీటకాన్ని ఆకర్షించే మాయదారిపువ్వు. వాటిని ఆకట్టుకోవడానికి ఇది ఆడ కందిరీగల పరిమళాన్ని గాలిలోకి వెదజల్లుతుంది. ఇంకేముంది? తోడు దొరికింది గదా అని మగ కందిరీగ దీని మీద వాలిపోయి సరాగం ప్రారంభిస్తుంది. అసలు విషయం తెలిశాక ఉసూరుమంటూ లేచిపోయి.. మరో పువ్వుమీద వాలిపోతుంది. అప్పటికే దాని దేహానికి అంటుకున్న పుప్పొడి రేణువులు అక్కడకు చేరిపోతాయి. తమ పరాగసంపర్కానికి తెలివిగా కందిరీగలను వాడుకునే ఈ పూల పేరు మిర్రర్ ఆర్కిడ్ పుష్పాలు. దక్షిణ స్పెయిన్‌లోని కొండల్లో ఏప్రిల్‌లో వికసించే ఈ పూలు ప్రత్యుత్పత్తి కోసం కందిరీగలకు ఎరవేసి తమ పబ్బం గడుపుకుంటాయి..

సేకరించారు. ఒక్కో కుటుంబం, తమ వస్తువులన్నీ మూటలుగా కట్టుకొన్నారు. ఎనిమిది మేకలు కూడా ఉన్నాయి వాళ్ల వెంట. మూడు కుక్కలు. వాటిలో వీర వెంట వచ్చిన నల్లకుక్క కూడా ఉంది.

అదొక అద్భుతమైన దృశ్యం. వెన్నెల వెలుగులో ఒకజాతి తమ భూమిని వదిలి, మరో భూమిని వెతుక్కుంటూ వెళ్లటం. "ఆత్మ ఛిద్రమైన జాతి యిది. ఇప్పుడన్నా, ఒకచోట చేరి, కొత్త శక్తిని పొందాలి" అని ఆశపడ్డాడు వీర. పెదమంతయ్యా, గురయ్యా ముందు నడిచారు. వెనక వీర, ఆ వెనక ఒక్కొక్కళ్లే నడిచారు. సుంకేసుల వెళ్లి, అక్కడ నుండి రోడ్డుపై ప్రయాణం కొనసాగిద్దామని వీర ప్రతిపాదించాడు. పెదమంతయ్యా వద్దని వారించాడు. అడవిలో నుంచి వెళ్లేతోవ తనకు తెలుసని, అటే వెళ్దామని ఆదేశించాడు.

వదిలి వెళుతున్న ప్రదేశంవైపు చూశాడు వీర. "ఎంత దుఃఖం, మరణం, బానిసత్వం, దోపిడి, ఎంత వేదన ఈ భూమి కింద. చెంచుల ఆత్మలు నశించింది ఈ భూమికిందే. ఆత్మలతోపాటు శరీరాలు కూడా శుష్కించి, మనుషులు మరణంగా మారిపోయి భూమి పొరల్లోకి అదృశ్యమైంది ఇక్కడే" అని అనుకున్నాడు. "కలలు లేని ఖాళీ మనుషులు వీళ్లు. కలలు కనలేని జాతికి భవిష్యత్తు ఎలా ఉంటుంది? మళ్లీ కలలు మొలకెత్తాలి వీళ్ల జీవితంలో. మళ్లీ వ్యవసాయం, వీళ్ల జీవనాధారం కావాలి" అనుకున్నాడు, బయలుదేరేముందు వీర.

కొత్త ప్రదేశం గురించి, వీర గుండెల్లో వేలవేల కలలు. ఆ రాత్రి వేకువజాము దాకా నడిచినాక ఎదురుకుంట పక్కన, విడిదికి ఆగారు చెంచులు. కొన్ని గంటలు విశ్రాంతి తీసుకొని మళ్లీ ప్రయాణిద్దామని.




సూర్యుడు రాకముందే పక్షుల అరుపులు వింటూనే నిద్రలేచాడు వీర. బద్ధకంగా కళ్లు తెరిచి మళ్లీ మూసుకున్నాడు. దడిలోంచి రెండు మేకలు తప్పించుకుని అటూ ఇటూ తిరుగుతున్నాయి. మిగిలిన మేకలు కూడా దడిని దాటుకొని, నాలుగు వైపులకు చెదిరిపోయాయి. చిన్న మేకపిల్ల ఒకటి, వీర చుట్టూ ఉన్న గడ్డిపరకలను మేస్తూ, మధ్యలో అతని కాలును నాకుతోంది. చక్కిలిగింత అనిపించింది వీరకు. కుక్కలు ఏమైనాయో ఆచూకీ లేదు. ఎక్కడో దూరం నుంచి, భౌభౌమంటున్నవాటి అరుపులు వినబడ్డాయి. అవి మామూలుగా కుక్కల అరుపుల్లా లేవు. భయంతో లేదా కొత్త వాళ్లను చూసినప్పుడో వేసే అరుపుల్లా ఉన్నాయి. కుక్కల అరుపుల తీవ్రత పెరిగింది. ఏదో అశుభం లాగా తోచింది వీరకు. పక్కన అందరూ గాఢనిద్రలో ఉన్నారు. ఎవరినీ నిద్రలేపకుండా కుక్కల అరుపులు వచ్చిన వైపు వెళ్లాడు. అడవి అంచున జీపు ఒకటి ఆగివుంది. జీపు హెడ్‌లైట్లు, అడవివైపు ఫోకస్ అయి ఉన్నాయి. ఆ వెలుగులో పది మంది మనుషులు ఇటువైపు నడుచుకుంటూ రావటం కనబడింది. అలల సుందరం, మరొక వ్యక్తి, బహుశా రెవెన్యూ అధికారి అయ్యుంటాడు. మిగిలినవాళ్లు యూనిఫారాల్లో ఉన్నారు. వాళ్లవైపుకు నడిచాడు వీర. దగ్గరకు వచ్చినాక, ఏ హెచ్చరికా లేకుండా, తుపాకీ మడంతో వీర డొక్కలో పొడి

## రెండూ తాగండి!

మద్యం, మాదకద్రవ్యాలు ఎక్కువగా తీసుకునే వాళ్లలో కాలేయం పెరుగుతుంది. దీనిని 'సిర్రోసిస్ ఆఫ్ లివర్' అంటారు. కొన్ని సమయాల్లో ఇది ప్రాణాంతక వ్యాధిలా కూడా మారుతుంది. అయితే ఆల్కహాల్ సేవించే వాళ్లలో కాఫీ, టీలు ప్రతిరోజు తాగే వాళ్ళకి సిర్రోసిస్ ఆఫ్ లివర్ కొంతవరకూ తగ్గే అవకాశం ఉందని కెయిజర్ మెడికల్ కేర్ శాస్త్రజ్ఞులు ఇటీవల జరిపిన పరిశోధనల్లో తేలింది.

కాఫీలో ఉండే కేఫీన్ కాలేయంపై ప్రభావం చూపటంవల్ల ఇది సాధ్యపడుతోంది. ఆల్కహాలు సేవిస్తూ కాఫీ, టీలు తాగే అలవాటున్నవారిని, కేవలం ఆల్కహాలు మాత్రమే సేవించేవారిని రెండు గ్రూపులుగా విభజించారు. వీళ్లలో సిర్రోసిస్ వ్యాధి సోకిన వాళ్ళూ ఉన్నారు. వ్యాధి బారిన పడిన కాఫీ ప్రియులు 22 శాతం మందిలో వ్యాధి తగ్గుముఖం పట్టినట్టు పరిశోధనల్లో తేలింది.

సో, అలవాటు మానుకోలేని మందుబాబులూ ఆల్కహాల్ ఒక్కటే తాగుతూ మత్తులో మునగకుండా కాఫీని కూడా సేవిస్తుండండి. మీ కోసం కాదు.. మీ కాలేయం కోసం.



చాడో పోలీసు. దబ్బుమని నేలపై పడ్డాడు వీర. వెంటనే పదో, ఇరవయ్యో దెబ్బలు పడ్డాయి అతని శరీరంపై.

"ఏమిరా, ఇంక గవర్నమెంటు ఏమీ లేదనుకున్నారా? అంతా మీ ఇష్టమేనా? మీ ఇష్టమైన చోటికి వెళ్ళిపోవడమేనా? ఎవరి పర్మిషన్ అవసరం లేదనుకున్నారా? " అలల సుందరం కోపంగా అరిచాడు.

దెబ్బల తాకిడికి లోపలెక్కడో, కనపడని ప్రదేశాల్లో నొప్పి మొదలైంది వీరకు. నిలబడలేని పరిస్థితి. అలల సుందరం, అతనితో వచ్చిన మనిషి, ఇద్దరూ చాలా సేపు మాట్లాడుకున్నారు. బహుశా చెంచులపైన కూడా దాడిచేసి భయకంపితుల్ని చేయటమా? లేదా వెనక్కు వెళ్ళిపోవడమా అని మాట్లాడుకుంటున్నారు.

"ఎటూ వచ్చాము కదా, పోలీసుల్ని తీసుకెళ్ళి బెదిరించి వద్దాం" అన్నాడు ఆ పక్కనున్న మనిషి. అలల సుందరం వద్దని వారిస్తున్నాడు.

వాళ్ళిద్దరు అక్కడ ఆగిపోయి, జీపులో ఉన్న మరో మనిషిని కేక వేశారు. అతను చెంచుల మనిషిలా ఉన్నాడు. చదువుకొని ఉద్యోగం చేస్తున్న మనిషి. రెవెన్యూ లేదా ట్రైబల్ వెల్ఫేరు మనిషి అయ్యుంటాడు. అతను ఒక్కడే ఎదురుకుంటవైపు వెళ్ళటం మొదలుపెట్టాడు. వీర లేచి ఓపిక తెచ్చుకొని కుంటవైపు నడిచాడు. పోలీసు ఒకడు వెనకనుంచి తుపాకీ మొనతో మరోసారి పొడిచాడు. అట్లాగే నేలపై కూలిపోయాడు.

ఎదురుకుంట దగ్గర పెద్ద కోలాహలం. పెద్దగా కేకలు, అరుపులు. చెట్ల సందుల్లోంచి పోలీసుల్ని, అలల సుందరాన్ని గమనించసాగారు వాళ్ళు. సుదీర్ఘమైన సంభాషణ, ఆ అరుపులు తరువాత ఆశ్రమ పాఠశాల టీచరయిన చెంచు ఉద్యోగి వెంట, పెదమంతయ్య ఒక్కడే

నడుచుకుంటూ వచ్చాడు. వీరని లేపి నడిపించుకువెళ్ళాడు. పెదమంతయ్య కళ్ళలో భయంకాదు గానీ, విరక్తిలాంటి భావన కదలాడింది. అతనేమయినా మాట్లాడతాడని, పెద్దగా అరుస్తాడని ఎదురు చూశాడు అలల సుందరం. ఊహు, ఏ స్పందనా చూపించకుండా కుంటవైపు వెళ్ళాడు, వీరని నడిపించుకొని.

పెదమంతయ్య, మగవాళ్ళనందరినీ పక్కకు పిలిచి మీటింగ్ ఏర్పాటు చేశాడు. ఎవరూ మాట్లాడలేదు. చాలామంది కళ్ళలో భయం స్పష్టంగా తెలుస్తోంది. పెదమంతయ్య ఒక్కడే మాట్లాడుతున్నాడు. డెబ్బైయేళ్ళ మనిషి. అనుభవం, జ్ఞానం, ఎంతో జీవితాన్ని చూశాడు. ఎప్పటివో తన అనుభవాల్ని చెబుతున్నాడు. ఉదయపు గాలి, మంచుతో తడిచి పెడేల్, పెడేల్ మని శరీరాన్ని హింసిస్తోంది. ఆడవాళ్ళు, పిల్లలు భయంతో చెట్ల నీడలో ముడుచుకొని కూర్చున్నారు. కుక్కలు అరవటం మానేసి, అసహనంగా అటూ, ఇటూ తిరుగుతున్నాయి. చెంచు యువకులు, పెద్దలు ఎవరూ నోరు తెరవటంలేదు. కానీ క్రమంగా వాళ్ళ ముఖాల్లోని భావాల్లో మార్పు వస్తోంది. భయంతో వణికిపోయిన క్షణాల తరువాత, క్రమంగా ముఖంలో ఒక నిర్ణయం తాలూకు స్థిరత్వం కనిపిస్తోంది. ఒక తెగింపులాంటి భావన కళ్ళలో మెరుస్తోంది. వీర కాస్త ఓపిక తెచ్చుకొని మాట్లాడాడు. వాళ్ళకు ధైర్యం చెప్పాడు. గిరిజనులకు చెందని అడవి, ఇంకెవరికి చెందుతుంది అన్నాడు. తాను వెళ్ళి కలెక్టరును కలుస్తానని పత్రిక సహకారం తీసుకుంటానని, అవసరమైతే, ఈ విషయంపై నిరాహారదీక్ష చేస్తానని వివరించాడు. కొంత అర్థమయ్యీ, కొంత అర్థంకాక అందరూ అతనివైపు నమ్మకంతో చూశారు. పెదమంతయ్యను వీరతో పంపాలని నిర్ణయించారు. మిగిలిన వాళ్ళు ముందుకు ప్రయాణించాలని నిర్ణయం చేశారు.

ప్రయాణపు సన్నాహాలు మళ్ళీ మొదలైనాయి. మూటల్ని నెత్తికెత్తుకొని, పిల్లల్ని నడిపించుకొని, ముందు ఇద్దరు కుర్రవాళ్ళు దారిని చదును చేస్తుంటే మెల్లగా అడుగులు వెయ్యటం మొదలుపెట్టారు. వీర, పెదమంతయ్య మిగిలిపోయారు. ప్రమాదమేదో ముంచుకొస్తుందనే భయం ఏదో క్షణంపాటు వీరని చుట్టుముట్టింది. శరీరంపైన దెబ్బలతోపాటు కానరాని భయం కూడా కలిసి వీరాని కుంగదీశాయి. జ్ఞాపకాలో, రూపంలేని భయాలో మర్చిపోయిన దుఃఖపు సంగతులో, భయపెట్టే రూపాలో అతన్ని చుట్టుముట్టాయి. అతని మనసులోని దిగులు తెలిసినట్లుగా పెదమంతయ్య వీరను దగ్గరకు తీసుకున్నాడు. శరీరాన్ని ప్రేమగా నిమిరాడు. పసరు తెచ్చి, దెబ్బలు తగిలినచోట పిండాడు. ఒడిలో పడుకోబెట్టుకొని ఎప్పుడెప్పటివో సంగతులన్నీ చెబుతున్నాడు. వీరకు అర్థమైంది. మంతయ్య చేస్తున్నది ఆత్మకు చికిత్స చేసే కార్యక్రమమని. సైకాలజిస్టులు చేయాల్సిన పని, ఈ ముసలి చెంచు నాయకుడు చేస్తున్నాడు. ఆ క్షణంలో పెదమంతయ్య గొప్ప దార్శనికుడిలా కనబడ్డాడు వీరకు. లేచి, చటుక్కున ఆయన పాదాల్ని కళ్ళకద్దుకున్నాడు.





ఒంగోలు వెళ్ళి, కలెక్టరును కలిసివచ్చిన తరువాత జ్యోతి, ఈనాడు దినపత్రికల రిపోర్టర్‌లను కలిసినాక, వీరలో మళ్లీ కాస్త ఉత్సాహం వచ్చింది. అయితే మంతయ్యకు కలెక్టరు మాటల్లోని మతలబు అర్థమయింది. ఎంతో అభిమానంతో మాట్లాడుతూనే అడవులపై చెంచులకు పూర్తి హక్కులున్నాయంటూనే, ఆర్.డి.వో.తోటి, డి.ఎఫ్.వో. తోటి ఒక కమిటీని వేస్తాననటంలోని మెలిక పెదమంతయ్యకు అర్థమైంది. చెంచుల కొత్త నివాసాలపై భయాలు ఆయనలో ముసురుకొన్నాయి. అన్నిటికన్నా అంతకుముందు రాత్రి చావు కలలో రావటం పెదమంతయ్యను భయపెట్టింది. పదిసార్లు వీర శవం అడవుల మధ్య పడి ఉండటం పెదమంతయ్యలో ఉలికిపాటును కలిగించింది. కలల్లోంచి ఆత్మకు అవసరమైన శక్తిని ప్రోదు చేసుకొనే జాతి చెంచుజాతి. ప్రతి కలా ఒక నిర్ణయం అనే నమ్మకమున్న జాతి. పెద మంతయ్య తన కలవరపాటును బయట పెట్టలేదు. వీర రిపోర్టర్ల దగ్గర సమస్తాన్ని బహిర్గతం చేస్తున్నాడు. మోహినితో మొదలుపెట్టి, అలల సుందరం దాకా, కథలన్నీ బయటపెట్టాడు.

పెదమంతయ్య నిర్లిప్తంగా చూస్తున్నాడు. కల, గురించి దిగులు పడుతున్నాడు.

జర్నలిస్టులతో మాట్లాడుతున్నప్పుడు మోహిని పంపించిందంటూ ఒక మనిషి కవరు అందించాడు వీరకు.

వణుకుతున్న చేతులతో రాసిన ఉత్తరంలా ఉంది. మూడురోజుల క్రితమే రాసిన ఉత్తరం అది. 10/11 తారీకు ఉంది. బయటకు వచ్చినాక ఆ ఉత్తరం చదవటం మొదలుపెట్టాడు వీర.

"మార్కాపురం నుంచి నువ్వు పంపిన కవరు అందింది. కనీసం చిన్న పలకరింపు మాట కూడా లేదే. మోహిని, నీ మోహిని, అన్న విషయం అప్పుడే మర్చిపోయావా? హాస్పిటల్‌లో ఒక్కదాన్నే... నొప్పులలాగ వచ్చి, డాక్టరు పరీక్షలు చేస్తుండగా ఎగ్జామినేషన్ టేబుల్‌పై ఒక్కదాన్నే... నువ్వు గుర్తొచ్చావు. నీటి పొరలతో నిండి, నిత్యం నావైపు ప్రేమగా చూసే నీ కళ్ళు గుర్తుకొచ్చాయి. హాస్పిటల్‌లో ఉండగానే నీ కవరు వచ్చింది. 'నా దేవత'అంటూ నువ్వు నన్ను పిలవటం గుర్తులేదా? నువ్వట్లా పిలుస్తున్నప్పుడు కిటికీలోంచి మనల్నే చూస్తున్న, చామంతులు కిసుక్కున నవ్వటం గుర్తుందా?

నీపై పోలీసుల దాడి తెలిసింది. దుఃఖంతో మెలితిరిగిపోయాను.

ఈ ఉత్తరం నీకు అందుతుందో లేదో తెలియదు. నువ్వొక సంచారజీవివైనావు. (చెంచు జాతి మొదట్లో నొమాడిక్ జాతిగానే ఉండేదట) బహుశా ఈ ఉత్తరం అందేనాటికి నువ్వు కలెక్టరును కలిసే ఉంటావు. యూనివర్సిటీ నాలుగు గోడలు మినహాయించి వేరే ప్రపంచం తెలియని నా వీర... ఈ కలెక్టర్లు, అధికార నియంత్రణ ఎంత డొల్లలో నీకెట్లా చెప్పను. ఇక్కడ నుండి ఒక టెలిఫోన్ కాల్‌తోటి, ఈ కలెక్టరు నిర్ణయాన్ని నేను నియంత్రించగలను. ఐరన్ ఫ్రేమ్ అనబడే ఈ అధికారగణం, బఫూన్లకన్న ఎక్కువ, విలన్లకన్న తక్కువ. వీళ్ళపై ఆశలు పెట్టుకోకు.

నా వీరా! నిన్ను నిరుత్సాహపరచడానికి కాదు ఈ ఉత్తరం.

నిన్ను తలచుకొన్నప్పుడు, అడవిపూల మీంచి వీచే మధురమైన వాసనలు గుర్తుకొస్తాయి. ఆ పూలలో ఉండే ఘాటుతనం, లాలిత్యం రెండూ నీలో ఉన్నాయి. కానీ అడవి పూల గుండెలపై ఖాకీ బూట్ల పాదాలు పడుతున్న రోజులివి. పంట చేలల్లో ధాన్యానికి నెత్తురంటుతున్న రోజులివి. తల పైకెత్తి చూడు, ఆకాశపు ముఖం ఎర్రనయి, భయం గొలిపేలా లేదూ...

నా వీరా! కాలమే అట్లా ఉంది. కలల ఇల్లు మన కందనంత దూరంలో ఉంది. వాళ్ళకిష్టమైన చోటులోనే చెంచులు నివసించాలని నాకూ కోరికగా ఉంది. నన్ను నమ్ము. మన బిడ్డ లేత పాదాలు, ఆ ప్రదేశం నిండా ముద్రలై నిలవాలని, ఒక గుడిసెలో మన ముగ్గురం మాత్రమే కూర్చుని, ఎన్నో కబుర్లు చెప్పుకోవాలని, ఎదురుగా ఉన్న అడవిపూలు, మత్తుగా, మన వైపుకు వాటి పరిమళాల్ని వెదజల్లాలని,

నిజంగా ఈ కల ఎంతో బాగుంది.

కానీ కలల కాలం వెళ్ళిపోయింది నా వీర. ఎట్లాంటి కాలం యిది. క్రేజీ టైమ్స్, మనీ టైమ్స్, నేనేదో సందేశాన్ని ఇస్తున్నాననుకోకు. నువ్వే పరికించి చూడు- నడుస్తున్న చరిత్రను.

ఈ పోస్టుకార్డు నీపై ఎంతో ప్రేమ చిప్పిల్లుతున్న క్షణాల్లో రాస్తున్నాను. మన బిడ్డ కోసం, ఒక గ్రీటింగ్ కార్డు కొని ఉంచుకోవా? ఏ క్షణమైనా వాడు బయటకు వస్తానంటున్నాడు.

అమ్మ గురించి కబుర్లు చెప్తావని ఎంత ఆశ పడ్డాను. ఈ ఉద్యమాలు, ఉద్యోగాలు... వీటన్నిటికి ముందు నేను స్త్రీని, అమ్మను. నువ్వు కూడా శిశువులాగా నన్ను పూర్తి ఆక్రమించుకొని, నా ప్రపంచమంతా నీవే అయిన క్షణాల్లో నేనో అమ్మునైపోతాను. శరీరమంతా ఒక పులకింత అవుతుంది. నువ్వు నా ప్రియుడివీ, శిశువువీ కూడా.

నిన్న యూనివర్సిటీకి వెళ్ళాను. నువ్వు నివసించిన హాస్టల్‌కు వెళ్లాను. వీర, ఎంత ఒంటరిగా బతికావు.

జైలులాంటి ఆ గదిలో అన్నేళ్ళు నీ ఒంటరి, ఏకాంత జీవితాన్ని, దాని దుఃఖాన్ని మొత్తం నేను తీసేసుకొని, కేవలం స్వప్నం, సుఖం, ప్రేమ మాత్రమే నీకివ్వాలని కోరిక కలిగింది.

ఈ ఉత్తరాన్ని భద్రంగా పెట్టుకో!

బహుశా ఒక అపురూపమైన ప్రేమలేఖగా ఇది మిగిలిపోతుంది. (ఇంత ఆర్ద్రంగా, ప్రేమగా, నేనే మళ్ళీ నీకు రాయలేను)

శిశువుకు జన్మ నివ్వబోతున్న తల్లిని.

హృదయమంతా ప్రేమ పొర్లి పొర్లి పోతున్న స్త్రీని.

నీ స్త్రీని, నీ భార్యను, నీ తల్లిని. కారణాలు చెప్పకుండా నిన్ను శాసించకూడదా? ఆజ్ఞాపించకూడదా? చిత్ర నిద్రలో ఉన్న శిశువు లాంటివాడివి. ఈ ప్రపంచపు కరుకుదనం తెలియని వాడివి. డబ్బు కోసం, పదవుల కోసం, మొత్తం జాతుల్ని ధ్వంసం చేస్తున్న నాయకుల కాలం ఇది.

నా వీర, ఈ పద్మవ్యూహంలోకి నువ్వు ప్రవేశించకు. వెనక్కురా, సమస్తాన్ని వదిలి వెనక్కురా. ఇవాళ్టికీ తలుపు తెరిచే ఉంది. రేపటికి రహదారి నీకు తెరిచి ఉంటుందో లేదో నేను చెప్పలేను. నా వీరా, నీ కోసం, ఇంటి బయట తలుపుతీసి, ఎదురుచూస్తుంటాను. వెనక్కురా. ఏ కరకు కత్తో, నీ శరీరాన్ని చీల్చివేయక ముందే (అశుభాలు అనటం నాకిష్టంలేదు) వెనక్కురా. ఎన్జీవో రాజకీయాల గురించి నీకెట్లా చెప్పాలి. వీరా ప్రభుత్వాన్నే శాశిస్తున్న సంస్థలివి. నీ కలెక్ట రెంత? ఇంకొకడు ఇంకొకడు ఎంత?

వీరా నిన్న రాత్రి ఇంటి ముందటి చామంతి పూలు ఎరుపురంగులో కనబడ్డాయి. ఎంత అపశకునం. మన ప్రేమ, మన దాంపత్యం, మన పిల్లవాడు, మన

ఇల్లు వీరా, ఈ జీవితం నీకొద్దా? నీముఖం పైని, అమాయకపు చిరునవ్వు వెలుగులు, మన ఇంటినిండా మిలమిలలాడవద్దా?

నా వీరా, ఈ ఉత్తరం నా హృదయం. ఇది నీకు మార్గం చూపుతుంది. హృదయాన్ని నమ్ము. ఆవేశాల్ని కాదు.

నీ మోహిని."



అలల సుందరంకు తన తెలివి తేటలపై ఎంతో నమ్మకం ఉంది. అన్ని పార్టీలను తన అదుపులోకి తెచ్చుకొన్న తీరు, రోజు రోజుకూ గొప్ప నాయకుడిగా ఎదుగుతున్న తీరు అలల సుందరంలో అహాన్ని పెంచాయి. చుట్టుపక్కల నాయకులంతా మరుగుజ్జులుగా కనపడటం మొదలుపెట్టారు. తనను విభేదించే వాళ్ళపై తీవ్రమైన అసహనం, కోపం కలగటం మొదలుపెట్టాయి. నాయకుడిలో ఫాసిస్టు లక్షణాలు తలెత్తితే కలిగే లక్షణాలవి.

కలెక్టరు ఆర్డీఓను, డిఎఫ్ఓను చెంచుల పునరావాసం విషయంలో మార్కాపురం పంపటాన్ని తీవ్రంగా పరిగణించాడు అలల సుందరం. 'వాళ్ళెవరు నిర్ణయాలు తీసుకోడానికి' అని తన ఆఫీసులో పెద్దగా అరిచాడు.

"నేను చెబుతున్నాను. ఈ ప్రాంతపు ప్రజల ప్రతినిధిని, దళితుల, గిరిజనుల సంక్షేమం నాకన్నా ఎవరికి బాగా తెలుస్తుంది. ఆ గూడెం జనం అందరికీ పురుళ్లు పోసింది నా తల్లి. వాళ్ళను ఎన్నోసార్లు మలేరియా, టిబి చావు నుంచి రక్షించింది. వాళ్ళెంత నమ్మకద్రోహులు. నా మాటను పట్టించుకోలేదు. ఎవడో బొడ్డూడని వెధవ యూనివర్సిటీ నుంచి కొత్తగా వచ్చి, చెంచుల సంక్షేమమంటే ఎట్లా? ఇదేం కుదరదు. ప్రభుత్వాలు చెయ్యాల్సిన పని. దయతో ఎన్జీవోలు చేస్తున్నాయి. వాళ్ళకు చెయ్యెత్తి దండం పెట్టాలి. ఈ స్థలాల్లోకి వచ్చినాక అవసరమైతే వాళ్ళకు లోన్లు ఇప్పిస్తాను. వాళ్ళ బతుకును స్వర్గంలాగా చేస్తాను."

కమిటీ ముందు ఆవేశపడ్డాడు అలల సుందరం. కమిటీ అతని మాటలకు ప్రాముఖ్యం ఇవ్వలేదు. చెంచు పెద్దలకు కబురు చేశారు. పెదమంతయ్యతో మాట్లాడారు. వీరను పిలిపించారు.

"నేను మళ్ళీ చెబుతున్నాను. నేను ఒప్పుకోకుండా మీరేమీ నిర్ణయాలు తీసుకోలేరు. ఒట్టి మండల్ చైర్‌పర్సన్నే అనుకుంటున్నారేమో. ఎమ్మెల్యే కావాల్సిన కెపాసిటీ ఉన్న వాణ్ణి. అటు రూలింగ్ పార్టీ, ఇటు వామపక్షాల సపోర్టు ఉన్నవాణ్ణి. మా మామ గురించి మీరు వినే ఉంటారు. వై.ఎస్.తో నేరుగా ఫోన్‌లో మాట్లాడగలడు. ముంపు గ్రామాల ఉద్యమాలే, నా అరుపులకు గజగజ వణికాయి. నేను చెప్పిన చోట, నేను ఇప్పించినంత నష్టపరిహారానికి ఒప్పుకున్నారు. ఈ చెంచులు నా మాట కాదని ఈ డివిజన్‌లో ఎట్లా బతుకుతారు?

అలల సుందరం నిజంగానే తానో శక్తిమంతుణ్ణి అనే భ్రమలో ఉన్నాడు. కమిటీ వచ్చిన రోజే ప్రముఖ దినపత్రికల్లో చింతల ముడిపి చెంచు గూడాల పునరావాసంపై మొదటి పేజీ వార్త వచ్చింది.

రాష్ట్రమంతా ఈ విషయంపై చర్చ మొదలైంది. అన్ని పార్టీల వాళ్ళు, చెంచుల కోరిక సమంజసమైనదే అని సంఘీభావం చెప్పారు.

కమిటీ వస్తున్న రోజే వీర, మంతయ్యలు ఆర్డీఓ ఆఫీసు ముందు నిరాహారదీక్ష మొద

లుపెట్టారు.

"ఈ నిరాహారదీక్షలదేముంది? ఇదో ఫ్యాషన్ అయ్యింది జనానికి. చూస్తాను, వీళ్ళు ఎనాళ్ళు చేస్తారో? "

అలల సుందరం అంతటితో ఆగలేదు. అడవిదాటి బయటకొచ్చిన కొద్దిమంది చెంచులతో, కలెక్టరుకు అర్జీ రాయించాడు. చింతల ముడిపి చెంచులకు మార్కాపురం దగ్గర నివాస స్థలమే అనువైనదని, అడవులలో వనరులు లేవని, అన్నల బెడద ఉందని, అడవి బయటకు వస్తేనే వాళ్ళు బతుకుతారని, లేదంటే చెంచు జాతే అంతమైపోతుందని ఆ అర్జీ సారాంశం. వంద మందికి పైగా సంతకాలు పెట్టారు.

పేపర్లను కట్టేసుకొని మార్కాపురం పునరావాసానికి అనుకూలంగా వార్తలు రాయించాడు, అదీ మొదటిపేజీలో.

ఈ మొత్తం విషయాన్ని తన గౌరవానికి సంబంధించిన విషయంగా తీసుకున్నాడు అలల సుందరం.

అలల సుందరానికి ఈ విషయంలో ఇంట్లోనే ప్రతిఘటన వచ్చింది. అతని భార్య అరుణ, చెంచుల కోరిక సమంజసమైనదని వాదించటం మొదలుపెట్టింది. నిరాహార దీక్షా శిబిరానికి వెళ్ళి ఒక గంట కూర్చుని వీరాని పలకరించి వచ్చింది.

అధికారపు రుచి మరిగిన అలల సుందరంలో నిరంకుశుడైన నాయకుని లక్షణాలు మొలుచుకొచ్చాయి. తనపైన వల్లమాలిన ఇష్టం, తన నిర్ణయాలపై అపారమైన విశ్వాసం, ప్రతిఘటనను తట్టుకోలేనితనం, అలల సుందరాన్ని మినీ డిక్టేటర్‌గా మార్చాయి. తన సర్వశక్తుల్ని చెంచులకు వ్యతిరేకంగా వినియోగించాలని నిర్ణయించుకొన్నాడు. వీర, పెదమంతయ్యలను బలవంతాన హాస్పటల్‌లో చేర్పించి, సెలైన్ ఇప్పించి, నిరాహారదీక్షా శిబిరాన్ని కూల్చివేయించి, జిల్లా ఇన్‌ఛార్జి మంత్రితో, చెంచుల పునరావాసం మార్కాపురంలోనే అనే ప్రకటన ఇప్పించి, లోకల్ సమస్యను రాష్ట్ర సమస్యగా చేశాడు. తన నిర్ణయం, ప్రభుత్వం లేదా పార్టీ నిర్ణయం అనిపించేయగలిగాడు.

II



నాలుగోరోజు ఉదయానికి అనుకొన్న ప్రదేశానికి చేరారు చెంచులు. పాలిపోయిన ముఖాలు. ఒక విధమైన నీరసం, నిస్సత్తువ, వాళ్ళను ఆవహించాయి. కొత్త ప్రదేశాన్ని సాధించుకున్నామన్న ఆనందం వాళ్ళలో లేదు. నాలుగోరోజు ఉదయం ఆ ప్రదేశానికి చేరిన వీర హతాశుడైనాడు. కొత్త గుడిసెలు నిర్మించుకోబోతున్న ఉత్సాహం ఎవరిలో లేదు. ప్రపంచంలో అత్యంత భీకరమైన దారిద్ర్యాన్ని అనుభవిస్తున్న చెంచుజాతి, జీవితపు లక్ష్యాన్ని తెలుసుకోవటం కూడా మర్చిపోయింది. తమకు ఏది అవసరమో, అది కూడా మర్చిపోయింది. యాంత్రికంగా జీవిస్తున్న జాతి ఇది. ఎంతో కొంత ఆహారం తీసుకుంటున్నారు గనుక, ఆ శక్తితో జీవించాలి గనుక, జీవిస్తున్నారు.

చెంచుల ఆత్మ చచ్చిపోయింది. సహజంగానే బిడియస్తులు కనుక అలల సుందరం బెదిరింపులకు తీవ్రంగా కలత చెందారు. పాతికేళ్ళుగా ఛిద్రం చెయ్యబడ్డ ఆత్మల్ని, మళ్ళీ ఎలా పునరుజ్జీవింప జెయ్యాలి? అయ్యో, తను చదివిన చదువులో ఎక్కడా ఈ అంశం లేదే అని దిగులుపడ్డాడు వీర.

నలుగురైదుగురు పిల్లల్ని వెంట తీసుకొని, తట్టలతో ఎర్రమట్టి తెచ్చిపోయటం మొదలు

పెట్టాడు వీర. పోతమ్మ, మిగిలిన ఆడపిల్లలు నీళ్ళు తెచ్చారు. మెల్లిగా ఉత్సాహం రగులుకుంది మిగిలినవాళ్ళలో. వెదురు బద్దల్ని నరికే కార్యక్రమాన్ని కొంతమంది కుర్రాళ్ళు మొదలుపెట్టారు. గుండ్రంగా వెదురు బొంగులు నాటి, వాటి చుట్టూ, అల్లిక లాగి, మధ్యలో పొడవైన నిట్రాడు నిలిపి, అందరికన్నా ముందర గురయ్య గుడిసె సిద్ధం చేశారు. గుడిసె అందాన్ని చూసి అందరూ మురిసిపోయ్యారు. పోతమ్మ గుడిసెను ఎర్రమట్టితో అలికింది. ఆ గుడిసె పూర్తవటం తోటే ఊపందుకుంది. ఎవరి గుడిసె వాళ్ళు నిర్మించుకోవటం మొదలుపెట్టారు. కాసేపు అలల సుందరం విషయం మర్చిపోయ్యారు. ఆరోజు, మరుసటి రోజు రాత్రి వరకూ ఆ కార్యక్రమం సాగింది. అందరికీ ఆహారం, సారాయి సమకూర్చాడు వీర. గొట్టిపడియ నుంచి సరుకు తెచ్చాడు. ఇద్దరు కుర్రవాళ్ళు సారాయి కాసే కార్యక్రమంలో పడ్డారు. మూడోరోజు రాత్రి పెద్ద కోలాహలం. ఆ రాత్రికి, అన్ని గుడిసెలు సిద్ధమయినాయి. అందరూ గొప్ప ఆనందంలో ఉన్నారు. ఎవరో ముసలామె పాట అందుకుంది. ఆ పాట తరువాత కుర్రవాడొకడు డప్పు వాయించటం మొదలుపెట్టాడు. ఆత్మలు ఛిద్రమయినాయని దిగులుపడ్డ వీరకు ధగధగ మంటూ దీపకాంతిలో మిలమిల లాడుతున్న చెంచు ఆత్మ ప్రత్యక్షమైంది.

ఉత్సాహగానం అట్లా సాగుతుండగానే రాత్రి రెండోజామువేళ, ఎవరికీ చెప్పకుండా వీర, పెదమంతయ్యలు అక్కడి నుండి వచ్చేశారు. పైన చంద్రుడు తెల్లటి దీపంలా మిలమిల లాడుతున్నాడు. చాలా దూరందాకా చెంచుల పాటలు వినిపిస్తూనే ఉన్నాయి. అడవి అంతటికీ ఉత్సాహాన్నిచ్చే పాటలు అవి. ఈ ఆనందాన్ని పెదమంతయ్య అనుభవించలేకపోయాడు. ఆయన కలల నిండా చావులే. మరణం ముందుగా తెలిసినవాడిలా కుమిలి పోతున్నాడు. చెట్లు దుఃఖిస్తున్నట్లు, అడవులు రోదిస్తున్నట్లు, అనిపించసాగింది మంతయ్యకు. అయితే వీర గుండెల్లో చాలా యేళ్ళ తరువాత ఆనందగానం చిప్పిల్లుతోంది. ఆ రాత్రి, అతను చూసిన అద్భుతం అతణ్ణి వివశుణ్ణి చేస్తోంది. చెంచుల ఆత్మగానం విన్నాడు. బహుశా, ఈ కొత్త నివాస స్థలంలో మహిమ ఉందేమో అనుకున్నాడు. ఆత్మల్ని వెలిగించే శక్తులున్న భూమిగా దాన్ని గుర్తించాడు. ఈ ఉద్యమం ఫలితమా అని, కాస్త పొలం దొరికితే చెంచుల కొత్త జీవితానికి ఇక తిరుగులేనట్లే అనుకున్నాడు.



**చాలా యేళ్ళ తరువాత ఆనందగానం చిప్పిల్లుతోంది. ఆ రాత్రి, అతను చూసిన అద్భుతం అతణ్ణి వివశుణ్ణి చేస్తోంది చెంచుల ఆత్మగానం విన్నాడు**

అలల సుందరం తన ఇంటిలో ఒక దుస్వప్నాన్ని రచిస్తున్నాడు. పెనుగాలులు దాడిచేసి, తమ కొత్త గుడిసెలన్నీ కూలిపోయి, నిస్సహాయంగా పరిగెత్తే చెంచుల గురించి కలగంటున్నాడు. ఆ ఊహాతోటి అలల సుందరంలో వింత ఆనందం. మరణిస్తున్న చెంచుగూడాల్ని చూడాలనే శాడిస్టు కల. వాళ్ళు కోరుకున్న అడవులే వాళ్ళకు సమాధి కావాలనే కల. ఆ కల, అతనిలో అంత ఆనందాన్నివ్వటం అతనికే ఆశ్చర్యంగా ఉంది. ఆనందంతో అతని శరీరం ఊగుతోంది. కొద్దిపాటి నాట్యంలా శరీరం ఊగుతోంది. అవసరమైన పథకాలు, డబ్బు పంపిణీ, అయిపోయినాక అతని ఆనందం మిన్నులు దాటింది.




వీర శరీరం కత్తులతో చీల్చబడింది. దాడి చేసిన శత్రువులు వీర శరీరంపై అక్కడక్కడా చర్మాన్ని వలిచేశారు. శరీరమంతా ఎర్రటి మాంసంలా ఉంది. డాక్టర్లు కూడా భయపడే దృశ్యం. వీర సహచరి మోహిని వచ్చింది గానీ, ఆ దృశ్యాన్ని చూడలేనంటూ వెళ్ళిపోయింది. వీర పచ్చి మాంసంలా ఉన్నాడు. నిజానికి ఆ స్థితిలో ఇంకొకరైతే ఈ పాటికి, చచ్చిపోయి ఉండేవాళ్ళు. కానీ వీరాలో జీవించాలనే కాంక్ష ఉంది. అందుకే ఇంకా సజీవుడిగా ఉన్నాడు. అతని ఆత్మ ఇంకా కలలు కంటోంది. అందుకే అతను చచ్చిపోలేదు.

చర్మం వలిచి వెయ్యబడ్డ పాదాలతోటి హాస్పటల్‌లో అటూ ఇటూ నడుస్తుంటే, అతను నడిచినంత మేరా రక్తపు గుర్తులు.

"నువ్వు బయటకు రాకూడదు" అంటాడు డాక్టరు.

"లేదు, నేను ప్రపంచాన్ని చూడాలి. మనుషుల్ని చూడాలి. బతకడానికి అవసరమైన కలల్ని నాలో నింపాలి" అనేవాడు వీర.

హాస్పటల్‌లో అతని బెడ్ పక్కనే ముసలి చెంచు నాయకుడు పెదమంతయ్య కూర్చుని ఉంటాడు. ప్రవక్తలాగా కాలాన్ని తెలిసినవాడు. రేపటిని కల కనగలిగిన వాడు. మంతయ్య శిక్ష అనుభవిస్తున్న ఖైదీలాగా హాస్పటల్‌లోనే ఉన్నాడు. వీర శరీరాన్ని శ్రద్ధగా తుడుస్తాడు. గడ్డ కట్టిన రక్తపు జాడల్ని తడిగుడ్డతో పీల్చివేస్తాడు. అడవులన్నీ తిరిగి సేకరించిన పసరు వీర శరీరానికి పూస్తాడు. "నాకింకేమీ కోరిక లేదు, నువ్వు జీవించగలిగితే చాలు" అంటాడు.

వీర పెదమంతయ్య ముఖంలోకి చూస్తాడు. 'ఎంత అద్భుతమైన సౌందర్య మూర్తి ఇతను' అనుకుంటాడు. కరుణలో, మనిషిని ప్రేమించటంలో ఇంత సౌందర్యం ఉందా అనుకుంటాడు.

శత్రువులు వీరానే ఎన్నుకోలేదు. నిరాహారదీక్షా శిబిరంలో రాత్రివేళ నిద్రిస్తున్న వ్యక్తిపై దాడి జరిగింది. అదీ వేకువజాము నాలుగు గంటల వేళ. దాడి చెయ్యబడ్డ వ్యక్తిని చూసి మిగిలిన వాళ్ళు భయపడాలని శత్రువుల లక్ష్యం. వాళ్ళ గురి వీర కాదు. ఎవరో ఒక చెంచు మనిషి. రెండు చేతులు, వెనకకు కట్టివేసి, శరీరాన్ని రోడ్డుపై రెండు కిలోమీటర్ల పొడవునా బరబరా ఈడ్చుకెళ్ళారు.

అలల సందరం ఆ దృశ్యాన్ని చూస్తూనే ఉన్నాడు. చేతులకు కట్టివేసిన తాడును లాగివేశాడు.

వాళ్ళు ఎంచుకున్న మనిషి వీర అయినందుకు దిగులుపడ్డాడు. రోడ్డుపై పడి ఉన్న వీరాని పైకి లేపాడు. ముఖంపై టార్చిలైటు వేసి దీక్షగా పరికించాడు. నుదుటిని పట్టుకొని చూశాడు. కనుబొమ్మల్ని ముక్కుని, పెదాల్ని తడిమి చూశాడు. "ఎంత అందమైన ముఖం నీది' ' అంటూ వీరాని మెచ్చుకున్నాడు. "ఎంత ప్రశాంతమైంది నీ ముఖం" అని కూడా మెచ్చుకున్నాడు. "ఆవేశంతో వాదించేటప్పుడు కూడా నీ ముఖం లో నవ్వు చెరిగి పోదు. ఎప్పుడైనా గుర్తించావా? " అంటూ వీరాని అడిగేడు.

"నీ కళ్ళంటే నాకెంతో అసూయ. వాటి నిండా వందలాది కలలు. అన్ని కలల్ని ఎట్లా నింపుకోగలిగావు" అంటూ అతని కళ్ళను మెచ్చుకొన్నాడు.

"తెల్లవారుతోంది. వెలుతురు వచ్చే లోపల పని కానివ్వండ"ని అనుచరులకు చెప్పి, "వీడు నా తమ్ముడు. అచ్చంగా నా తమ్ముడే. మా అమ్మే వీడికి కాన్పు చేసింది" అంటూ కంటతడిని తుడుచు కుంటూ వెళ్ళిపోయాడు అలల సుందరం.

ముఖాన్ని, మర్మావయవాల్ని వదిలేసి, మిగిలిన్న అన్నిచోట్లా గాట్లు పెట్టారు. గాట్ల దగ్గరి చర్మాన్ని వలిచివేశారు.

ఉదయం నిరాహారదీక్షా శిబిరంలో, ఎర్ర ముద్దలా ప్రత్యక్షమయ్యాడు వీర. హాస్పిట ల్‌కు పరిగెత్తారు. వైద్యం చెయ్యలేము, హైదరాబాదు తీసుకెళ్ళండి అన్నారు. అయి తే వాళ్ళలో ఒక దయామయుడు వెంటనే చికిత్స మొదలు పెట్టాడు. వారం దాటినా శరీరం మాన్పుడుకు రాలేదు. మంతయ్య ఎన్ని పసర్లు పూసినా లాభం లేదు.

ఎప్పటిలాగే పేపర్లలో పతాక శీర్షికలో వార్త వచ్చింది. "రక్తమోడ్చుతున్న చెంచు జాతి" అంటూ హెడ్‌లైను. పేపర్లన్నీ రోదిం చాయి. ఆక్రోశపడ్డాయి. సభ్యసమాజం తన కోపాన్ని, నిరసనని తెలియజేసింది.

ముంపు గ్రామాల పునరావాస కార్యక్రమా లన్నిటినీ సూచించే కమిటీకి ఛైర్మన్‌గా అలల సుందరాన్ని నియమించారు. చెంచు లకు ప్రత్యేక ప్యాకేజీ ఇవ్వాలని, అది కూడా ఈ కమిటీయే నిర్ణయించాలని ప్రభుత్వం ఆదేశించింది.

హాస్పటల్‌కు వచ్చి, పళ్ళబుట్ట ఇచ్చి, "వీర! నేను నీ అభిమానిని. నీ ఆదర్శాలు నాకు శిరోధార్యాలు" అన్నాడు, ఎంతో నిజాయితీ ఉట్టిపడే స్వరంతో అలల సుందరం.

మంతయ్య తన చర్మంలోంచి కొంత భాగాన్ని వీరకు దానం చేశాడు. వీరకు గ్రాఫ్టింగ్ చేశారు. మాంసపు ముద్దలాంటి వీర శరీరంపై మంతయ్య చర్మాన్ని కప్పారు. కానీ అతని శరీరంలోని చాలా భాగం ఇంకా ఎర్రటి మాంసంలాగే ఉంది. వీర ఇప్పుడు నడుస్తున్న గాయం.

హాస్పటల్‌లో ఉండగానే, గాయం ఇంకా మాన్పుడు పట్టకముందే, కొత్తగా కట్టు కొన్న చెంచుగూడెంపై దాడి వార్తలు అందాయి వీరకు.

## రెండవ భాగం

# నల్లమిరియం గింజలు

అటువైపు నుంచి ఇప్పుడే సమాధానం రాదు. నల్లటి చీక టిలో అన్నీ సన్నటి మరకల్లా, చీకటితో పాటు మంచు కూడా కురిసి, ఆ ప్రదేశ మంతా సజీవ సమాధి కాబడినట్లుగా ఉంది.

అన్నీ మాయమై పోయాయి.



అడవుల్లోంచి చెంచులు అదృశ్యమైనారు. అచ్చం కథల్లో లాగా. అందమైన గుడిసెలు, గుండ్రంగా, మరణం చొరబడకుండా చుట్టూ దడికట్టిన గుడిసెలు ధ్వంసమయినాయి. అడవి వాసన తప్ప ఏమీ తెలియని వాళ్ళను తుపాకీ మొనలతో వెంటాడి, అడవి అంచున అంత మందినీ శవాల మాదిరి నిలబెట్టి, అడవుల్లోకి వాళ్ళ ప్రవేశాన్ని నిషేధించి, చెంచులు అదృశ్యమయ్యారంటూ కన్నీటి వార్తలు, సంపాదకీయాలు, దొంగ ఏడుపులు, ఎంక్వయిరీ కమీషన్లు.

చెంచులు క్షేమమేనని అలల సుందరం ప్రకటన ఇచ్చాడు. అడవుల్లో అన్నలతో యుద్ధం మొదలైందని, చెంచుల క్షేమం కోసం, వాళ్ళను బయటకు పంపివేశామని, అడవుల బయట కాలనీ కట్టడానికి ఎన్జీవో సంస్థలు ముందుకొచ్చాయని, పక్కా ఇళ్ళు, సిమెంటు రోడ్డు, ఎలక్ట్రిసిటీ ఏర్పాటు చేస్తామని ప్రకటించాడు.

రెవిన్యూ జీపుల మోతలు వినిపిస్తున్నాయి. ప్రభుత్వం వాళ్ళను కాపాడాలని అన్ని ప్రయత్నాలు చేస్తోంది(!)

అడవిలోంచి తరిమివేశాక మళ్ళీ అడవుల్లోకే వెళ్ళాలని, అడవి అంచుల చుట్టే వాళ్ళు నడుస్తున్నారు. మొత్తం 47 మంది కలలో లాగా అట్లా నడుస్తూనే ఉన్నారు.

వాళ్ళు భయపడ్డారు. మెదడులో సమస్తమూ అదృశ్యమై భయం మాత్రం మిగిలినట్లుగా భయపడ్డారు. భయానకమైన దాడి. అచ్చం యుద్ధంలోలాగా కరకు బూట్ల చప్పుడు, కత్తి మొనల మిలమిలలు. గుడిసెల్ని కాల్చటం మొదటిపని. ఇళ్ళలోంచి నిద్రిస్తున్న వాళ్ళను బయటకు ఈడ్చటం, తుపాకీ మొనల్ని వీపులకు గుచ్చి పరిగెత్తించటం రెండోపని. వాళ్ళ వీపుల నిండా తుపాకీ మొనల గాయాలే. నిరంతరం వీపు వెనుక తుపాకీ గురిపెట్టబడ్డట్టుగానే భయంతో పరిగెత్తి, పరిగెత్తి, కుటుంబాలు విడిపోయి, పిల్లలుగా, ముసలివాళ్ళుగా, విడి విడి శరీర భాగాలుగా పరిగెత్తి, పరిగెత్తి అడవి అంచులదాకా పరిగెత్తారు. భయంతో వాళ్ళు ఒక షాక్ లాంటి, దాదాపు మరణం లాంటి స్థితిలోకి వెళ్ళారు. అడవి లోపలికి వెళ్ళడానికి వీలు లేదని, ఊళ్ళల్లోనే గుడిసెలు వేసుకొమ్మని వాళ్ళను ఆదేశించారు. చెంచులు మాత్రం అడవిలోనే నడవాలని ప్రయత్నించారు. (ఆలోచన, హేతువు ఏదీ పనిచెయ్యని స్థితి) చెట్లకు, పొదలకు తుపాకులు పూచాయి. అయినా వాళ్ళు నడుస్తున్నారు, అడవి అంచునే. ఆహారం లేదు. నిద్రలేదు. రాత్రింబవళ్ళు నడుస్తూనే ఉన్నారు. కళ్ళనిండా భయం, మరణం. ఎవరితోనూ మాట్లాడరు. వాళ్ళట్లా నడుస్తూనే ఉన్నారు.

హాస్పటల్‌లో ఉన్న వీరకు కొన్ని విషయాలు తెలిశాయి. కొన్ని తెలియలేదు. ప్రతి రాత్రి ఇదే చివరి రాత్రి అనిపించేది. అతనున్న గది క్రమంగా కుచించుకుపోయి, ఇరుకుగా ఊపిరి ఆడనట్లుగా అనిపించేది. అంతా సహజంగా ఉందని ఎన్నిసార్లు అనుకున్నా భయంలాంటి ఉపద్రవం లాంటిదేదో తరుముతున్న భావన. మరణం అతని గదిలోకి చొరబడినట్లుగా ఉండేది. అప్రయత్నంగా లేచి నిలబడటం, మంత్రం వేయబడ్డవాడిలా, హాస్పటల్ బయటకు నడుచుకుంటూ వెళ్ళటం- కనబడని శక్తి ఏదో అతన్ని బయటకు తోసివేస్తున్నట్లుగా పదకొండు రోజుల తరువాత వీరని డిశ్చార్జి చేశారు.

హాస్పటల్ నుంచి వెళ్ళిపోయే ముందు రాత్రి అతనికో కల వచ్చింది. కలలో ఒక మహా సౌందర్యమూర్తి కనబడింది. క్షణాల్లో ఆమె ఒట్టి ఎముకల పోగుగా మారింది. "రా, వెళదాం, అందరూ ఎదురు చూస్తున్నారంటూ" అతని చెయ్యి పట్టుకొని లాగింది ఆమె.

"నేను సాధారణంగా బయటకు రాను.

యూనివర్సిటీ, లైబ్రరీ, మోహిని ఇవే నా ప్రపంచం" అంటున్నాడు అతను.

ఆమె సన్నగా, దిగులుగా నవ్వింది. ఆ నవ్వు ఒక ప్రకటనలా ఉంది. "నా కొడుకు నైనా చూడవా? " అంది ఆమె. "పోనీ నా చావునైనా" అని కూడా అంది. "రా పోదాం' ' అంటూ లాక్కెళ్ళింది. బయట, గూడాన్ని తెచ్చి రోడ్డుమీద అతికించినట్లుగా చెంచులు, చెంచులు. "గుర్తు పట్టావా? " అంటోం దామె. ఆమె అతన్ని లాక్కువెళుతూనే ఉంది. మైదానాలు, నీటి పాయలు, పర్వతాలు, దట్ట మైన, పొగరైన అడవులు. "అడవిలోకి వచ్చాం కదా" అన్నాడతను. ఆమె నవ్వింది. కత్తితో శరీరాన్ని కోస్తున్నప్పుడు వచ్చే శబ్దం లాంటి నవ్వు. నవ్వు వినిపిస్తోంది గాని ఆమె అదృశ్యమైంది. ఆమె కోసం, ఆ నవ్వు వెంటే అతను కూడా పరిగెడుతున్నాడు.

ఇంకో కల. ఇందాకటి కలలోని మనిషే. ఇట్లా కనబడ్డట్టే కనబడి మాయమైంది. కాళ్ళు, చేతులు, మనుషుల గుట్టలు, అంతా అవయవాల సముద్రంలా ఉంది. అందు లోకి జారిపోయిందామె. మట్టి, మూత్రం, మలం కసాపిసా, అంతా మడుగులాగా, ఆమె కోసం వెతుకుతున్నాడతను.

2



వీర, మంతయ్యల కంటే ముందుగా వర్షమే అక్కడకు చేరింది. సన్నని తుంపరే గాని, పెద్ద పెద్దగా శబ్దాలు చేస్తూ నేలకు పడుతున్నాయి. పోలీసు స్టేషను ముందు నేలపై నలభై ఆరుగురు చెంచులు. అట్లాగే నేలపై కూర్చుని వర్షంలో తడుస్తూ, బురద బురదగా, నిర్లిప్తమైన ముఖాలు. ఏ కదలికా లేదు. వాళ్ళ జ్ఞాపకాలు చచ్చిపోయాయి. ఎవర్నీ గుర్తు పట్టలేని స్థితిలో ఉన్నారు. దుఃఖం, రోదన, గుండెలపై బాదుకుంటూ ఏడవడం, ఏదీ లేదు. వెళ్ళి వాళ్ళ మధ్యన కూర్చున్నాడు వీర. వాళ్ళ ముఖాలు పోలిక పట్టలేనట్లుగా ఒకే ముఖం, వందలాది ముఖాలుగా క్లోనింగ్ అయినట్లుగా ఉంది. వీరవైపు చూడడానికి వాళ్ళు ఆసక్తి చూప లేదు. "నేను వీరను" అంటూ చాలాసార్లు గొణిగాడు. ఎవరూ విననట్టులేదు. వాళ్ళ దృష్టంతా స్టేషన్ అరుగుపైన పడుకోబెట్టిన శవంపైనే. మహా కోపంగా, మహా దుఃఖంగా అటువైపే చూస్తున్నారు.

ఐదు గంటల ఉదయం, వీధి లైట్లపై చినుకులుపడి అటు ఇటు పరావర్తనం అవు తోంది కాంతి. పూర్తిగా వెలుగురాని ఉదయం. ఒక అర్థగంట తరువాత అక్కడ కదలిక మొదలైంది. పోలీసు జీపు వచ్చింది. డాక్టరును తీసుకొచ్చారు. 48వ కిలో మీటరు దగ్గర, నిన్న సాయంకాలం శవాన్ని ముందు పెట్టుకొని కూర్చున్న చెంచుల్ని పోలీసులు చుట్టుముట్టి శవాన్ని పంచనామా చెయ్యాలి అంటూ ఇక్కడకు తెచ్చారు. శవం వెనుక పరిగెత్తుకుంటూ అందరూ ఇటు వచ్చారు. చనిపోయిన వాడి వయసు పదహారు. శరీ రంలోని సమస్త భాగాలు అదృశ్యమై ఎము కలు మాత్రం మిగిలినట్లుగా ఉందా శవం. వర్షం వేగం పెరిగింది. పెడేల్ పెడేల్‌మని కొడుతోంది. అందరూ వరండాలోకి పరిగె త్తారు, చెంచులు తప్ప. వానను లెక్క చేయ నట్లుగా ఉన్నారు.

"శవాన్ని గుర్తు పట్టడానికి తల్లిదండ్రులెవరూ ముందుకు రావటం లేదు" అని ఎస్.ఐ. విసుక్కున్నాడు. "హాండ్‌మైక్ తీసు కొని, ఈ పిల్లవాడి తాలూకు పెద్దవాళ్ళు ముందుకు రావాలి" అని అరిచాడు. "గుర్తు

## ఇప్పుడు నావల్ల కాదు

తెలుగు గజళ్లు రాసిన సినారె 'ఆత్మలను పలికించేదే అసలైన భాష' అంటూ వాటిలో ఓ గజల్ రాశారు. ఇది గుర్తుపెట్టుకుని ఒకాయన తిరుపతిలో జరుగుతున్న ఓ సభలో సినారె ఇప్పుడు ఆత్మలను కదిలించేలా మాట్లాడతారని ప్రకటించారు. దానికి నారాయణరెడ్డి చిరునవ్వుతో 'ముందు మిమ్మల్ని కదిలించేలా మాట్లాడతాను. ఆత్మలను కదిలించడం ఇప్పుడు సాధ్యపడదు... ఆ సంగతి అక్కడికి వెళ్లాక ప్రయత్నిస్తా' అన్నారు. 'అక్కడికి వెళ్లాక' అని ఆయన చనిపోయాక అనే అర్థం వచ్చేలా చెయ్యిపైకి చూపించడంతో అంతా ఫక్కున నవ్వారు.




పట్టకపోతే శవాన్ని ఇవ్వటం సాధ్యం కాదు" అని మరోసారి అరిచాడు.

గూడెం పెద్దకోసం వెతికాడు వీర. కాస్త వెలుగు వచ్చిన ఉదయంలో ముఖాలు కనిపిస్తున్నాయి కానీ, పోలికలు తెలియటం లేదు. అన్ని ముఖాలు ఒకటిగా ముసలివాళ్ళు, పిల్లవాళ్ళు అని చెప్పగలిగేలా మాత్రమే ఉన్నాయి. వీర దగ్గరకు వెళ్ళి 'పెదగురయ్యా' అని పిలిచాడు. ఎవరూ ముఖం పైకెత్తలేదు. ఎవరి ముఖంలోనూ కదలిక లేదు. ఆశ్రమ పాఠశాలల్లో పనిచేసే టీచర్లు, వెనక గొడుగులేసుకొని నిలబడ్డారు.

"సార్, ఈ కుర్రాడు చింతలముడిపి గూడెం వాడు. పేరు చినగురయ్య. ఇంక శవాన్ని ఇవ్వండి సార్" అంటూ పెద్దగా అరిచాడు వాళ్ళలో ఒకడు.

"ఆ మాట తల్లిదండ్రుల్ని చెప్పమనండి" మళ్ళీ మైకులో అరిచాడు ఎస్.ఐ.

"సార్, వాళ్ళకేదో అయ్యింది. ఏదీ చెప్పలేకపోతున్నారు. ఎవర్నీ గుర్తు పట్టలేకపోతున్నారు" మళ్ళీ చెప్పాడా టీచరు. ఎస్.ఐ. ఆ మాటల్ని పట్టించుకోలేదు.

వాన వేగం తగ్గింది. సన్నని తుంపర. కింద నేలంతా బురద బురదగా ఉంది. ఊళ్ళో జనం ఒక్కొక్కళ్ళే గొడుగులు వేసుకొని వస్తున్నారు.

"ఆర్.డి.ఓ. బయలుదేరాడట" ఎవరో అరిచాడు.

"బయల్దేరినా ఎనిమిది లోపు రాలేదు" ఇంకో మనిషి సమాధానం చెప్పాడు.

"ఇంతకీ శవాన్ని ఇస్తారా లేదా?" జనంలోంచి ఒక మనిషి పెద్దగా అరిచాడు. ఎస్.ఐ. అసహనంగా చూశాడు.

ఐ.టి.డి.ఎ.లో పనిచేసే పాతికేళ్ళ కుర్రాడు ఎస్.ఐ. దగ్గరకు వచ్చాడు. "సార్, నా పేరు భీముడు" అంటూ పరిచయం చేసుకున్నాడు. "బాగా భయపడ్డారు సార్. పదిరోజుల నుంచి ఎవరో తరుముతున్నట్లుగా నడుస్తున్నారు. అడవిలోకి మళ్ళీ వెళ్ళాలని వాళ్ళ ప్రయత్నం. అడవి, గూడెం తప్ప వేరే లోకం లేదు వాళ్ళకు. పది రోజులుగా అన్నం, నీళ్ళు లేవు. పసిపిల్లల్లాంటి వాళ్ళు. వాళ్ళు ఏం పాపం చేశారని ఇట్లా చేస్తున్నారు. ఒకళ్ళ జోలికి పోయ్యేవాళ్ళు కాదు. పిడికెడు బువ్వ, సారాయి ఉంటే వేరే ధ్యాసకు పోనివాళ్ళు. గొర్రెల మందని తరిమినట్లు తరుముతున్నారు. ఈ పిల్లవాడు అన్నం తినక పోయుంటాడు. వాడే కాదు, అందరూ టపటపా రాలిపోతారు" అంటూ ఏడ్చాడు అతను.

మరో పోలీసు వాన్ వచ్చింది. లోప

ల్నించి మరో ఆఫీసరు దిగాడు. పొడవాటి రెయిన్‌కోటు వేసుకొని ఉన్నాడు. పోలీసు లందరూ సెల్యూట్ చేశారు. "కాల్ ఫ్యూ ఎల్డర్ ఫెలోస్" అన్నాడు.

"గూడెం పెద్ద ఎవర్రా మీలో, ముందుకు రండి, దొరగారు పిలుస్తున్నారు" పొగరుగా అరిచాడు ఎస్.ఐ. ఒక్కళ్ళూ కదలలేదు. గొంతు క్కూచుని, ముఖాల్ని నేలకు సారించి, భూమితో తమ దుఃఖ గాధల్ని చెప్పుకుంటున్నట్లు, ఒక్కళ్ళు కూడా కదలలేదు.

వీర ముందుకు నడిచాడు. ఆఫీసరు దగ్గరకు వెళ్ళాడు మాట్లాడదామని.

"యస్, మీరెవరు" అన్నాడు.

"సార్ నా పేరు వీర నరసింహం. చెంచు ట్రైబ్‌కు చెందిన వాణ్ణి, ఉస్మానియా యూనివర్సిటీలో రీసెర్చి స్కాలర్ని" అని పరిచయం చేసుకున్నాడు. 'అయితే ఏమిటి 'అన్నట్టుగా చూశాడు. మాట్లాడడానికి ఆసక్తి చూపించలేదు. మీ వాళ్ళను ఒప్పించండి- వాటీజ్ దిస్ తమాషా. శవానికి పోస్ట్‌మార్టం చెయ్యాలి. బాడీ ఇవ్వటం కుదరదు" అన్నాడు బెదిరిస్తున్నట్లుగా.

నేలపై కూర్చున్న వాళ్ళు ఎవరూ కదలలేదు. అసలు ఈ సంభాషణ వింటున్నట్లు లేరు. తలలు కిందికి దించి, చూపుల్ని అట్లా భూమిపైనే ఉంచిన ఆ భంగిమలోనే ఉన్నారు. దోర్నాలప్రాంతం నుంచి వచ్చిన చెంచు పెద్ద ముందుకు వచ్చాడు. "దొరా పిల్లోడు ఆకలితో పొయ్యాడు. టి.బి కూడా ఉంది. శవాన్ని ఇయ్యండి దొరా, వాళ్ళ ముఖాలు చూడండి. చెంచుల శాపంమూట కట్టుకోకండయ్యా" అంటూ చేతులు జోడించాడు. ఒక్కసారిగా దుఃఖం పొంగు కొచ్చింది ఆయనలో. పై కండువాతో ముఖాన్ని కప్పుకొని పెద్దగా ఏడవటం మొదలు పెట్టాడు.

"వై ఆర్ దే సో ఆరోగెంట్, అడవుల్లోకి వెళ్లొద్దంటే అక్కడే ఉంటామని పట్టు పడతారేంటి? వాళ్ళ కోసమే కదా ఇదంతా! మార్కాపురం దగ్గరలో ఆల్టర్నేట్ ఎకామడేషన్ ఇచ్చాం కదా. వీళ్ళెందుకు అక్కడకు పోరు? ఎందుకిట్లా అడవి చుట్టూ తిరుగుతారు? మీడియాలో రాస్తోంది చూస్తున్నారు కదా? వాళ్ళని ముందు క్యాంప్స్‌కి వెళ్ళమనండి, ట్రక్‌లు ఇస్తాం. లారీని కూడా అక్కడికే పంపిస్తాం. అక్కడే క్రిమేట్ చేసుకోమనండి. వాళ్ళకు నచ్చజెప్పండి" అన్నాడు అధికారి కోపంగా.

వాన మళ్ళీ తీవ్రమైంది. అంత వానలోనూ, చుట్టూ వందలాదిగా జనం మూగారు. చాలామంది గొడుగులు వేసుకొచ్చారు. జర్నలిస్టులు కూడా వచ్చారు. ఫొటో ఫ్లాష్‌లు, అంత వానలోనూ చెంచులు ఒక్కళ్లు కూడా కదలలేదు. 'తడుస్తున్నారు, చెట్ల కిందకు రండి' అని పిలిచినా పట్టించుకోలేదు. అసలు ఏమాట, శబ్దం, సంజ్ఞా వాళ్ళను చేరుతున్నట్లు లేదు.

వాన తీవ్రమైంది. పోలీసు అధికార్లు స్టేషన్ వరండాలోకి వెళ్ళారు. జర్నలిస్టులు, మిగిలిన చెంచు పెద్దల పక్కనున్న హోటళ్ళ వైపు వెళ్ళారు. గొడుగులు కూడా ఆపలేని వర్షంలో, చాలామంది అక్కడనుంచి వెళ్ళిపోయారు.

కుంభవృష్టి లాంటివానలో, వాళ్ళు అట్లాగే తడుస్తూ భూమి తోటి తమ సంభాషణ కొనసాగిస్తూ,

కార్లు వచ్చి ఆగాయి. ఆర్.డి.ఓ వచ్చాడు. అలల సుందరం కూడా. వర్షంలో గొడుగుల కింద చాలా సంభాషణ జరిగింది. 'స్ట్రెచర్ తెప్పించండి' అని ఎస్.ఐ. అరిచాడు. అలల సుందరం కారులోంచి ఆహారపు పొట్లాలు బయటకు తీశారు. పులిహోర, పెరుగన్నం, అలల సుందరం, తన చేతులతో వాళ్ళకు ఆహార పొట్లాలు అందించాడు. వాన అట్లాగే భీకరంగా కురుస్తోంది. రోడ్ల పొడవునా నీళ్ళు నిలిచాయి. గొడుగుల కింద, అలల సుందరం ఆహార పొట్లాలు అందజే

శాడు. అందుకోడానికి ఎవరూ ఆసక్తి చూపించలేదు. లేచి నిలబడలేదు. పొట్లాలు అట్లాగే చేతుల్లో పట్టుకొన్నారు.

దుప్పట్లో చుట్టిన శవాన్ని చెంచులకు అందజేశారు. వాళ్ళు భూమితో సంభాషణ ఆపి, లేచి, శవాన్ని నాలుగు వైపుల నలుగురు ఎత్తుకొని ముందుకు నడిచారు.

దట్టంగా పెరిగిన తుమ్మ పొదల మధ్యన సన్నని కాలిబాట. అటూఇటూ రాళ్ళగుట్టలు, దూరంగా ఎత్తైన కొండలు, బాట కవతల ఖాళీ స్థలంలో యానాదుల గుడిసెలున్నాయి. కాలి బాటకు తూర్పు వైపున అడవులకు వెళ్ళే రోడ్డు ఉంది. బాట పక్కన గాడిదలు ఓండ్రు పెట్టుకుంటూ పరిగెడుతున్నాయి. ఎప్పటిదో చచ్చి కుళ్ళిన కుక్క శరీరం. భీకరమైన దుర్గంధం, వాన కురుస్తూనే ఉంది. కాలిబాట ఆగిపోయి, సన్నటి చిట్టడవి మొదలైంది. సుమారు పది కిలోమీటర్లు నడిచారు వాళ్లు. ఏ చప్పుడూ లేదు. ఉండీ ఉండీ ఒక ఏడుపు వినబడుతోంది. ఆ తరువాత మౌనం. వెంట వచ్చిన పెద్దలు ఆగిపోయారు. ఆశ్రమ పాఠశాల టీచర్లు కూడా. పోలీసు జీపు చాలా దూరందాకా వాళ్ళను ఫాలో అయింది.

చిల్లంగి చెట్లు, తుమ్మ పొదలు దాటాక కొండ అంచు వచ్చింది. అక్కడ ఆగిపోయారు చెంచులు. అప్పటికి వాళ్ళ వెంట వీర, మంతయ్యలే ఉన్నారు. వానజల్లు కాస్త తెరిపి యిచ్చింది. అయినా ఆకాశంపై దట్టంగా, నల్లటి మేఘం, మరో నల్లమేఘం కొండను పొరుసుకుంటూ వెళుతోంది. పెద్ద ఉరుము. కొండల మధ్యన మారుమోగుతూ వినిపించింది. "కానివ్వండి. చచ్చిన వాడిని ఎంతసేపు ఎదురుగా పెట్టుకుంటాం? గుంత తవ్వండి" అన్నాడు మంతయ్య

మళ్ళీ వానజల్లు మొదలైంది. అంతట్నీ సన్నటి ముసుగు లాగా కప్పింది. దూరం నుంచి రెండు మూడు పల్లెలు మసకమసగ్గా కనిపిస్తున్నాయి. పొలిమేరల్లో నిలబడి కొంతమంది ఇటువైపు చూస్తున్నారు. శవాన్ని గుంతలో పెట్టినాకా, వాళ్ళ మధ్యలోంచి సన్నటి ఏడుపు బయటకు వచ్చింది, కొద్దిసేపే. ఓపిక లేనట్లుగా అందరూ గుట్టలపైన, రాళ్ళపైన వాలిపొయ్యారు. ఏడుపులాంటి సన్నటి గొంతు మళ్ళీ వినబడటం మొదలైంది ముసలమ్మ గొంతు. జ్ఞాపకాల్ని, ఏడుపును కలగలిపి దీర్ఘమైన చావు పాటలా ఉందామె గొంతు. ఎన్నో ఏళ్ళ జ్ఞాపకాల్ని బయటకు తెచ్చుకుంటోందామె. చనిపోయిన మొగుణ్ణి, కొడుకును తలచుకొంది. గూడెంలో జరిగిన అకాల మరణాలన్నీ గుర్తుచేసుకుంటోంది. ఆమె శోకపు పాట సాయంకాలందాకా అట్లాగే సాగింది. వీర పక్క ఊళ్ళకు వెళ్ళి ఆహారాన్ని సంపాదించాడు. దాన్నెవరూ ముట్టుకోలేదు. ఖననం అయిపోయాక కూడా వాళ్ళు అక్కడే ఉండిపోయారు. ముసలమ్మ జ్ఞాపకాల ఏకరువు తరువాత, అక్కడంతా గాఢ నిశ్శబ్దం, ఎవరి శరీరంలోనూ కదిలిక లేదు. వాళ్ళు శరీరాల్లా కాక, ఒట్టి ఆత్మల ముద్దల్లా అక్కడ కూలబడ్డారు.

"ఏ తెగా ఇంత దుఃఖాన్ని అనుభవించి ఉండదు. ఈ ఇరవై ఏళ్ళలో చెంచుల్లా అవమాన పడినవాళ్ళు, గాయపడినవాళ్ళు మరెవ్వరూ లేరు" అన్నాడు వీర, మంతయ్యతో. మంతయ్య మళ్ళీ తన యోగ ముద్రలోకి వెళ్ళిపోయాడు. కళ్లను ఆకాశానికి అతికించి, మగతలాంటి స్థితిలోకి వెళ్లిపోయాడు. వీర నిస్సహాయంగా మిగిలిపోయాడు. వాళ్లతో సంభాషించాలని చూశాడు. ఎవరూ స్పందించటం లేదు. వాళ్లు అతన్ని గుర్తుపట్టినట్టే లేదు. ఆహారాన్ని తినిపించాలని ప్రయత్నించాడు. ఆహారాన్ని కూడా మరిచిపోయిన వాళ్ళలా ప్రవర్తించారు.

చీకటి పడింది. నిన్నటి చరిత్రలన్నీ పక్కన పెట్టి, మానవ సమూహాలన్నీ నిద్ర

లోకి తరలిపోతున్నాయి. భాషలన్నీ అదృశ్యమై, ఒకే ఒక్క భాష, కలల భాష అంతటా వినిపిస్తోంది. చెట్లు, పిట్టలు కూడా నిద్రలో జోగుతున్నాయి. వీర కూడా నిద్రలోకి జారుకున్నాడు. అతని బాల్యం కలలు కలలుగా అతన్ని చుట్టుముట్టింది.

రెండు జాముల రాత్రి సమయంలో నలభై ఆరుగురు చెంచులందరూ ఏదో గుర్తు కొచ్చిన వాళ్ళలాగా లేచి, మళ్లీ నడక మొదలు పెట్టారు. చేలకు అడ్డం పడి, నడుచుకుంటూ వెళ్ళారు. అడవుల దిశగా వెళ్లారు. సుమారు అర్ధగంట నడిచినాక, తాటి తోపుల మధ్యన ఆగారు. చెట్ల మీద పిట్టలు వీళ్ళ అలికిడికి లేచి కలకలమంటున్నాయి. వడ్రంగి పిట్ట చెట్టుపై టక్ టక్ మంటూ శబ్దం చేస్తోంది. నేలంతా చిత్తడిగా ఉంది. చుట్టుపక్కల పొలాలన్నీ ఖాళీగా ఉన్నాయి. గట్ల పొడవునా తుమ్మ చెట్లు.

వీరకు మెలకువ వచ్చి వాళ్ళ కోసం చూశాడు. అసలక్కడ, మనుషులెవరూ రానట్లుగా నిశ్శబ్దంగా ఉంది. మంతయ్యను నిద్ర లేపాడు. యోగ నిద్రలోంచి బయటకు వచ్చి, తాటితోపు వైపు వేలు చూపాడు. ఆహారాన్ని, నీళ్లను మోసుకుంటూ అటువైపు నడిచాడు వీర.

తాటి తోపుల మధ్య, నల్లటి గీతల్లా వాళ్లు కనబడ్డారు. ఉదయం నుంచి వాళ్ళను గమనిస్తున్న మంతయ్య, వాళ్ళ దగ్గరకు వెళ్ళి మాట్లాడటం మొదలుపెట్టాడు. మాటలంటే ధైర్యం చెప్పటమే. భవిష్యత్తు గురించి హామీ ఇవ్వటం. అది మంతయ్య మాత్రం ఎక్కడనుంచి తేగలడు. చాలాసేపు వాళ్లతో మాట్లాడినాక, అలసటగా గట్టు పైన కూలబడ్డాడు. ఒక అద్భుతం కోసం, ఎదురు చూస్తూ మంచి నీళ్ళ డబ్బా నిండా గ్లూకోజ్ కలిపి వాళ్ళ మధ్యన పెట్టాడు వీర. దాహంతో ఉన్నవాళ్లు(సారాయి అనుకొని కొందరు) ఆ నీళ్ళను తాగటం మొదలుపెట్టారు. "ఇదో విజయం" అనుకున్నాడు వీర. కాసేపటికి మగత నిద్ర కమ్మింది వాళ్ళను. తాటి చెట్ల తోపునిండా నిద్ర తాలూకు చప్పుళ్ళు.

వీర తాటి తోపు బయటకు వచ్చాడు. అతని వెంట ఉన్న ఆహారం, సద్దిపడి వాసన వేస్తోంది. దాన్ని తోపుల కవతల డొంకలో పారవేశాడు. మళ్లీ ఆహార సేకరణ కోసం, దగ్గరలో ఉన్న హైవే వైపు నడిచాడు.

పొలాలకు అడ్డంబడి దక్షిణం వైపుకు నడుచుకుంటూ వెళ్ళాడు. అన్ని వైపుల నుంచీ చీకటి కురుస్తోంది. పొలాల నిండా నెర్రెలు, గుంపులుగా కాకులు, పరిగెలు తుమ్మ చెట్లపై వాలి చప్పుడు చేస్తున్నాయి. దూరం గా ఎక్కడో ట్రాక్టరు చప్పుడు.

పొలాల మధ్య కోసిన పచ్చిగడ్డి కుప్పలు. ఎండబెట్టిన తుమ్మ కంప, పొలాల్ని దాటి ఊరిలోకి దారి తీసే డొంకలోకి అడుగు పెట్టాడు. పక్షి అరుపు ఒకటి పెద్దగా వినపడి ఉలిక్కిపడ్డాడు. భయం గొలిపేలా ఉంది దాని అరుపు. చీకట్లో తుమ్మ పొదలపై మిణుక్కు మిణుక్కు మంటున్నాయి దాని కళ్ళు. రెక్కలు టపటపలాడిస్తూ మళ్లీ పెద్దగా అరిచింది. బొంతకాకో, గద్దో అయి ఉంటుంది. ఒకటి కాదు చాలా ఉన్నట్టు



**చెట్ల మీద పిట్టలు వీళ్ళ అలికిడికి లేచి కలకలమంటున్నాయి. వడ్రంగి పిట్ట చెట్టుపై టక్ టక్ మంటూ శబ్దం చేస్తోంది. నేలంతా చిత్తడిగా ఉంది.**

న్నాయి. క్షణంసేపు నిశ్శబ్దాన్ని పాటించి, అన్నీ కలిసి భీకరంగా అరవటం మొదలుపెట్టాయి.

డొంక దాటాక దీపాలు కనబడటం మొదలు పెట్టాయి. డొంకంతా బురద. అట్లాగే ముందుకెళితే తారు రోడ్డు కనిపించింది. రోడ్డుపై రెండు జీపులు కనపడ్డాయి. ఒకటి పోలీసు జీపు. హెడ్ లైటు ఆర్పుకొని, లోపల విశ్రాంతి తీసుకుంటున్నారు. రెండోది మార్కాపురం బేస్‌గా పని చేసే ఎన్జీఓ సంస్థ చెంచుల కోసం ఆహారం తెచ్చారు. ఉదయం కోసం ఎదురు చూస్తున్నారు. వీర వాళ్లతో మాట్లాడాలని చూశాడు. వాళ్ళు ఆసక్తి చూపలేదు. రేపు ఉదయం మీడియా ప్రతినిధుల ముందు ఆహారం పంచాలని వాళ్ళ ఆలోచన.

రోడ్డుపైన అట్లాగే మరి కాస్త దూరం వెళ్ళాడు వీర. జంక్షన్ లాంటి ప్రదేశం వచ్చింది. ఇటు కర్నూలుకు, అటు విజయవాడకు వెళ్ళే హైవే అది. జంక్షన్‌లో నాలుగైదు హోటళ్ళు ఉన్నాయి. ఎక్సైజ్ వాళ్లవి, ఫారెస్టు వాళ్లవి చెక్ పోస్టులున్నాయి. లారీల్ని రోడ్డు పక్క నాపుకొని, డ్రైవర్లు హోటల్ ముందున్న మంచాలపై కూర్చున్నారు. హోటళ్ళ అవతల నాలుగైదు పూరిళ్లు, వాటిలో మిణుక్కు మిణుక్కు మంటున్న దీపాలు. ఒక హోటల్‌లో సినిమా పాటలు పెట్టారు.

కొద్దిగా మూలనున్న ఇంకో హోటల్‌కు ఆనుకుని బార్ కూడా ఉంది. వరుసగా వేసిన మంచాలపై కూర్చున్న లారీ డ్రైవర్లు, పోలీసులు, కొద్దిమంది కుర్రాళ్లు, మందు కొడుతున్నారు.

వాళ్ళకు కాస్త దూరంలో, ఎత్తుగా నున్న రాయిపై నిలబడి, ఒక నడికారు మనిషి పెద్దగా మాట్లాడుతున్నాడు. శ్రావ్యంగా, రిథమిక్‌గా, హాయిగా ఉంది అతని కంఠం. అతను కథలు చెప్పే మనిషి. మాసిన పంచె, చొక్కా, భుజాన గాంధీ మార్కు సంచి. అతను ఊరూరు తిరిగి కథలు చెప్పుకొని బతికేవాడు. ప్రకాశం జిల్లా కరువు, చైనా యుద్ధం, దివిసీమ ఉప్పెన, ఇందిరమ్మ మరణం, కథల్ని సులువైన మాటల్లో, గేయ రూపంలో చెప్పేవాడు. వాటిని పది, పదిహేను పేజీల పుస్తకాలుగా ముద్రించి, తన సంచిలో పెట్టుకుంటాడు. కథాగానం పూర్తయినాక, ఆ పుస్తకాల్ని అమ్మకానికి పెడతాడు. పుస్తకంపై రూపాయి వెల ఉంటుంది. అయితే కథ చెప్పేటప్పుడు, అతని కంఠంలోని మార్దవానికి, ముఖంలో చూపే కరుణ, వీర రసాలకు, అతని ఆహార్యం, అన్నింటికి కరిగిపోయిన ప్రేక్షకులు, రెండు నుంచి అయిదు దాకా ఇచ్చి పుస్తకాలు కొనుక్కుంటారు. గత అయిదేళ్లలో, ఈ కథాగానాలు చెప్పేవాళ్ల సంఖ్య తగ్గిపోయింది.

ఆ కథల మనిషి ఇప్పుడు సునామీ భూకంపం గురించి చెబుతున్నాడు. అలలు మహా క్రోధంలో పైకి లేవటం దగ్గర మొదలు పెట్టి, ఒడ్డున జాలర్ల ఇళ్లలో పెళ్ళి వేడుకలు వర్ణించి, హఠాత్తుగా అలలు ఎట్లా వెంబడించింది చెప్పుకుపోతున్నాడు. వధువును పట్టుచీర, తలంబ్రాలతో సహా, ఎట్లా లోపలికి లాగేసుకుంది, ఆర్ద్రంగా చెబుతున్నాడు. ఎదురుగా ఉన్న వాళ్లలో కదలిక వచ్చింది. లారీ డ్రైవర్లు, ఆ కథకు చలించిపోయారు. రెండు పది రూపాయల నోట్లు అతని చొక్కాకు గుచ్చారు. కథ కొనసాగుతోంది. అతని కంఠం ఉచ్ఛ స్థాయికి వెళ్లింది. సునామీ ఒక శాపం అంటూ, సముద్రుడు జాలర్లకు సంబంధించిన పురాణ కథను వివరిస్తున్నాడు.

కథ పూర్తయినాక లారీ డ్రైవర్లు అతనికీ విస్కీ గ్లాసు అందించారు. అతను తన సొంత కథ చెప్పుకుంటున్నాడు. కందుకూరు పక్క చిన్న గ్రామం. కుటుంబమంతా గాయకులే. కథలు వాళ్లే రాసుకుంటారు. ప్రింట్

## మహోపకారి

ఆరోగ్యవంతులను మీ ఆరోగ్య రహస్యమేమిటని అడిగితే "ఎక్కువగా పళ్లు, కాయగూరలు, కొవ్వు తక్కువగా ఉండే పదార్థాలు తీసుకోవడం, ధూమ, మద్యపానాలకు దూరంగా ఉండడం, క్రమం తప్పకుండా వ్యాయామం" అని చెబుతారు.

కానీ ఈ జాబితాలో సూర్యరశ్మిని కూడా జతపరుస్తున్నారు శాస్త్రవేత్తలు.

ఎండలో నిలబడితే సూర్యరశ్మికి నల్లబడటం, చర్మం మీద మచ్చలు, ముడతలు, చర్మ కేన్సర్లు వస్తాయన్న అపోహల్ని పటాపంచలు చేస్తూ సూర్యరశ్మి మహోపకారం చేస్తుందని కొత్త పరిశోధనలు రుజువు చేస్తున్నాయని పేర్కొంటున్నారు. సూర్యరశ్మి ద్వారా లభించే విటమిన్-డి కేన్సర్‌ని తగ్గించటమే కాకుండా, గుండె జబ్బులను, రక్తపోటును తగ్గించి, మల్టిపుల్ స్క్లీరోసిస్, కీళ్ళ నొప్పులు, మధుమేహ వ్యాధి, చిగుళ్ల వ్యాధుల బారినుంచి రక్షణ కల్పిస్తుందని పరిశోధనల ద్వారా వెల్లడయింది. ఎముకల నిర్మాణంలో పెరుగుదలకు అవసరమైన కాల్షియంతో బాటు ఇతర పోషక పదార్థాలలోనూ విటమిన్-డిదే ప్రథమ స్థానం. ఆహారం ద్వారా గానీ, సూర్యరశ్మి ద్వారా గానీ 1000 ఇంటర్నేషనల్ యూనిట్స్ (ఐయు) విటమిన్-డిని పొందడం వల్ల కోలాన్ క్యాన్సర్‌కు గురయ్యే ప్రమాదాన్ని సగానికి తగ్గించవచ్చని కాలిఫోర్నియా యూనివర్సిటీకి చెందిన ఎపిడెమియాలజిస్టు సెడ్రిక్ గార్లండ్ నిరూపించారు.

ఆహార పదార్థాలలో పాలు, పళ్ళ రసాలు, విత్తనాలు, ధాన్యపు గింజలు, చేప నూనె, కాడ్ లివర్ నూనెల నుండి విటమిన్-డి లభిస్తుంది. వీటన్నిటిలో ఎక్కువగా ఒక చెంచా కాడ్ లివర్ ఆయిల్ నుంచి 1360 ఐయు విటమిన్-డి లభ్యమవుతుంది.



చేయించుకుంటారు. ఒంగోలు దగ్గర మొదలు పెట్టుకొని, హైదరాబాదు దాకా ప్రయాణిస్తాడు. ఒక్కో ట్రిప్పుకు ఐదు వేల దాకా సంపాదించేవాడు.

రెండు గ్లాసులు తాగినాక, అతని ముఖంలో అప్పటిదాకా ఉన్న ప్రసన్నత మాయమైంది. ముఖం ఎర్రగా అయి, దుఃఖం తన్నుకు వచ్చింది. "బతకటం కష్టమైపోయింది సార్. పల్లెలు ఆకలితో చచ్చిపోతున్నాయి. పనుల్లేవు. పట్టించుకునే నాధుడు లేడు. నా ఇరవై ఏళ్ళ కొడుక్కు టి.బి. సార్. మందులిప్పించలేను. బలమైన తిండి పెట్టలేను. ఎందుకు సార్ ఈ బతుకు. చెంచుల్లాగే సావులోకి నడిచి పోవాలనిపిస్తుంది" అన్నాడు. అక్కడే కూర్చున్న వీర ఉలిక్కిపడ్డాడు. 'చావులోకి నడక' అనే మాట గుండెల్లో అలజడిని రేగింది.

"చెంచుల మీద కూడా కథ రాశాను సార్. ముగింపు కూడా అయిపోయింది. నిన్న ఒకడు పోయాడని విన్నాను. దీన్ని నేను ముందే కథలో రాశాను సార్. ఇది ఒకళ్లతో ఆగదు. ఇది మరో సునామీ సార్. చావు సార్. అంతా చావే. అడవులన్నీ చావు వాసన వేస్తున్నాయి. ఒక్కసారి ముక్కుల్లోకి గట్టిగా గాలిని పీల్చండి సార్. శవాల వాసన వేస్తుంది. ఎప్పటినుంచో

కుళ్ళుతున్న శవాల వాసన."

"సార్, ఇక రాబోయే రోజులన్నీ భయం కరమైనవే. నిప్పుల వాన కురుస్తుంది. అడవులు తగలబడి పోతాయి. జనం ఒకళ్లనొకళ్ళు నరుక్కుంటారు. గవర్నమెంట్లు పడిపోతాయి. ఇంక అంతా నాశనమే, నాశనమే" అంటూ ఆ కథలు చెప్పే మనిషి పెద్ద పెట్టున ఏడవటం మొదలుపెట్టాడు.

వీర అతని దగ్గరకు వెళ్ళి, చెంచుల కథ పాడమని అడగాలనిపించింది. కానీ అతను చెప్పే ముగింపు వినడానికి ధైర్యం చాల లేదు. అతని పక్కన కూర్చుని, అతని సంచి లోని పుస్తకాన్ని లాక్కుని, కథల ముగింపు మార్చాలనిపించింది వీరకు. ఆ కథల మనిషి, పై కండువాతో ముఖం తుడుచుకొని, లేచి సంచిని భుజానికి తగిలించుకొని, తథాగతుడిలా అట్లా ఎదురుగా కనిపించే పొలాలవైపు నడుచుకుంటూ వెళ్ళేడు. వెనక నుంచి పరోటాలు తిని పొమ్మని అరుస్తున్నా వినిపించుకోలేదు. మహా దుఃఖాన్ని మోసు కెళుతున్న వాడిలా ఉన్నాడు.

చీకటి బాగా చిక్కబడింది. పైన ఆకాశంలో చంద్రుడి వెలుగు అదృశ్యమైంది. హోటళ్లలో లైట్లు ఆర్పి వేశారు. చెక్‌పోస్టు దగ్గర లైటు మాత్రమే మిణుక్కు మిణుక్కు మంటుంది.

జంక్షన్ దాటి ముందుకు నడిచాడు వీర. అతని చేతిలో యాభై రొట్టెలు, హోటల్ వాడు కట్టిచ్చినవి. ముందుకు నడుస్తూ ఉంటే అతని చెంచు కాలనీ ఎదురైంది. ఐటిడిఏ వాళ్ళు కట్టిన సిమెంటు ఇళ్ళు. నిర్మానుష్యంగా ఉంది కాలనీ. మనుషులు నివసించని ప్రదేశంలా ఉంది. కొన్ని ఇళ్ళు గోడలు కూలిపోయి, పైకప్పు లోపలికి కుంగిపోయి, శపించబడ్డ ప్రాంతంలా ఉంది. కాలనీ ముందున్న రాతి ఫలకంపై శాస్త్రి అనే ఆఫీసరు పేరు పెద్ద అక్షరాల్లో కనిపిస్తోంది.

శిథిలమైన కాలనీని చూసి ఎందుకో కాళ్ళు వణికాయి వీరకు. అపశకునంలా తోచింది. దూరంగా ఎత్తైన కొండలు, చెట్లు, అటూ ఇటూ పరుచుకొన్న పొలాలు, కొండల పక్కనున్న చిట్టడవి, సమస్తం ఏదో రహస్యాన్ని దాస్తున్నట్లుగా ఉన్నాయి. కాలనీ కూలిపోయి, అందులోని మనుషులు ఎటో వెళ్లిపోయి, ప్రపంచానికేమీ పట్టనట్లు ఉండటం ఆశ్చర్యంగా ఉంది.

కూలిన ఇళ్ళలోంచి కుక్కపిల్ల మూలుగులు వినిపిస్తున్నాయి. అటు వైపుకు నడిస్తే, వీరకు అక్కడో మానవాకారం కనబడింది. చీకటిలో ఆ మనిషి నీడలాగా కనిపిస్తున్నాడు. "ఎవరది? " అన్నాడు వీర. అటు వైపునుంచి ఏ స్పందనా లేదు. మనిషేనా లేక చీకట్లో తిరిగే గడుసు దెయ్యమా అని ఆలోచించాడు వీర.

"ఎవరదీ" అని మళ్ళీ అరిచాడు వీర.

"ఎవరని నన్నే అడగడానికి ఎంత ధైర్యం నీకు. నేను ఈ ప్రపంచానికి ఏకైక దేవుణ్ణి. సృష్టించేవాణ్ణి, ధ్వంసించేవాణ్ణి, సమస్తాన్ని మొదలు పెట్టేవాణ్ణి. ముగించేవాణ్ణి" అని మాటలు వినిపించాయి.

క్షణంసేపు నిశ్శబ్దం. వీర ఉలిక్కిపడ్డాడు. అటుపక్కనున్న మనిషి ఆకారం లేచి నిలబడింది. కింద గోనెపట్టా పరిచి ఉంది. మిణుకు మిణుకు మంటున్న వెలుతురులో ఆ మనిషిని చూశాడు. శరీరంపై నూలుపోగు లేదు. చింపిరి జుట్టు, పొడవాటి గడ్డం.

"వెర్రి వెధవలా ఉన్నావు. పెద్దగా గొంతు పెట్టుకొని 'ఎవర్నువ్వూ' అని అరిస్తే భయపడతాననుకున్నావా? నిన్ను ఇక్కడకు రప్పించుకొంది నేనే" అతని కంఠం పెళ్ళుమని చప్పుడు చేస్తోంది. మాటల్లో కాఠిన్యం ఉంది.

"తెలివి తక్కువ మనిషీ, నీ కాలం ముగిసింది. కాస్త జాలి ఉన్న దేవుణ్ణి కాబట్టి ఇనాళ్ళూ మీ ఆటలు సాగాయి. ఇప్పుడిక

ధ్వంసం చెయ్యడానికి వచ్చాను" అంటూ పెద్దగా అరిచాడు.

నిట్టూరుస్తూ వీర అక్కడనుంచి ముందుకు నడుస్తుంటే, పెద్దగా, భీకరంగా నాటకాల్లో వినబడే నవ్వు అంతటా వ్యాపించి, అదో మిస్టిక్ నవ్వులా వీరని, చాలా దూరం వెంటాడింది.

వెనక్కు తాటి తోపులోకి తిరిగివచ్చాడు వీర. నిద్రో, మగతో అందరూ తాటి చెట్లకు ఆనుకుని పడుకున్నారు. చీకటి శకలాలు శకలాలుగా అన్ని వైపులనుంచి జారిపడు తోంది. పగటి జ్ఞాపకాలన్నీ చుట్టూ వేలాడు తున్నట్లుగా ఉంది. ప్రమాదమేదో పొంచి ఉన్న భావన. నిద్రమాని రాత్రి పొడవునా కాపలా కాయాలనుకున్నాడు వీర.




వీర కలలో వందలాది తాబేళ్ళు, తాబే ళ్ళకు రెక్కలు మొలిచాయి. ఇనుపరెక్కలవి. బలంగా విశాలంగా ఉన్నాయి. తాబేళ్ళన్నీ కొంగల్లా ఎగురుతున్నాయి. అడవిపైన తాబే ళ్ళ విహారం, చేటలంత రెక్కలతో. గాలిలోం చి కత్తులు మొలిచి తాబేళ్ళ రెక్కల్ని తెగన రుకుతున్నాయి. తాబేళ్ళు గాలిలో వేలాడుతు న్నాయి. కొన్ని దబ్ దబ్ మంటూ నేలమీద పడిపోతున్నాయి.

వీర కల ముగిసేసరికి కొత్త ఉదయం. తెల్లటి మంచు కప్పుకొన్న ఉదయం. తాటి వనమంతా ఖాళీగా ఉంది. చెంచులు ఏ తొలిపొద్దు సమయానో ఆ ప్రదేశాన్ని వదిలి వెళ్ళారు. వీర లేచి ఆ ప్రదేశమంతా తేరి పార జూశాడు. వెళ్ళిపోయిన ఆనవాళ్లు కూడా లేవు. చీకట్లో కాళ్ళు ఎటు నడిస్తే అటు అడుగులు వేసుకుంటూ వెళ్ళి ఉంటారు. మంతయ్య ఒక మూలన తాటి మట్టను చీలుస్తూ కూర్చున్నాడు.

వీర నిస్సత్తువగా అయిపోయాడు. అంత మంది, అంత హఠాత్తుగా, ఏ చప్పుడు లేకుండా అదృశ్యం అవటం ఆశ్చర్యంగా ఉంది అన్నాడు మంతయ్యతో. మంతయ్య చిద్విలాసంగా చూస్తున్నాడు. వీర ఆ ప్రదే శపు మ్యాప్ బయటకు తీశాడు. కుడివైపుకు వెళితే గుండంచర్ల, కల నూతల, సుంకేసుల, గొట్టిపడియ ఊళ్ళు ఉన్నాయి. ఎడమ వైపుకు వెళితే చిలకచర్ల, కాటమరాజు దిబ్బ వస్తాయి. ఎడమవైపుకు వెళ్ళి వాళ్ళను వెత కాలనుకున్నాడు వీర. మంతయ్య వీరను అనుసరించాడు.

చెట్లు, విసురుగా వీచే గాలి, కొండలు, ఏ ఆచూకీని ఇవ్వటం లేదు. కొండ అంచున మైదానంలోకి వెళ్ళే డొంకలో కూలిపోయిన ఒంటరి గుడిసె ఉంది. గుడిసెముందు చిత్త డి చిత్తడిగా చాలామంది మనుషులు నడి చిన ఆనవాళ్ళు ఉన్నాయి. పాడుబడ్డకుంట, ఆ కుంటలోని నీళ్ళు తాగినట్లుగా, ఒడ్డున మనుషుల కాలిగుర్తులు. కూలిన గుడిసె లోకి తొంగిచూశాడు వీర. లోపలో రక్తపు మడుగు. నేలంతా పాకి, నల్లగా గడ్డగట్టి, రక్తపుమడుగున వింత పదార్థం. బహుశా నిర్జీవంగా ఉన్న, రెండో మూడో వారాల భ్రూణం కావచ్చు వీర ఉలిక్కిపడ్డాడు.

'ఈ జ్ఞాపకాలన్నీ మనం మోయాల్సిందే. నిర్జీవమైన భ్రూణం చెప్పే జ్ఞాపకాల్ని కూడా' అని అనుకున్నాడు వీర. ఇనుప బూట్లు, రాక్షసరతి, మరణించిన శిశువు చెప్పే హింస గాథలెన్నో' అని కూడా అనుకున్నాడు.

కొద్ది దూరం నడిచాక పాదాల గుర్తులు ఆగిపోయాయి. కొండ మలుపు దాటాక

విశాలమైన మైదానం. పొదలు పొదలుగా అల్లుకొన్న చిట్టడవి. కొండ పైకెక్కి అన్ని వైపులకూ కలయచూశాడు వీర. మంతయ్య, పౌరాణిక కథల్లోని మనిషిలా చిద్విలాసంగా చూస్తున్నాడు. తాటాకులతో అల్లుకొన్న కిరీటాన్ని తలపై పెట్టుకొన్నాడు. "ఆందోళన పడకు, అన్నీ సర్దుకుంటాయి" అన్నట్లుగా చూశాడు మంతయ్య.

వీర ఆ భరోసాని నమ్మే స్థితిలో లేడు. విశాలమైన మైదానంలోకి అడుగులు వేశాడు. లోపలికి వెళ్ళేకొద్దీ, అడవి చిక్కనవటం మొదలుపెట్టింది. తుమ్మకంప, రేగుపొద బాట ముందుకు చొచ్చుకొచ్చి, శరీరాన్ని చీల్చుతోంది. సూర్యుడు మెల్లగా పైకి లేస్తున్నాడు. మంచు బిందువులపై తళతళలాడే వెలుగు. కొంతదూరం వెళ్ళినాక కుక్కల అరుపులు వినబడ్డాయి. మేకల మందకు కాపలా ఉండే కుక్కలు. గుట్టపైన గొల్లలు పళ్ళు తోముకుంటూ కనిపించారు. "రాత్రి ఒక జామువేళ కుక్కలు చాలాసేపు అరిచాయి. అప్పుడేమన్న ఇటు వెళ్ళి ఉంటారు" అంటూ సమాచారం



ఇచ్చారు. అటువైపు వెళితే కాటమరాజు దిబ్బ వస్తుంది.

కాస్త దూరం వెళ్ళినాక, మరో గొర్రెల దొడ్డి కనబడింది. మనుషులుగానీ, కాపలా కుక్కలు గానీ కనబడలేదు. చిన్ని చిన్ని గొర్రెలు. ఇంకా ముర్రె కూడా వీడనివి. మంతయ్య, వీరని ఆపి "వాటిని జాగ్రత్తగా చూడు" అన్నాడు. చూస్తే, అన్నీ అవిటి గొర్రెలు. కాళ్ళు విరిగినవి, లేదా తలలు పెకెత్తలేక నేలపై గోజారుతున్నవి. అవయవాల్ని పోగొట్టుకొన్న గొర్రెపిల్లలు. పుట్టటమే గాయపడి పుట్టినవి.

వాటిని చూస్తుంటే వీరలో ఉలికిపాటు, భయం. లోపలి ఆత్మ తన మరణాన్ని ముందుగా దర్శించినట్లుగా అనిపించింది వీరకు.

గుంపులు గుంపులుగా అడవిలోకి మేత కోసం వెళుతున్న పశువులు వందల సంఖ్యలో ఉన్నాయి. నిర్భయంగా నడుస్తున్నాయి. అన్నీ పరిచయమున్న భూములే అన్నట్లుగా నడుస్తున్నాయి.

దూరం నుంచి గద్దల గుంపులు ఎగురుకుంటూ రావటం కనిపించింది. బహుశా చచ్చిన జంతువేదో కనిపించి ఉంటుంది. అన్నివైపుల ఎర్రని తురాయి చెట్లు, చెట్లపై విరగబూసిన ఎర్రని తురాయిపూలు. ఆ కాంతికి అడవి ఉగ్రరూపంలో ఉన్నట్లుగా తోచింది. ఆ చెట్లకవతల కొర్ర చేలు కనబడ్డాయి. కొర్ర చేల పైనుంచి వీచేగాలి, ఎవరివో గుసగుసలాగ వినబడుతున్నాయి. కొర్ర చేలపై మూగిన పరిగెపిట్టలు. కంకులపై వాలి, అంతలోనే రివ్వున ఎగిరి, ఇంకో ప్రదేశానికి వెళ్ళే, పాలపిట్టలు, వడ్రంగి పిట్టలు ఒక చెట్టునుంచి ఇంకో చెట్టువైపుకు ఎగురుతూ, అడవి జ్ఞాపకాలనో, ఆకాశం అందాన్నో చెట్లకు వినిపించే ప్రయత్నం చేస్తున్నాయి.

కొర్రచేల మధ్యన గట్టుకు చేరబడి, నిద్రపోతున్న ఆడమనిషి కనబడింది వీరకు. గూడెం మనిషి అని అరిచాడు. ఆమె నిద్రపోతూనో లేదా బద్ధకంగా పడుకొనో ఉంది.

'అంకాళమ్మా' అని పిలిచాడు మంతయ్య. కళ్ళు తెరిచి, మళ్ళీ మూసుకుంది. నీరసంగా 'ఊ' అంది. "మిగతా వాళ్ళు ఏరి? " అన్నాడు వీర ఆతృతగా. కళ్ళు పైకి తిప్పి, కొండవైపు చూపింది. వీర ఆవిడకు కాస్త గ్లూకోజు నీళ్ళు ఇచ్చాడు. అవి తాగినాక ఆమెలో కాస్త ఓపిక వచ్చింది.

దూరంగా పిట్టల అరుపులు, గొడ్ల దగ్గర పిల్లవాళ్ళ ఆటలు, మంద్రంగా వీస్తున్న ఉదయపు గాలి. ఆమె లేచి కూర్చుంది.



అన్నివైపులకు ఆయోమయంగా చూసింది. స్వగతంలాగా ఏదో గొణుగుతోంది. అర్థం లేని మాటలు, బహుశా చాలా యేళ్ళనా టివి, ఏవేవో సంగతులు మాట్లాడుతోంది. ఆ మాటలు డెలీరియంలోలాగ వినపడీ వినపడనట్టుగా ఉన్నాయి.

"అంకాళమ్మా" అని పిలిచి, ఆమెను మాట్లాడించాలని చూశాడు మంతయ్య. ఆమె మంతయ్యను గుర్తు పట్టలేదు. ఈ అంకాళమ్మా మందులు, మాకుల గురించి తెలిసిన మనిషి. బుట్టలో పుట్టకొక్కులు, మూలికలు, వేర్లు, మందు ఆకులు వేసు కొని తిరిగేది. జబ్బులతో మంచాన బడ్డ పిల్లలకు వేర్లు, ఆకుల రసం యిచ్చేది. చిన్న చిన్న జబ్బులు తగ్గేవిగాని, టి.బి. మలేరియాలాంటివి తగ్గేవికావు. జబ్బు ముదిరి పిల్లలు చచ్చిపోయిన సందర్భాలే ఎక్కువ.

ఒక్కతే గుడిసెలో ఉండేది. మందులు నూరుతోనో, పొయ్యిపై ఆకుల్ని మరగబె డుతూనో కనబడేది. మొగుడు అడవిలో పసరము ఏదో కరిసి చచ్చిపోయేడు.

'అంకాళమ్మా' అని మూడోసారి పిలి చాడు మంతయ్య. మంతయ్య వైపు తిరిగి "ఆకలికి తట్టుకోలేక, నాలుగు పుట్టగొడు గులు పెరుక్కొని తిన్నాను. అయి విషపు పుట్టగొడుగులు" అంది, మగతలోకి జారుతూ. "నన్ను అడవిలోనే కప్పిపె ట్టండి. కాస్త గాలి తగిలేలా, వెదురు మీంచి వచ్చే గాలి, తగిలేలా..." అంది.

"నీకేంకాదు. నా దగ్గర మందులు న్నాయి" అన్నాడు వీర. లాభం లేదన్నట్లు తల వూపి "జీవుణ్ణి నిలబెట్టే గుంజలు కూలిపోయాయి" అంది వేదాంతిలాగా.

వీర ఆమెకు ఇంజక్షన్ ఇచ్చాడు. ఇంజ క్షన్ ఇస్తుండగానే వాంతి చేసుకుంది. ఆకు పచ్చని వాంతి. భరింపలేని వాసన. దుఃఖపు గొంతుతో ఏవేవో మాట్లాడు తోంది. దేవుడికి చేసే నివేదనలా ఉన్నాయి ఆ మాటలు.

చెట్లపై నుంచి గాలులు బలంగా వీస్తు న్నాయి. గాలికి ఆకులు, దుమ్ము పైకి ఎగిరి వస్తున్నాయి. టపటపమంటూ రెండు చినుకుల వానపడింది. అంకాళమ్మ మాటలు ఆగిపోయాయి. సన్నటి మూలు గు మాత్రం వినిపిస్తోంది. మంతయ్య కళ్ళు మూసుకొని, నుదుటిపై రుద్దు కొంటూ, "విషపు పుట్టగొడుగులని తెలి యక కాదు. కావాలనే..." అన్నాడు. అంకాళమ్మ కళ్ళు మూతలు పడుతు న్నాయి. నిద్రలాంటి మగత. అడవి మొత్తాన్ని ఆలింగనం చేసుకుంటున్నట్లు, రెండు చేతులతో కొర్ర పైరును కౌగలించు కొని, అట్లాగే నిద్రలోకి జారింది. వీర మరో ఇంజక్షన్ ఇచ్చాడు.

అంకాళమ్మని చూస్తుంటే వీరలో ఎప్పటివో జ్ఞాపకాలు. అమ్మ తాలూకు జ్ఞాపకాలు. నిజానికి ఇప్పుడు ఆమె దగ్గ రగా వచ్చినా వీర గుర్తుపట్టలేడు. నలభై ఆరుగురులో ఆమె ఒక్కతే. కానీ విడిగా గుర్తు పట్టమంటే సాధ్యం కాదు. లచ్చక్క దేన్నీ గుర్తు పట్టే స్థితిలో లేదు. లచ్చక్కే కాదు, ఆ నలభై ఆరుగురు కూడా.

చిన్నప్పుడు అమ్మతో గడిపిన రోజులు గుర్తుకొచ్చాయి వీరకు. అతని తమ్ముడు, చెల్లెలు, అతని కళ్ళముందే జ్ఞాపకంగా మారి, నేలలో పూడ్చి పెట్టబడ్డారు. వాళ్ళు అతని పూర్వీకులుగా మారి, నేలలోంచి, అంతా గమనిస్తూనే ఉంటారు.

చెల్లెలు చనిపోయినపుడు, వీర వయసు మూడేళ్లు కూడా ఉండదు. ఆ చిన్న జ్ఞాపకం, అప్పుడే పూడ్చిపెట్టబడిందని అనుకున్నాడు. అయితే, ఆ జ్ఞాపకం కలగా మారి, అతన్ని చాలా రోజులు వెంటా డింది. కలలు జ్ఞాపకాలుగా, జ్ఞాపకం కలగా, అతని భయాల్లో కలిసిపోయాయి.

భయపడి, బిగుసుకుపోయిన యువ కుడిలా బతికాడు. అతని చుట్టూ ఉన్న నగర జీవితాన్ని ఊపిరాడనంత గట్టిగా చుట్టుకొని, లోపలి జ్ఞాపకాల్ని నిర్జీవం చెయ్యాలని ప్రయత్నించాడు. అయితే రాత్రి తరువాత రాత్రి అవి కలల నిండా ప్రమాద వీచికల్లా తిరుగుతూనే ఉన్నాయి.

కొత్త చేను గట్టుగా, నిర్వేదంగా కూర్చున్న వీర, లోపలి తలుపులన్నీ పగల గొట్టుకొని, ఉమ్మనీరుతో సహా అతని జ్ఞాప కాలు బయటకు తోసుకొస్తున్నాయి. "వీర" అని అతని తల్లి పిలుస్తోంది. "అంతా చూస్తున్నావు కదయ్యా" అని ఏడుస్తోంది.

ఒక తెల్లటి సీతాకోకచిలుకను చూపి, అది మధ్యాహ్నం పూట నిద్రపోతున్న, ఒక పసిపిల్ల ఆత్మ అని చెప్పింది. పిల్లలు నిద్ర పోతున్నప్పుడు వాళ్ళ ఆత్మలు, సీతాకోకచి లుకల్లా మారి, లోకమంతా ఎగురుతుంటా యని వాళ్ళమ్మ చెప్పేది. ఆ తెల్ల సీతాకో కచిలుక మళ్ళీ కనబడింది మరుసటి రోజు అడవిలో. ఇదెక్కడిదని అడిగాడు వీర. ఆ పిల్లదే, నిద్ర లేచి ఉండదు. పెద్ద నిద్రలోకి వెళ్ళి ఉంటదని చెప్పింది. నిద్రలో ఉండగా, ఆ పిల్లకు జ్వరం వచ్చి, ముఖం ఎర్రగా అయి, పెదాలు పాలిపోయి, సీతాకోకచి లుక వెనక్కు వచ్చినప్పుడు, ఆ పిల్లను చూసి, ఈ పిల్ల కాదులే అనుకొని వెళ్ళిపో యింటుంది. జ్వరం పడ్డ పిల్ల, ఆత్మకోసం రోజంతా చూసి, అది వెనక్కురాక కట్టె పోయి ఉంటుంది అని చెప్పేది. ఆ సీతా కోక చిలుక కథే వీరకు ఎప్పుడూ గుర్తుం డేది. ఇప్పటికీ మధ్యాహ్నాలు నిద్రపోవా లంటే భయం వీరకు.

అమ్మతో కలిసి అడవిలో తిరగటం గొప్ప ఆనందం వీరకు. ఏ చెట్టు పండు తియ్యగా ఉంటుందో ఆమెకు బాగా తెలుసు. పేర్లు కూడా తెలియని కొత్త కొత్త పండ్లు కోసిచ్చేది ఆమె. దుంపలు తవ్వ

### ఈ తేరు.. ఈతేరు

ఓ కళాశాల వార్షికోత్సవానికి అతిథిగా వెళ్తున్నారు నారాయణరెడ్డి. ఆయన ఎక్కిన కారు గుంటూరు జిల్లాలో పల్లె టూళ్ల గుండా ప్రయాణిస్తోంది. ఎండ బాగా ఉండడంతో సినారె అలసటగా కళ్లు మూసుకున్నారు. కొద్దిసేపటి తర్వాత కళ్లు తెరిచి తన సహజసిద్ధమైన చమత్కార శైలిలో 'ఈ తేరు.. ఏతీరున బడి పోవుచు న్నది?' అని అడిగారు ముందు సీట్లోని సదరు కళాశాల విద్యార్థిని.

అతను వెంటనే 'ఈ తేరు.. ఈతేరున బడిపోవుచున్నది' అన్నాడు అంతకంటే చమత్కారంగా.

ఆయన ఆశ్చర్యంగా చూస్తుంటే రోడ్డుప క్కన ఊరిపేరున్న బోర్డును చూపాడు. దానిపై 'ఈతేరు' అని ఉంది.

నారాయణరెడ్డి పెదాలపై మందహాసం విరిసింది. 'భళా.. నువ్వు నాకంటే చమ త్కారివే' అంటూ తన పెన్నును అతనికి బహూకరించారు.




టంలో ఆమె నేర్పరి. అడవి కెళ్ళినప్పుడల్లా పూలు తెచ్చేది. ఎర్రనివి, పసుపు పచ్చనివి, ఎన్నెన్నో పూలను తెచ్చేది. వాటిని వెదురు పుల్లలకు చుట్టి, అతని తలపై కిరీటంలా పెట్టేది. నాలుగైదు అడవి పూల మొక్కల్ని తెచ్చి గుడిసె వెనుక నాటింది. అవి పెరిగి, పూలు పూసి, పూలరెమ్మలు, గుడిసెలోకి,

తొంగి చూసి పచ్చగా నవ్వేవి. చామంతులంటే ఆమెకు బాగా యిష్టం. ఆమె తలలో ఎప్పుడూ చామంతులు కిల కిలలాడేవి. అందుకే ఆమెనందరూ 'చామంతీ' అని పిలిచేవాళ్ళు. గడప ముందు చామంతుల మొక్క నాటింది. అన్ని మొక్కలు ఎండిపోయినా, ఆ మొక్క మాత్రం మిగిలిపోయింది. ఒకసారి చామంతి మొక్క చుట్టూ పసిరిక పాము చుట్టుకొని పడుకొంది. ఆ పాము చాన్నాళ్ళు వీర కలలోకి వచ్చి భయపెట్టేది.

వీర తల్లి, అతనికెన్నో కథలు చెప్పేది. ఆ కథలన్నీ ఇప్పటికీ అతని కలల్లోకి వచ్చేవి. కలలో అతను ఒక్కడే అడవంతా తిరిగేవాడు. కొండలు ఎక్కి, చెట్టు, పుట్ట దాటి, నదిని దాటి, స్వర్గానికి వెళ్ళేవాడు. కలలో అతనో యాభైయేళ్ళ మనిషి. నెలల పాపను (అతని చెల్లి), కుందేళ్ళి, పిట్టని, ఆకాశాన్ని, అతను తరచూ కలల్లో చూసేవాడు.

వాళ్ళమ్మ మాటలు పిట్ట పాటల్లాగా గమ్మత్తుగా ఉండేవి. ఒక ఎండకాలం గుడిసె ముందు కూర్చుని, ఆమె దుంపల్ని కోస్తోంది. జుట్టంతా గాలికి రెపరెపలాడుతోంది. ఆమె తలలో ఎర్రటి పూలు ధగ ధగ మెరుస్తున్నాయి. చూస్తుండగానే ఒక్కసారిగా నేలపై పడింది వాళ్ళమ్మ. ఆమె చుట్టూ రక్తపు మడుగు. లోపలేదో చచ్చిపోయి, రక్తంగా బయటికొచ్చిందన్నారు. రక్తం ఆగలేదు. ఆమె నొప్పితో విలవిలలాడింది. ఎర్రటి సీతాకోకచిలుకలు వాళ్ళ గుడిసె చుట్టూ ఎగురుతూ కనబడ్డాయి. వీర భయంతో బిగుసుకుపోయాడా క్షణం. నెల రోజులకు గాని, ఆమె మామూలు మనిషి కాలేదు.

చిన్నప్పటి కలల్లో వీర ఎప్పుడూ మంత్రగాడయ్యేవాడు. వాళ్ళమ్మ కోసం, ప్రత్యేకమైన అడవిని సృష్టించేవాడు. అందులో, చిరుతలు, ఎలుగులు ఉండవు. ఫారెస్టు వాళ్ళు ఉండరు. అట్లాగే చెల్లెల్ని మళ్ళీ సృష్టించేవాడు. వాళ్ళిద్దరికి ఆకలి వెయ్యకుండా మంత్రించేవాడు. ఎన్నేళ్ళయినా వాళ్ళిద్దరు ఆహారం లేకుండా బతగ్గలరు. కల చివర్లో, అతనే వాళ్ళమ్మ అవుతాడు. తన్నుతానే పొదువుకొని పెద్దగా ఏడుస్తాడు.

కలలో అతను వేల సంవత్సరాలు వెనక్కు ప్రయాణించేవాడు. వందలాది చెంచు యువకులు, స్త్రీలు, పిల్లలు దుబ్బలు పట్టుకొని, దరువు వేసుకుంటూ, ఆనందంతో నాట్యం చేసే దృశ్యంలోకి వెళ్ళేవాడు. ఆ సంగతులన్నీ వాళ్ళమ్మే చెప్పేది.

అంకాళమ్మ శరీరంలో కదలిక ఆగిపోయింది. వీర పల్స్ చూశాడు. కనురెప్పల్ని తెరిచి చూశాడు. ఆమె చచ్చిపోయింది. వీర షాక్ తిన్నాడు."ఎందుకీ మరణాలు" అంటూ ముఖాన్ని చేతుల్లో పెట్టుకొని ఏడ్చాడు. మంతయ్య నిర్లిప్తంగా చూస్తున్నాడు. 'మిగిలిన నలభైఐదు మందిని తీసుకొస్తాను' అంటూ కొండవైపు వెళ్ళాడు.

పైన ఎర్రని ఎండని చిమ్ముతూ సూర్యుడు. అడవులు దుఃఖిస్తున్నట్లుగా రవ్వగాలి ఝుయ్‌మంటూ వీస్తోంది. కొర్రచేలు గాలికి ఊగుతున్నాయి. అంకాళమ్మ దేహం కొర్ర చేను భాగంలా కనిపిస్తుంది.

వీర, అంకాళమ్మ కోరినట్లే అడవిలోని సమస్తమైన ఆకుల్ని తెచ్చి, ఆమెపై అలంకరిస్తున్నాడు.

నలుగురే వచ్చారు అంకాళమ్మ చావుకు, నడికారు మనుషులు. పనులన్నీ వీరనే చేశాడు. వాళ్ళు ప్రేక్షకుల్లా చూస్తుండిపోయారు.

అంకాళమ్మ శరీరం భూమిలోకి వెళ్ళిపోయింది. మట్టితో కప్పినాక, వెదురు చెట్లను తెచ్చి దానిపై నాటాడు వీర. ఎవ

రికీ ఏడుపు రాలేదు. "దుఃఖం ఎందుకు రావటం లేదు. మనం ఎందుకు ఏడవటం లేదు" అన్నాడు వీర మంతయ్యతో. మంతయ్య యోగముద్రలో వీరవైపు చూశాడు. వచ్చిన నలుగురూ నిముషాల్లో వెనక్కు వెళ్ళారు.

4



ఎత్తైన కొండ. కొండ దిగువన చెట్లు. పొదల మధ్యన ఉంది. కాటమరాజు ప్రతిమ. ఒకనాటి మహావీరుడు. భూమి పట్టనంత గోసంపద ఉన్నవాడు. నెల్లూరు సీమను హడలెత్తించినవాడు. ఖడ్గతిక్కనను ఓడించిన యోధుడు. జనం కోసం కత్తి అంచుపైన శరీరాన్ని నిలిపి ప్రాణం త్యాగం చేసుకొన్న మహనీయుడు. ఈ నేలపై అడుగు పెడితే, శరీరం ఒక్కసారిగా ఝల్లుమంటుంది. మహావీరుడి గొప్ప త్యాగం తలపుకొస్తుంది. చైనీస్ సినిమాల్లోలాగా, గాలిలో కనపడని వేగంతో, ఒక మూర్తి అట్లా కళ్ళముందు ప్రత్యక్షం అయినట్లు, పదునైన కత్తి అంచు మనల్ని రాసుకుంటూ వెళ్లిన అనుభూతి. వేలాది ఆవులు, తెల్లని, నునుపైన స్పర్శతో, మన చుట్టూ మసలుతున్నట్లుగా ఉంటుంది.

దిబ్బ చుట్టూ కాటమరాజు విగ్రహం దగ్గరా, మనుషుల్ని అతికించినట్లుగా చెంచులు కూర్చున్నారు. నిస్సత్తువగా కదలిక లేకుండా పడి ఉన్నారు. గూడెం పెద్దలు ఒక మూలన కూర్చుని, వినబడని గొంతుకతో మాట్లాడుకుంటున్నారు. ఇదొక ఆశ్చర్యమే. మౌనం తప్ప, మాట్లాడుకోవటం ఇదే మొదటిసారి.

కొండ పక్కనున్న డొంకలోంచి ఒక జీపు ప్రత్యక్షమైంది. చెంచులందరూ జీపు శబ్దం వింటూనే ఉలిక్కిపడ్డారు. మళ్ళీ ఏదో ఆపద ఎదురైనట్లుగా, ముఖంలో భయం. జీపులోంచి రెవెన్యూ ఉద్యోగి, డాక్టరు, నలుగురు నర్సులు దిగారు. వాళ్ళను చూస్తూనే కేకలు, నిస్సహాయమైన అరుపులు. నర్సులు దగ్గర కొచ్చేకొద్దీ అలజడి ఎక్కువైంది. జీపులో వందకుపైగా సెలైన్ బాటిల్స్ ఉన్నాయి. ఒక్కొక్కరి దగ్గరికి వచ్చి, చేతుల్ని పట్టుకొని, ముంజేతి దగ్గర సూదిగుచ్చి, సెలైన్ బాటిల్ అమర్చే ప్రయత్నం చేశారు. సూదుల్ని పీకేసుకొని బాటిల్‌ని దూరంగా విసిరేస్తున్నారు. పిల్లలు, ఆడవాళ్ళు పెద్దగా ఏడవటం మొదలు పెట్టారు. రెవెన్యూ మనిషి పెద్దగా అరుస్తున్నాడు. "నా మాట వినండి అన్యాయంగా చచ్చిపోతారు. అలల సుందరంగారు మీ కోసం అన్ని ఏర్పాట్లు చేస్తున్నారు. మీ కోసం మార్కాపురం దగ్గర కొత్త కాలనీ శాంక్షను అయ్యింది. నెలకు సరిపోయే బియ్యం, వంట సామాను కూడా శాంక్షన్ అయ్యింది. నా మాట వినండి, అన్యాయంగా చచ్చిపోతారు."

చెంచులందరూ ఒక్కసారిగా లేచి నిలబడ్డారు. ముఖంలో తీవ్రత. అంత నీరసంలోనూ ముఖంలో క్రోధం. చెంచు పెద్ద ఏదో చెప్పాలని ముందుకొచ్చాడు. మిగిలినవాళ్ళు అతణ్ణి ఆపి, వెనక్కు లాగారు. రెండు చేతుల్ని గుండెలపై ముడుచుకొని, విగ్రహాల్లాగా నిలబడ్డారు. నలభై ఐదురాతి విగ్రహాల్లా. నర్సులు ఎంత ప్రయత్నించినా వాళ్ళ శరీరంలోకి నీడిల్స్ పంపలేకపోయారు. అర్ధగంటసేపు అక్కడే తచ్చాడి జీపు వెళ్ళిపోయింది.

కొద్దిగా నెమ్మదించి మళ్ళీ కొండ అంచుల దగ్గర కూలబడ్డారు. దూరానికి చిరుగుల గోసెనో, చీరనో, కప్పుకొన్న మాంసం ముద్దల్లా ఉన్నారు. ముఖాన్ని చూసి వయసు చెప్పలేని పరిస్థితి. ఎవరి ముఖంలోనూ వాళ్ళదైన పోలికలు లేవు. అందరిలో ఒకే పోలికలు. జీవం ఎండి పోయి, ఎముకలపై కప్పిన పల్చని తోలు మాస్కుల్లాగా ఉన్నారు. ఏ ఉద్వేగమూ కనబడదు. ఒట్టి చర్మాలు అవి. లోపల ఏ దుఃఖం, క్రోధం ఉన్నాయో మనకు తెలియని పరిస్థితి.

పొదల చాటునుండి పెద్ద కుండతో ప్రత్యక్షమయ్యాడు. మంతయ్య. పక్క గ్రామం నుంచి తెప్పించాడు. గవళ్ళ కుర్రాడొకడు మోసుకొచ్చాడు. గుప్పుమంటున్న వాసన. అప్పుడే కాసిన నాటు సారాయి.

కాటమరాజు దిబ్బముందు, మౌనతీవ్రతతో ఉన్న చెంచుల మధ్య, ఆ కుండ ఊరించే మోహినిలా ఉంది. మత్తుగొలిపే వాసన, అలలు అలలుగా ఆ ప్రదేశమంతా పాకిందా వాసన.

పదిహేనేళ్ళ కుర్రాడు ముందుగా కుండ వైపు వచ్చాడు. గ్లాసుతో ముంచుకొని గొంతులో పోసుకున్నాడు. వాడి ముఖంలో వెలుగు. మత్తు తల తిప్పి, కళ్ళు తిరిగి, ఇంకో గ్లాసు కోసం, కుండలో చెయ్యి పెట్టాడు.

ముసలి వాళ్ళలో కదలిక వచ్చింది. ఒకళ్ళిద్దరు వాళ్ళను ఆపారు. ఇప్పుడా అన్నట్లుగా చూశారు. ముఖాన్ని కిందకు దించుకొని, కళ్ళతోనే సమాధానం చెప్పి "ఒట్టి నీళ్ళే కదా" అన్నట్టుగా చూసి, కుండ వైపు కదిలారు. తలా రెండు గ్లాసులు తాగి మౌనంగా కొండ అంచు దగ్గరకు వెళ్ళారు. 'పోగొట్టుకున్న ఆత్మల శాంతి కోసం' అన్నట్టుగా ఉన్నాయి వాళ్ళ ముఖాలు. మిగిలిన వాళ్ళ దగ్గరకు మంతయ్య వెళ్ళి తనే వాళ్ళతోటి తాపించాడు. ఆడవాళ్ళు తాగిన వెంటనే మంత్ర జలం ఏదో మీద పడ్డవాళ్ళలా ఒక్కసారి ఏడుపు అందుకున్నారు.

పైన ఆకాశంలో నల్లటి మబ్బులు మూగాయి. కందిరీగల తుట్టలాగా, మబ్బులు కదులుతున్నాయి. కుండ చుట్టూ ఈగలు, ఘాటైన వాసన ఆ ప్రదేశమంతా వ్యాపించింది. తపస్సులో ఉన్న మునుల్లా, మహానిశ్శబ్దంగా ఉన్నారు చెంచులు- ఆ తరువాత రెండు మూడు గంటలు.

5



అలల సుందరం ఇవాళ్టి రాజకీయ నాయకులకు సరైన మోడల్. కరుణ, జాలి, ఉదారత లాంటి మాస్కులు ఎన్నైనా మార్చగలడు. మరుసటిరోజు ఉదయం పదిగంటలకు కాటమరాజు దిబ్బదగ్గర ప్రత్యక్షమయ్యాడు. కొత్త అలల సుందరం కంఠం, ఆహార్యం అన్నీ మారిపొయ్యాయి. కంఠంలో అధికారం, దర్పం లేవు. కళ్ళలో పొగరు, తెగింపు లేదు. గాంధీ మార్కు మాస్కును వేసుకొని అక్కడకు ప్రత్యక్షం అయ్యాడు.

వ్యాన్, రెండు జీపులు, ఏసి కారుతో సహా అక్కడ దిగాడు అలల సుందరం. పెద్ద రోడ్‌షో ఏర్పాటు చేశాడు. అడవిచెంచులుకాని పదిమంది చెంచుపెద్దలు, ఇద్దరు డాక్టర్లు, సైకియాట్రిస్టులు, జర్నలి

స్టులు, రచయితలు ఉన్నారు.

వస్తూనే వీరను పిలిచి, "ఎట్లా చెబితే వింటారు. నేను వాళ్లను కాపాడుకోవాలి" అన్నాడు నాటకీయంగా. వీరకు నవ్వు వచ్చింది. అభినయం చేస్తున్న నటుడు గుర్తుకొచ్చాడు. "అవసరమైతే లాకప్‌లో పెడదాం. సెలైన్ పెట్టిద్దాం" అన్నాడు.

గుడి బయట శరీరాల మూటల్లా ఉన్నారు చెంచులు. ఈ తమాషాను గమనిస్తున్నట్లు లేదు. వాళ్ళ లోకంలో ఉన్నారు. గుడిపైన రెండు జంగు పిల్లులు పోట్లాడుకుంటూనో, ప్రేమించుకుంటూనో పెద్దగా అరుస్తున్నాయి. అలల సుందరం విసుగ్గా వాటివైపు చూశాడు. పక్కనున్న తైనాతీలు వాటిని తరిమే ప్రయత్నంలో ఉన్నారు.

వీర అలల సుందరాన్ని అక్కడ చూస్తూనే ఏదో అపశకునాన్ని ఫీలయ్యాడు. ఈ మొత్తం విషాదం అతనికో వ్యాపారపు వనరు. అతనికి దుఃఖపు తడి అంటదు. మరణం, దుఃఖం ఇబ్బంది పెట్టవు.

జంగు పిల్లులు ఇంకా పోట్లాడుకుంటున్నాయి. జుట్టు విరబోసుకున్న దెయ్యాల్లా చెట్లు గాలికి అటూ, ఇటూ ఊగుతున్నాయి.

వందగజాల దూరంలో, ఖాళీ స్థలంలో, షామియానాలు కడుతున్నారు. అక్కడో రిలీఫ్ క్యాంప్ ఏర్పాటు చెయ్యబడుతోంది. మరోవైపు పెద్ద పెద్ద పొయ్యిలు వెలిగించి ఆహారం వండుతున్నారు. సన్నివేశమంతా సినిమాటిక్‌గా, జుగుప్స కలిగించేదిలా ఉంది. రచయితలు, డాక్టర్లు, చెంచు ప్రముఖులు బృందాలు, బృందాలుగా చీలి, చెంచులను కబుర్లలోకి దించుతున్నారు. ముందుగా తయారుచేసుకొచ్చిన స్క్రిప్టును బయటకు తీశారు. మొత్తం వాతావరణమంతా సినిమా లోని దృశ్యంలా ఉంది. వచ్చిన వాళ్ళను పట్టించుకోవటం మాని వేసి చెంచులు ఆకాశం వైపు చూడటం మొదలు పెట్టారు.

అలల సుందరం తీవ్రమైన పట్టుదలతో ఉన్నాడు. మీడియాలో పెద్ద పెట్టున దుమారం రేగింది. ఇదంతా అలలసుందరమే చేయించాడని రాశారు. ప్రతిపక్షాలు దీన్నో తీవ్రమైన అంశంగా తీసుకొన్నాయి. అసెంబ్లీలో చర్చ జరిగింది. అలల సుందరానికి తీవ్రమైన హెచ్చరికలు వెళ్ళాయి. అలల సుందరం ఈ కొత్త అవతారం వెనుక నేపథ్యం ఇదీ.

"వీర, చెప్పు. ఈ ప్రయత్నంలో, నేను విజయవంతం అవుతానా, లేదా? " అన్నాడు అతడి కళ్ళల్లోకి చూస్తూ.

"చెంచులు నాకు కొత్త కాదు. వాళ్ళ ఇళ్ళలో అన్నం తిన్నాను. కలిసి సారాయి తాగాను" అన్నాడు. జర్నలిస్టులు అన్నీ నోట్ చేసుకునే ఏర్పాటు చేశాడు.

మధ్యాహ్నం అయ్యింది. దూరంగా చేలపైన ఎండ మిలమిలలాడుతోంది. పొలం గట్లపై నిలబడి రైతులు, కూలీలు ఈ తమాషాను చూస్తున్నారు.

కారులోనే కూర్చుని అలల సుందరం వీరకు కబురు చేశాడు. "అన్నం, కూరలు రెడీ అయినాయి. క్యాంప్‌లో అన్ని సదుపాయాలు ఏర్పాటు చేశాము. ఎంఆర్‌ఓను దీనికి ఇన్‌చార్జిగా చేశాము. వాళ్లు కోలుకునేవరకు ఇక్కడే ఉండొచ్చు. వెళ్ళు, వాళ్ళకు అన్ని సంగతులు వివరించు. క్యాంప్ దగ్గరకు తీసుకురా" అన్నాడు మృదువైన కంఠంతో.

వీర ఈ ప్రతిపాదనకు ఒప్పుకోలేదు. "మీరే వెళ్ళి మాట్లాడండి" అంటూ సూచించాడు.

వీరవైపు కోపంగా చూసి, "ఎలాంటి వెధవవు నువ్వు? వాళ్ళందరినీ పూడ్చి పెట్టడానికి వాళ్ళ వెంట తిరుగుతున్నావా? " అని పెద్దగా అరిచాడు. (మాస్క్ విడిపో

తోంది) కంఠంలో క్రూరత్వం మళ్ళీ వచ్చింది. "ఎస్.పి.కి చెప్పి, లాకప్‌లో వేసి కుళ్ళ బొడిపిస్తాను" అని హూంకరించాడు.

మాస్క్ మళ్ళీ ధరించి చెంచుల దగ్గరకు వెళ్లాడు అలల సుందరం. గవర్నమెంటు ఎంక్వయిరీ కమిషన్ వేసిందని, పోలీసులపై చర్య తీసుకుంటారని, అన్ని సదుపాయాలు కల్పిస్తారని వాళ్లకు వివరించాడు. అతని మాటలేవీ, వాళ్లలోకి చేరుతున్నట్లు లేదు. వాళ్లు ఆహారాన్ని ముట్టలేదు. పునరావాస కేంద్రం (క్యాంప్)లోకి ప్రవేశించ లేదు. విసిగిపోయి, అసహనంగా పరమ క్రోధంగా అసలు ముఖంతో అక్కడ నుంచి వెళ్లిపోయాడు అలల సుందరం.

మధ్యాహ్నం మూడు గంటల వేళ, తప్పెట్లు, మేళాలతో పెద్ద ఊరేగింపు కాటమరాజు వైపు వచ్చింది. ముందుగా పట్టువస్త్రాలు కట్టుకొన్న వ్యక్తి, గుడి ముందుకు వచ్చి పసుపు కుంకుమలు వెదజల్లాడు. నూనెతో వెలిగించిన కాగడాను గుడి ముందర ప్రతిష్టించాడు. భుజాలపై మాయగోవును పెట్టుకొని ఊరేగిస్తూ వస్తున్నారు. ఆడవాళ్లు కుండలు నెత్తిన పెట్టుకొని వస్తున్నారు. డప్పుల శబ్దం మార్మోగుతోంది. గుడి దగ్గరకు వచ్చేసరికి డప్పుల శబ్దం, నాట్యం తీవ్రమైనాయి.

గుడి ఎదురుగా ఉన్న రాళ్ల గుట్టల మధ్య కూర్చున్న చెంచులు ఈ కార్యక్రమాన్ని నిర్లిప్తంగా చూస్తున్నారు. పరమ నాస్తికుల్లాగా, ఆ కార్యక్రమం వైపు చూడను కూడా లేదు. నిజానికి ఏ ప్రత్యేకమైన దేవుడూ వాళ్ల జీవితంలో లేదు. దేన్నీ పట్టించుకోని, నిర్వేదమైన జీవన తత్వానికి వారికి దేవుడు అవసరం అనిపించలేదు.



లోపల హారతులు వెలిగించి, పూజారిలాంటి మనిషి కాటమరాజు విగ్రహానికి నైవేద్యం పెట్టాడు. మాయ గోవును గుడిముందు దించి, అందరూ ప్రణమిల్లారు. ఉత్సవపు హడావుడి కొనసాగుతోంది. చెంచులందరూ ఒక్కసారిగా లేచి, గుడిపక్కనున్న కాలిబాట వైపు, కాటమరాజు కొండవైపు నడవటం మొదలెట్టారు. మంతయ్య, వీర వాళ్ల వెంట పరుగులు తీశారు.

## 6

అజ్ఞాత ఉద్వేగమేదో తోసుకురాగా, మోహిని ఒక ఉదయం కారులో మార్కాపురం బయలుదేరింది. ఎనిమిదో నెల కావడంతో శరీరం సహకరించడం లేదు. అయినా బయలుదేరింది. సగం దూరం ప్రయాణించాక మోహిని కాస్త ఆశ్చర్యపోయింది. తనేనా? అని ప్రశ్నించుకొంది. ప్రతి చర్యను ముందుగానే బేరీజు వేసుకొనే తనేనా అని విస్తుపోయింది. వీర అనే స్వప్నం ఆమెను ఎంతగా ప్రభావితం చేసిందో అర్థమైంది. ఆదివాసీ యువకుడు... రొమాంటిక్‌గా ఉండటం కూడా తెలియనివాడు... ఒక అర్ధ రాత్రి తన ప్రపంచంలోకి ఉన్మాదిలా చొరబడిన వ్యక్తి... అతని కోసమేనా అని ఆలోచించింది. వీర చూపిన ప్రేమ తడితడిగా ఆమెలో కదలాడింది. కానీ మోహినికి సెంటిమెంటులంటే చిరాకు. నిప్పుల్లో దూకే సాహసాలంటే చిరాకు.

మార్కాపురం వచ్చాక వీరకోసం ఎక్కడ వెతకాలో తెలియలేదు. అలల సుందరం దగ్గరకు వెళ్లటం ఇష్టం లేదు. తన సంస్థకు చెందిన కుర్రవాళ్లకు కబురు చేసింది. వాళ్ల గత పది రోజుల సంఘటనలన్నీ మోహినికి వివరించారు. ఏదో వింత అనుభూతి మోహినిలో. ఎన్నో ఉద్యమాల్ని చూసింది. బాధితులను కలిసింది.



నష్టపరిహారం అందుకోవటంతో ఉద్యమా లన్నీ ముగిసేవి. చెంచులు, వాళ్ల కథ... ఆమెకు ఆశ్చర్యంగా ఉంది. తడితడిగా, లోపల దిగులు ఆమెను చుట్టుముట్టింది. వాళ్ల సమస్య భౌతిక వనరులకు సంబంధిం చినది కాదనిపించింది. ఆత్మల విముక్తికి సంబంధించినదేమో అనిపించింది.

వీర కోసం మనిషిని పంపింది. ఎక్కడు న్నాడో వాళ్లకీ తెలియదు. చెంచుల వెంటనే అడవుల చుట్టూ తిరుతున్నాడని చెప్పారు. కాటమరాజు దిబ్బ దగ్గర సంగతులన్నీ ఆమెకు చెప్పారు.

చిన్న హోటల్‌లో అతని కోసం చూస్తోం ది- బరువుగా, ఆయాసంగా మోహిని. క్షణం సేపు తనపై తనకు కోపం, ఇట్లా అనాలోచి తంగా వచ్చినందుకు. అంతలోనే ఏదో ఇష్టంలాంటి భావన. ఈ వీర అనే వ్యక్తి చూపే నిబద్ధత, నిజాయితీ- ప్రేమలోనూ, పోరాటంలోనూ.

మధ్యాహ్నం రెండు గంటలకు వీర వచ్చాడు. నల్లగా కమిలిపోయాడు. శరీరం శుష్కించిపోయింది. యుద్ధభూమిలో గాయ పడిన సైనికుడిలా ఉన్నాడు. మోహిని కళ్లలో నీరు... "నా వీరా" అంటూ పిలి చింది. వీర చలించిపోయాడు. తల్లి చుట్టూ అల్లుకుపోయిన పిల్లవాడిలా.

"డీప్ షాక్‌లో ఉన్నారు చెంచులు. మనసు తిరుగుబాటు చేస్తోంది. మొండి తెగువ వాళ్లను పట్టుకొంది. చావుకు బతుక్కు పెద్దగా తేడా చూపని తెగ. దేని పైనా పెద్ద ఆశలు లేవు. పట్టి బంధించే ఏ అనుబంధాన్నైనా తిరస్కరిస్తారు. పెళ్ళి ప్రేమ ఆఖరికి చావు కూడా వాళ్లను ఇబ్బంది పెట్టదు. ఉద్వేగాన్ని ఖాళీగా పెట్టు కొని డొల్లల్లా జీవిస్తున్నారు. ఆకలి, ప్రాణాల్ని నిలబెట్టుకోవడం, ముఖ్యమైన విష యాలు కావు ఇప్పుడు. తిరిగి అడవుల్లోకి వెళ్ళాలనే కోరిక ఒక్కటే. అదో మొండి ఆలో చన. లేదంటే ఒక కోప తీవ్రత. వాళ్ళను మామూలు స్థితికి తెచ్చే ఏ ప్రయత్నమూ ఫలించటంలేదు. పైగా ప్రతీదీ రాజకీయ మైన చోటు ఇది. వాళ్ళందరి మరణాల్ని చూడాల్సి వస్తుందేమో అని భయం. వీర పెద్దగా ఏడవటం మొదలుపెట్టాడు.

తడితడిగా ఉన్న అతని ముఖాన్ని దగ్గ రకు తీసుకొని "నిజం వీరా, నీపై నాకింత ప్రేమ ఉందా అని ఆశ్చర్యమేస్తుంది" అంటూ అతణ్ణి ముద్దాడింది. "ప్రేమ కూడా తగు మోతాదులో ఉండాలని నమ్మేదాన్ని. కానీ ప్రేమ తప్ప ఇంకేదీ అవసరం లేదని పిస్తుంది" అంది నిజాయితీగా.

"నీ ప్రేమను ఒక ఇన్వెస్ట్‌మెంటుగా వాడు కున్నాను. ప్రాజెక్టు పనిలో నిన్నో పని ముట్టుగా వాడుకున్నాను. అఫ్‌కోర్స్ ఇది సిటీలో చాలా సహజమైన విషయం. అందుకే నీపైన కోపం వచ్చింది" అంది.

వీర ఛాతీపై పడుకొన్న మోహినికి గొప్ప శాంతిగా ఉంది. అట్లా సాయంకాలందాకా గడిపారు వాళ్ళిద్దరూ. ఈ పది రోజుల అనుభవాలన్నీ వివరించాడు మోహినికి. సాహస గాథలా తోచింది. తన ఉద్యమ రోజులు గుర్తుకొచ్చాయి. వాళ్ళు అట్లా కబుర్లు చెప్పుకుంటుండగానే చీకటి పడింది.

చాలాసేపు అయ్యాక మోహిని స్వప్న గురించి చెప్పింది- నిన్న సాయంకాలం తన చనిపోయిందని, బాత్‌రూమ్‌లో కూర్చుని బ్లేడ్‌తో, చేతిపై కోసుకొని, ఆత్మహత్య చేసు కుందని. ఆ సంఘటనను గంభీరంగా స్వీక రించిన మోహిని, ఇప్పుడు పొగిలి పొగిలి ఏడవటం మొదలుపెట్టింది. స్వప్నతో ఆమె జ్ఞాపకాలు ఒక్కొక్కటే ఏకరువు పెడుతూ ఏడవసాగింది. వీరకు కూడా ఏడుపు వచ్చింది. దేవతల చిరునవ్వులా ఉందే ఈ అమ్మాయి అనుకున్నాడు, ఆమెను చూసిన పుడు.

చాలాసేపు ఏడ్చాక, మోహినికెందుకో

ప్రశాంతంగా ఉన్నట్టనిపించింది. గుండెలపై నుండి బరువేదో దిగిపోయినట్లనిపించింది. చాలా రోజుల తరువాత ప్రశాంతంగా నిద్రపోయింది మోహిని. వీర ఒడిలో తల పెట్టుకొని నిద్రపోయింది. వీర నిద్ర లేకుండానే గడిపాడు. నిద్రపట్టిన క్షణాల నిండా దుస్వప్నాలే. చాలాసార్లు స్వప్న కలలోకి వచ్చింది. తగలబడుతున్న ఆకుపచ్చని తోటలు, కుందేలుగానో, పక్షిలాగో మారి ఆడుకుంటున్న స్వప్నను ఎవరో బాణాలతో వేటాడినట్లు, వీరకు ఆ రాత్రంతా యుద్ధకాండలాగా గడిచిపోయింది.

వీర నిద్ర లేచేసరికి మార్కాపురం దక్షిణంవైపు అడవుల్లోంచి పెద్ద మంటలు. వాటిల్లోంచి లేచిన పొగలు కనబడ్డాయి. అడవులు తగలబడుతున్నాయని వార్త వచ్చింది. మోహినికి గుడ్ బై చెప్పి వీర అడవులవైపు వెళ్ళాడు.

అడవి అంచుల్లో ఉన్న పచ్చిక, పొదలు మండుతున్నాయి. మంటలు చరచరా పాకుతూ కొండలవైపు లేస్తున్నాయి. గాలి పెద్దగా వీస్తోంది. మంటలు పైకి లేచి, కొండను ఢీకొని, మళ్ళీ వెనక్కు తిరుగుతున్నాయి. గాలి వేగానికి మంటలు సుడులు తిరుగుతూ అన్ని వైపులకూ ఎగబడుతున్నాయి.

అడవికి కిలోమీటరు దూరంలో ఆగాడు వీర. ఎటు చూసినా మంటలే. వేడిగాలులు బుసకొడుతున్నాయి. నాలుగు మైళ్ళ అవతల వెదురు వనాలు ఉన్నాయి. వాటికింకా నిప్పు అంటుకోలేదు. వెదురు వనాల పక్కన పెద్ద కుంట ఉంది. దాని ఒడ్డున కూర్చున్నారు చెంచులు. నిశ్శబ్దంగా, నిర్లిప్తంగా ఉన్నారు. మంటలు వాళ్ళనంతగా భయపెట్టలేదు. చెరువు గట్టుపైన వరుసగా పడుకొని ఉన్నారు. మంటల వేడికి అడవిలోని జంతువులన్నీ బయటికి వస్తున్నాయి.

"మంటలు ఇటువైపు వస్తే ప్రమాదం. వెదురు వనాలకు అంటుకుంటే ఇటు కూడా మంటలు వస్తాయి" అన్నాడు వీర, వాళ్ళ దగ్గరకు వెళ్ళి. చెరువు గట్టుపై పడుకొని, వరుసగా పేర్చబడ్డ మానవ హారంలా ఉన్నారు వాళ్ళు. మంటల వేడికి వెదురు వనాల్లోంచి పాములు బయటకు వస్తున్నాయి. పాములు చెరువుగట్టుపై పాకుతున్నాయి. అంత భయానకమైన వాతావరణంలో కూడా వాళ్ళు తమ మౌనాన్ని వీడలేదు.

మండుతున్న అడవి ఒక మెటాఫర్‌లా ఉంది అనుకున్నాడు వీర. 'ఇది చెంచుల శాపంలా ఉంది' అని కూడా అనుకున్నాడు.

నలభై ఐదుమంది చెంచుల్లో పెద్దవాడు పెదగురయ్య. అరవై యేళ్లకు పైనే ఉంటాయి. ఆయన లేచి, వెదురు కర్ర తీసుకొని, గట్టుపైకి పాకుతున్న పాముపిల్లల్ని చంపుతున్నాడు.

"ఈ అడవులు నాశనం అవుతాయి. మంటలు ఇట్లాగే శ్రీశైలందాకా పాక్కుంటూ వెళతాయి" పెదగురయ్య తనలో తాను గొణుక్కుంటు

**అడవి అంచుల్లో ఉన్న పచ్చిక, పొదలు మండుతున్నాయి. మంటలు చరచరా పాకుతూ కొండలవైపు లేస్తున్నాయి. గాలి పెద్దగా వీస్తోంది. మంటలు పైకి లేచి, కొండను ఢీకొని, మళ్ళీ వెనక్కు తిరుగుతున్నాయి.**

న్నాడు. "ఊళ్ళు తగులబడతాయి. గొడ్లు చచ్చిపోతాయి. భూములు పండవు. కరువులు వస్తాయి. నేల స్మశానం అవుతుంది" శాపం పెట్టినట్లుగా గొణుగుతున్నాడు గురయ్య.

చిన్నపిల్లలు వేడికి సొమ్మసిల్లిపోయారు. మంటలకు దూరంగా, పొలాల వైపుకు వెళదామని వీర అడిగాడు. పెదగురయ్య ఏదో ఆవేశం వచ్చిన వాడులా లేచి, కర్ర సాయంతో కుంటలో దిగాడు. ఎర్రటి మట్టి నీళ్ళు అవి. పెదగురయ్యతో పాటు అందరూ కుంటలోకి దిగారు. నీళ్ళను చీల్చుకుంటూ పెదగురయ్య, ఆయన వెనక మిగిలిన చెంచులు, నడవటం మొదలుపెట్టారు. హతాశుడైనాడు వీర. పెద్దగా కేకలు పెట్టాడు- అటు వెళ్ళవద్దని, మంటలు అటు వైపే పాకుతున్నాయని. నలభై ఐదుగురు చెంచులు కుంటను చీల్చుకుంటూ అటువైపు వెళుతున్నారు. వాళ్ళ మధ్య పాములు, అటూ ఇటూ ఈదుతూన్నాయి. వారు పది నిముషాల్లో కుంటను దాటారు. గట్టుపై నున్న వెదురు వనాల్లోకి అదృశ్యం అయ్యారు. వెదురు వనాల్లోంచి కొండవైపుకు నడవటం మొదలుపెట్టారు. వీర వాళ్ళ రూపాలు అదృశ్యం అవకుండా, వాళ్ళు వెళ్ళిన ప్రదేశాల వెంటనే నడుచుకుంటూ వెళ్ళాడు.

గాలి బలంగా వీస్తోంది. వెదురు వనాల్లోంచి చప్పుడు చేసుకుంటూ వెళ్ళింది. వెచ్చటి గాలులు శరీరాన్ని తాకుతున్నాయి. ఆరిన మంటల్లోంచి లేచిన పొగలు సుడులు సుడులు తిరుగుతూ గాలితోపాటు అన్ని దిశలకు ప్రయాణిస్తున్నాయి. చెంచులు వెదురుపొదల్ని కూడా దాటుకొని, కొండల మధ్య నుంచి నడుచుకుంటూ వెళుతున్నారు. వీరవాళ్ళ వెనకనే నడుస్తున్నాడు.

పెదగురయ్య పాదం, మోకాలివరకూ వాచి ఉంది. లోపలెక్కడో ఎముక విరిగినట్లుంది. ఆకుపసరు పిండబోయిన మంతయ్యను విసిరికొట్టాడు. పక్కనున్న పిల్లవాడిపై చెయ్యివేసి నడుస్తున్నాడు. తగలబడుతున్న అడవుల్లోంచి, కాలిన వాసనలు వస్తున్నాయి. "పాతిపెట్టబడ్డ శవాలు తగలబడుతున్న వాసన" అన్నాడు పెదగురయ్య.

నడుస్తూ, నడుస్తూ ఉడుముల లచ్చక్క ఆగమంటూ అరిచింది. "ఆ కాలంలో చనిపోయిన శిశువుల మృతదేహాలున్నచోటు ఇదే"నని అరిచింది. ఆమె కాలికి చిన్న కపాలం తగిలింది. అది శిశువుదో, జంతువుదో తెలియదు. పుర్రె కనపడినచోటను చూసి పెదగురయ్య ఉలిక్కిపడ్డాడు. భూమిని తవ్వి, ఆ పుర్రెను మళ్ళీ లోపల పూడ్చాలని ఆదేశించాడు. నేల తవ్వుతుంటే తుపాకులు, గ్రెనేడ్‌లు బయటపడ్డాయి. భయంతో కేకలు పెట్టారు పిల్లలు. ఇంకాస్త లోతుకెళితే, మావో రాసిన ఎర్ర పుస్తకం కనబడింది. పెదగురయ్య దాదాపు నడవలేని స్థితికి వచ్చాడు. మంతయ్య పసరు పూస్తున్నాడు గానీ అదేమీ పనిచేస్తున్నట్లు లేదు. వీర ఇంజక్షన్ ఇస్తానంటే 'వద్దు' అని తిరస్కరించాడు. అడవిలో మంటలు తగ్గాయి గానీ, పొగలు మాత్రం బుసబుస పొంగుతున్నాయి. ఆకాశం ఖాళీగా ఉంది.

పెదగురయ్య పెద్దగా పాడటం మొదలుపెట్టాడు. అది పాటలా కాకుండా ఆక్రోశంలా ఉంది. కొండల్ని పిండికొట్టగల శక్తిని చేతులకిమ్మని, అడవులన్నిటిపైనా అధికారాన్ని ఇమ్మని, మేకల్ని కాపాడమని, చిరుతల నుంచి, ఎలుగుల నుంచి రక్షించమని వేడుకొనే పాట.

ఇంకో పాట పెళ్ళిళ్ళలో పాడే పాట. పెళ్ళికూతురు అందాల్ని గుర్తు చేసుకుంటూ సాగే పాట. అవి పాటలే కావు, పెదగురయ్య తన జీవిత దశలన్నీ నెమరువేసుకుంటున్నట్టుగా ఉంది. వీర గొప్ప ఉద్వేగంతో ఆ పాటల్ని వింటున్నాడు. దిగులుగా సాగే ఇంకో పాట. వీర ఎన్నడూ వినని పాట.

## గోళ్లకొరుకుడుకి విరుగుడు

ఏమాత్రం టెన్షన్‌కు గురయినా, మనసు భారమైనా చాలామంది చేతిగోళ్లను నోటికి అప్పజెబుతారు. గోళ్ళు కొరకటం వలన ఆ టెన్షన్ భారం తగ్గకపోగా బాధలు పుట్టుకొస్తాయి. గోళ్లు కొరకడంవల్ల చుట్టూ ఉండే క్యూటికిల్ దెబ్బ తిని బ్యాక్టీరియా త్వరగా శరీరంలోకి చేరి జలుబు, ఫ్లూ వంటి వ్యాధులు వస్తాయి. ఇవన్నీ మనందరికీ తెలిసినా అలవాటులో పొరపాటులా గోళ్లు కొరకటం అసంకల్పితంగా చేస్తుంటారు.

గోళ్లు కొరకుండా ఈ టిప్స్ ఉపకరిస్తాయేమో... ప్రయత్నించండి. గోళ్లు కొరకకుండా ఉండడం కోసం యాంటీ నిబ్‌లింగ్ పాలిష్‌ను గోళ్లకు రాసుకోవాలి. ఇది చేదుగా ఉండటం వల్ల గోళ్లు కొరకటం క్రమంగా తగ్గుతుంది. మీ చేతిగోళ్లను అందంగా కత్తిరించుకుని శుభ్రంగా ఉంచుకుంటే, అందమైన గోళ్లని కొరకటానికి మనసొప్పక ఆ అలవాటు తగ్గుతుంది.

మీరు ఏదైనా మీటింగులోనో, ఆఫీసులోనో టెన్షన్‌గా ఉన్నప్పుడు తాత్కాలికంగా గోళ్లకు బ్యాండ్ ఎయిడ్ చుట్టెయ్యండి. అలాగే చర్మం రంగులో కలిసిపోయే పేపరు క్లిప్పులు ఇప్పుడు మార్కెట్లో ఉన్నాయి. వాటిని చుట్టెయ్యండి.



అలాగే చిక్‌లెట్ నమలటంవల్ల కూడా నోరు బిజీగా ఉండి గోళ్లు కొరికే ధ్యాస తగ్గుతుంది.

అక్షరాల్లో వివరించలేని పాట. పురా వీచిక అది.

కొండ పక్కనుంచి నలభై ఐదుగురు చెంచుల నడక సాగుతుంది. కుంటుతూ నెమ్మదిగా నడుస్తున్నాడు గురయ్య. నడుస్తూ నడుస్తూ పాటలు పాడుతున్నాడు. అవి పాటలే గానీ, డెలీరియంలా అనిపించ సాగింది. పాట తరువాత పాట. అవి ఒట్టి పాటలు కావు. చెంచు పురాణాలు. గురయ్య ముఖం ఎర్రగా అయి నిప్పుల మధ్య నడుస్తున్నవాడిలా ఉన్నాడు. గాయం చుట్టూ ఈగలూ, దోమలూ ముసురుతున్నాయి. గాయంలోంచి పసుపురంగు రసి ఉబికివస్తోంది. గాయం ఎర్రగా అయి, గ్యాంగ్రీన్ అయినట్లుగా తోస్తోంది. మంతయ్య నిముషానికి, నిమిషానికి ఆకుపసరు పూస్తున్నాడు గానీ, ఫలితం ఉన్నట్లు లేదు.

పెదగురయ్యా పాడుతూనే ఉన్నాడు. ఆపినా ఆగటంలేదు. ఇప్పుడాపాట డెలీరియంలో పాటలా ఉంది. భయం గొలిపే రుద్రగానంలా ఉంది. ఉండీ ఉండీ మధ్యలో పెద్దగా అరుస్తున్నాడు.

మంతయ్య కళ్ళలో భయం. "గురయ్యా" అంటూ భుజాలు పట్టుకొని ఊపాడు. పెద గురయ్య పట్టించుకోలేదు. "దబ్బల్ని పట్టండి, వేటాడండి" అంటూ అరుస్తున్నాడు.

మంతయ్య కళ్ళలో నీళ్ళు. ముఖం పాలిపోయింది. వీర నిస్సహాయంగా చూస్తున్నాడు. 'వెంటనే హాస్పిటల్‌కి తీసుకెళ్ళాలి, లేదంటే ప్రాణానికే ప్రమాదం' అని అందర్నీ

బతిమలాడుతున్నాడు. ఎవరూ పట్టించుకో లేదు. పెదగురయ్య పాట అవిశ్రాంతంగా సాగుతోంది. ఎక్కెడెక్కడి విషయాలో గుర్తుచేసుకొంటున్నాడు. ఆయన పాటలు పారవశ్యంలా ఉన్నాయి గానీ, నిజానికది డెలీరియమ్. కాలిగాయం సెప్టిక్ అయ్యింది. వీర ఎంత మొత్తుకొన్నా ఎవరూ పట్టించుకో వటంలేదు.

ఒకదానికొకటి అల్లుకుపోయి, ఎన్నెన్నో కథలు. విడదీయలేని దీర్ఘకథనంలా మారి పోయింది. పాదాల కింద తుపాకులు పూడ్చిపెట్టబడ్డ విషయాన్ని కూడా మాట్లాడు తున్నాడు. పిల్లల పెళ్ళిళ్ళ గురించి, అన్న లలో కలిసిపోయిన వాళ్ళ గురించి, మధ్యలో చావు గురించిన పాట. దబ్బుతో వేటను చంపటం దగ్గర నుంచి, పోలీసులు బాయ్‌నెట్లతో పొడిచి వెంటాడిన సంగతి వరకు అన్నీ గుర్తు చేసుకున్నాడు.

పెదగురయ్య కళ్ళు మగతకమ్మాయి. పాటలు పూర్తిగా బయటకు రావటంలేదు. సగం సగం జారిపోయి, కొన్ని పదాలు గొంతులోనే మరణించి, మాటలు జాలుగా అయిపోయి, అర్థంకాని అదృశ్యభాషలాగా మారిపోయి, అట్లానే నేలపై కూలిపో యాడు. పెదగురయ్య మరణాన్ని వెంటనే గుర్తుపట్టలేకపోయారు. శరీరం కట్టెలా బిగు సుకుపోయి, అతని ఆత్మ శరీరంలోంచి ఎగి రిపోయిన చాలాసేపటికి గాని, అతని చావును గుర్తు పట్టలేకపోయారు.

దుఃఖాన్ని ఎట్లా ప్రకటించాలో తెలియన ట్లుగా ఉండిపోయారు. భయంగొలిపే నిశ్శబ్దం. అందరూ బిగుసుకుపొయ్యారు. నుదుటిపై పదేపదే కొట్టుకుంటూ, గట్టిగా నిట్టూరుస్తూన్న వాళ్ళలో ఒకరికి, ఏడిస్తే హాయిగా ఉన్నట్టనిపించి, పెద్దగా ఏడవటం మొదలుపెట్టాడు. ఆ రహస్యాన్ని కనిపెట్టిన వాళ్ళల్లా, మిగిలిన వాళ్ళు కూడా ఏడవటం మొదలు పెట్టారు.

వీరలో దుఃఖం పొంగుకొచ్చింది. ఆ చని పోయిన మనిషి వ్యక్తిలా కాకుండా, ఒక చరి త్రలా తోచాడు. అరవై ఏళ్ళు పైబడ్డ చెంచు చరిత్ర విగతంగా నేలపై పడివున్నట్లు అని పించింది. చెట్ల మధ్యనుంచి, నోరెత్తి, హోరెత్తి ఏడుస్తున్నట్లుగా వీస్తోంది గాలి.




"వీర, భయం అంటే ఏమిటో తెలుసా? అదసలు మనలో ప్రవేశించిందనే విషయం కూడా మనకు తెలియదు. క్షణం సేపు గుండె టపటపా కొట్టుకొని, 'ఇంతలో ఉంది' అని మనం గాఢంగా నిట్టూర్చి దాన్ని మర్చిపోతాము. కానీ వెనకనుంచి దూకే పులిలా హఠాత్తుగా మనపై దాడి చేస్తుంది. గంభీరమైన ముఖం పెట్టి, ప్రపంచం వైపు నిర్లక్ష్యంగా చూసి, దాన్ని వదిలించు కొన్నామనుకుంటాము కానీ, అద్దాలగది మధ్యలో ముఖంలా, అన్నివై పుల నుంచి అది మనల్ని చూస్తుంది. అది ఎప్పటికీ వదలదు. పరిగెత్తి, పరిగెత్తి, పారిపోయి, పారిపోయి..."

అలల సుందరం మాటలు డాక్యుమెం టరీ చిత్రాల్లో వినపడే నేపథ్య స్వరంలా వినిపిస్తున్నాయి. గొప్ప తెలివితేటలతో మాట్లాడిన మాటలుగా అనిపిస్తాయి. తాలూకా ఆఫీసు అరుగుపై కూర్చుని భయం గురించి గొప్ప ప్రసంగాన్ని చేస్తున్నాడు అలల సుందరం. జీన్‌పాంటు, టీ-షర్టు, కరుకైన ముఖంతో ఉదయం నుంచీ అక్కడే కూర్చున్నాడు. కళ్లనిండా

నిర్లక్ష్యం. లోపలి ఆలోచనలు తెలియకుండా ఒక మాస్క్ అది. వీర నిర్లిప్తంగా ఆకాశంలోకి చూస్తున్నాడు. యుద్ధంలో ఓడిపోయిన సేనానిలా ఉన్నాడు.

"ఇదంతా వాళ్ళ మంచికే. నిన్న హ్యూమన్ రైట్స్ కమిషన్ వాళ్ళు వచ్చారు. నాలుగు జీపుల్లో అడవులన్నీ తిరిగారు. గూడాలకు వెళ్ళేరు. కూలిన గుడిసెల్ని చూశారు. రెండు రోజులపాటు చెంచుల్ని నిలబెట్టిన ఎర్రటి ఎండల మైదానాన్ని చూశారు. పాదలమాటున రక్తపు మరకల్ని చూశారు. చెంచులు ప్రయాణించిన చోట్లన్నీ చూశారు. చచ్చిపోయిన వాళ్ళను పూడ్చి పెట్టిన స్థలాలను కూడా చూశారు."

"కమీషన్ సభ్యులు నిప్పులు చెరిగారు. మానవ హక్కుల ఉల్లంఘనే కాదు. అతి కిరాతకమైన దాడిగా దీన్ని పరిగణించారు. నలభై ఎనిమిది గంటల్లో వాళ్ళకు పునరావాసం కల్పించాలని ఆదేశించారు. మొత్తం సంఘటనపై న్యాయ విచారణ జరిపించాలని ఆదేశించారు."

"అందులో భాగంగానే నిన్న అందర్నీ ఇక్కడకు తెచ్చాము. నాలుగువైపుల నుండి చుట్టుముట్టి, నేరస్థుల్ని తెచ్చినట్లు లారీలో తెచ్చారని పేపరువాళ్ళు అంటున్నారుగానీ, అదంతా నిజం కాదు. తప్పనిసరి పరిస్థితులలో నేను పోలీసుల సహాయం తీసుకొన్నాను. ముందు వాళ్ళని కాపాడాలి. చుట్టూ పోలీసుల వలయం, 'ఓపెన్ జైలు' అంటున్నారు గానీ, అదేదీ నిజంకాదు. ఇది పునరావాస శిబిరం. వాళ్ళు 'భయం' గుప్పిటలో చిక్కారు. వాళ్ళని భయం నుంచి బయటకు తేవాలి. నమ్మకం కలిగించాలి. ఈ మొత్తం ప్రాజెక్టును నేను పర్యవేక్షిస్తున్నా ను. వాళ్ళు ఆ షాక్ నుంచి వెలికి రావాలి. అవసరం అయితే బలప్రయోగం తప్పదు. ముందు ఆహారం తినేలా చూడాలి. వాళ్ళు బతకాలి. ఈ పునరావాస శిబిరం నుంచి వాళ్ళను ఎంత త్వరగా పంపగలిగితే అంతగా విజయం నాకు."

అలలు సుందరం కళ్ళు ఎగరవేస్తూ వీర వైపు చూశాడు. కాసేపాగి, లోగొంతుకలో "ఇప్పటికి ఇరవైనాలుగు గంటలు అయ్యింది. ఏ ఫలితం కనబడలేదు. ఈ సాయంకాలం సాక్షిగా చెబుతున్నాను. మొదటిసారిగా నాకెందుకో భయం వేస్తోంది. ఏమీ చెయ్యలేని నిస్సహాయ స్థితిలో ఉన్నాను. ఒక్కళ్ళతోటి అన్నం తినిపించలేకపొయ్యాను. లాఠీలతో కొట్టించాను. ప్రాణాలు తీస్తామని బెదిరించాను. ఏమీ లాభంలేదు" తలపైకెత్తి, ఆకాశం వైపు చూస్తూ "నా అంతరాత్మ నావైపు వెక్కిరింతగా చూస్తోంది. పొగరుగా ప్రవర్తించాననిపిస్తోంది" అన్నాడు, గట్టిగా నిట్టూర్చి

"ఇపుడు నువ్వు కావాలి. అందుకే నీకు కబురు పంపాను. వాళ్ళతో గడుపు. వాళ్ళను ఒప్పించు. ఇప్పుడిది నీ సమస్య. నీ జాతి సమస్య. వాళ్ళకు అన్నీ వివరించు. వాళ్ళని మరణంలోంచి రక్షించు" అన్నాడు వీర చేతులు పట్టుకుంటూ.

"రేపు హోం మినిస్టర్ వస్తున్నాడు. ఈ లోపల ఏదైనా అద్భుతం జరగాలి. వాళ్ళు ఆహారం తీసుకోవాలి" అలల సుందరం గొంతులో బతిమాలుతున్న ధోరణి ఉంది గానీ, కళ్ళలో ఒక తీవ్రత, బెదిరింపు కూడా ఉంది.

"నేను ప్రయత్నిస్తాను" అన్నాడు వీర. నిదానంగా వీర గేటు తెరుచుకొని, లోపలికి వెళ్లాడు. లోపల పదిమంది పోలీసులు, బల్లలపై కూర్చున్నారు. పక్కనే వెడల్పాటి ఖరీదైన షామియానా. షామియానాలోకి అడుగు పెడుతూనే హతాశుడయ్యాడు వీర. అతని లోపలి ప్రాణాల్ని ఎవరో రెండు

చేతులతో పిండినట్లుగా అనిపించింది. లోపల మృగాల మాదిరి పడుకున్నారు చెంచులు. ఓపిక లేనట్లుగా పడి ఉన్నారు. రెప్పల్ని పైకి లేపేంత ఓపిక కూడా లేదు. వండిన అన్నం, కూరలు పెద్ద పెద్ద గుండిగలలో నోరు తెరుచుకొని చూస్తున్నాయి. వేటాడిన మృగాల్లా పడి ఉన్న వాళ్లను చూసి దుఃఖ తీవ్రతను తట్టుకోలేకపోయాడు వీర. తల్లులు, తండ్రులు, అతని పూర్వీకులు, వీర ప్రాణాలు తోడేయబడ్డవాడిలా మూలనున్న ఎర్ర పట్టాపై కూలబడ్డాడు.

మెల్లగా శక్తిని కూడదీసుకొని మంతయ్య దగ్గరకు వెళ్లాడు. మోకాళ్లలో కాళ్లు పెట్టుకొని, శాపగ్రస్థుడిలా కూర్చున్నాడు పెద మంతయ్య. వీర వైపు సూటిగా చూశాడు. మొల చుట్టూ సన్నని పోగు తప్ప శరీరంపై ఏ ఆచ్ఛాదన లేదు. ఆయన చుట్టూ ఈగలు, దోమలు, వలయాలుగా తిరుగుతున్నాయి. మంతయ్య వీర వైపు సూటిగా చూస్తున్నాడు. గాయపడ్డ ఆత్మలాగా ఉందాయన రూపం.

"అయ్యా, ఏం చేద్దాం" అన్నాడు వీర, వణుకుతున్న గొంతుతో. మంతయ్య మాటలన్నీ మరిచిపోయినవాడిలా, వీర వైపే చూస్తూ ఉండిపోయాడు.

"అయ్యా, ఏం చేద్దాం" అన్నాడు వీర మళ్లీ. మంతయ్య నీరసంగా ఉందంటూ సైగజేసి నేలపై పడుకున్నాడు.

"బాగాలేదా" అన్నాడు వీర, తలపైన చెయ్యి వేస్తూ. చుట్టుపక్కల చప్పుళ్లు వినిపిస్తున్నాయి. నీరసపు మూలుగులు.

పీడకలలోకి మేలుకొన్నట్లుగా ఉందా దృశ్యం.

తప్పు చేసినవాడిలా ఆయనవైపు చూశాడు వీర. "రెండు మెతుకులు తింటే ఇక్కడ నుంచి బయటపడొచ్చు" అన్నాడు వీర. "చత్" అంటూ ముఖం తిప్పుకున్నాడు మంతయ్య. "చచ్చిపోవటమేనా? అందరూ ఇట్లా చచ్చిపోవటమేనా? " అంటూ పెద్దగా అరిచాడు వీర. అరుపు కాదది ఏడుపు.



చాలా సేపు ఏడ్చాడు వీర గుండెలవిసేలా. కాసేపు అక్కడ నిశ్శబ్దం.

'ఎందుకు ఏడ్చేది? ' అన్నట్టుగా చూశాడు

మంతయ్య. 'ప్రపంచానికి మనం తీర్చా ల్సిన బాకీ ఏం లేదు' అన్నట్లుగా ఉన్నాయి ఆయన చూపులు.

యూనివర్సిటీ తరగతి గదులు గుర్తుకొ చ్చాయి వీరకు. అతను చదువుకొన్న సామాజిక శాస్త్రం గుర్తుకొచ్చింది.

'ఇన్ని పుస్తకాలు, ఇన్ని పాఠాలు ఏవీ నా చెంచు సమాజాన్ని అర్థం చేసుకోడానికి ఉపయోగపడలేదే' అనుకున్నాడు.

'జీవితంపై ఇంత నిర్లిప్తమైన ధోరణి ఎందుకొచ్చింది. సహ జంగా భయస్తులు, అనుకునే వాళ్లలో ఇంత మొండితనం ఎలా వచ్చింది? పెళ్ళి, చావు, స్నేహం, అను బంధం లాంటి ఏ సూత్రాలకు కట్టుబడరని చెప్పుకొనే వీళ్లలో ఇంత కఠినమైన నిర్ణ యాలు తీసు కునే శక్తి ఎలా వచ్చింది' వీర తనలో తాను తర్కించుకు న్నాడు.



వెళ్లి, వాళ్ల పాదా లపై బడి 'చెప్పండి మిమ్మల్ని మీరు ఎరుకపర చుకోండి' అని అడగాలనిపిం చింది వీరకు.

పెదమంతయ్య వైపే చూస్తూ ఉండిపోయాడు వీర. అక్కడ ఉన్నవాళ్లలో వృద్ధుడు ఆయనే. యుద్ధానం తర వాతావరణంలా ఉంది ఆ ప్రదేశం. వందలాది ముక్కలుగా ఛిద్రమైన ఆత్మలు, నేల అన్ని వైపులా వెదజల్లబడినట్లుగా. ఈ

ముక్కల్ని అతికించగలమా? అని దుఃఖిం చాడు వీర.

పెదమంతయ్యా తలపై రెండు చేతుల్ని పెట్టుకొని కూర్చున్నాడు. అప్రయత్నంగా ఆయన కళ్లవెంబట నీళ్లు కారుతున్నాయి. కళ్లు రెండూ మూసుకున్నాడుగానీ, లోపల నుండి ధారలాగా కన్నీళ్లు ప్రవహిస్తు న్నాయి. మూసుకున్న కళ్ల వెనుక ఏ కల నిర్మాణం అవుతోందో?

"పుగాకు ఇయ్యి" అన్నాడు వీరవైపు చేయి సాచి. సిగరెట్టు ఇచ్చాడు వీర. చాలాసేపు నిశ్శబ్దం. బయటనుంచి పన్నెండు గంటలు కొడుతున్న గడియా రపు చప్పుడు. రోడ్డుపైన బస్సులు, లారీలు వెళుతున్న చప్పుడు. తాలూకా ఆఫీసు ముందు మూగిన జనం. ఆశ్చర్యంగా గోడ లపై నుంచి తొంగి చూస్తున్నారు.

ఉండీ ఉండీ తలపై టప్పున కొట్టుకు న్నాడు పెదమంతయ్యా. లోలోపల ఏదో గొణుక్కున్నాడు. 'ఎవర్నీ చంపలేదు. ఏ పాపం చెయ్యలేదు. అడవి దాటిపోలేదు. ఎందుకిట్లా అయ్యింది' అన్నట్టుగా ఉన్నాయి ఆయన చూపులు.

సిగిరెట్టు పొగను గాఢంగా పీల్చుకొని వదిలి, "అయితే అందర్నీ చంపుతారా?" అన్నాడు వీర కళ్లలోకి చూస్తూ. ఆ కళ్లలో భయం ఉంది. "వీర" అన్నాడు వణుకు తున్న గొంతుకతో.

పసుపుపచ్చ రంగులో ఉన్నాయి సూర్య కిరణాలు. కాంతివలయం అన్ని వైపుల నుంచి చుట్టుముట్టినట్లుగా ఉంది. రోడ్డు పక్కన ముసలి బిచ్చగాడెవరో ఫ్లూటు వాయిస్తున్నాడు. తెరలు తెరలుగా కమ్ము కుంటోందా పాట. మోసుకెళుతున్న మల్లెల బుట్టలోంచి, గుప్పుమంటూ మధు రమైన వాసన. మల్లెల వాసన, ఫ్లూటు పాట- రెండూ కలిసి, మాయ తెరలా కమ్ముకున్నాయి ఆ ప్రదేశాన్ని.

నేలపై తలవాల్చి పెదమంతయ్యా, ఏం చేస్తున్నాడో అర్థం కాలేదు. భూమితో ఏమైనా చెప్పుకుంటున్నాడా?

"వీర, ఇక్కడ నుంచి వెళ్లిపోవాలి" అన్నాడు తల పైకెత్తకుండానే.

పెదమంతయ్యా లేచి నిలబడ్డాడు. వీర వైపు ప్రశాంతంగా చూస్తూ 'నిన్ను నమ్మ వచ్చా' అని కళ్లతోటే ప్రశ్నించి, 'హూ' అని నిట్టూర్చి, శరీరంలోకి బలం తెచ్చుకొని, షామియానా చీల్చుకొని బయటకు నడి చాడు. అధాట్టున గోడకు ఆనించిన కాని స్టేబుల్ తుపాకిని చేత్తో అందుకున్నాడు. ఒక్కసారిగా కలకలం. పోలీసులు హతాశు లైనారు. ఎలర్ట్ అయి, విజిల్స్ ఊదారు.

పెదమంతయ్యా కళ్ళు ఉగ్రంగా ఉన్నా యి. పూనకం వచ్చినవాడిలా, మండు తున్న కళ్ళను అన్ని వైపులకు తిప్పాడు. "తుపాకి అక్కడ పెట్టు, పేలుద్ది" అంటూ బయట నుంచి అరుపులు, యూనిఫారాల పోలీసులు భయంతో దూరం జరిగారు. వీర శరీరం భయంతో వణికింది. ముఖం నిండా చెమట.

అలల సుందరం సైగ చేస్తున్నాడు. తు పాకీ, అతని చేతుల్లోంచి లాక్కోమని. అతని ముఖం వింతగా ఉంది. వెర్రిచూ పులు చూస్తున్న విదూషకుడి ముఖంలా ఉంది.

పెదమంతయ్యా చెప్పు, ఏం చేస్తావు. ఈ తుపాకితో ఏ విముక్తిని తెస్తావు. అయ్యా, చెప్పు స్వామి, ఏ శత్రువుని చంపుతావు. సింహం పంజా దగ్గర తల పెట్టుకొని బతుకుతున్నాము. సింహం తలను పేల్చే యగలవా?

తుపాకీ పైకెత్తి, తళతళ లాడుతున్న బాయ్‌నెట్‌ని రెండు మూడుసార్లు తుడిచి, పెద్దగా కేకవేసి, ఒక్కసారిగా బాయ్‌నెట్‌ని

తన శరీరంలోకి పొడుచుకున్నాడు. రక్తం ఎగజిమ్మింది. 'అయ్యా, మంతయ్య' అరుపులు ఆకాశంలోకి లేచాయి.

ఎటు చూసినా రక్తం. చావు వాసన. ఎర్రగా మడుగులు మడుగులుగా రక్తం. ఆ ప్రదేశమంతా పాకిన చావు.

దీనినుంచి ఎవరిమైనా తప్పించుకు పారిపోగలమా?

సముద్రంలో హోరెత్తినట్లుగా గొల్లుమన్నారు చెంచులు. అటూ ఇటూ భీతావహంగా పరిగెత్తుతూ, పలచని నూలుపోగు చుట్టుకొన్న శరీరాలు, మట్టి, ధూళి నిండిన శరీరాలు- ఆ శరీరాల్లో శక్తి లేకున్నా, అలల్లా, పెదమంతయ్య శరీరం చుట్టూ మూగారు. మానవ సముద్రంలా ఉద్రేకంతో ఎగిసిపడ్డారు. ముందుకు, వెనక్కు ఒకళ్ళనొకళ్ళు తోసుకుంటూ, మహా ఆపద తరుముకురాగా నిస్సహాయంగా పరిగెడుతున్నట్లు, నెట్టుకుంటూ, తోసుకుంటూ, తొక్కుకుంటూ, గొంతులు అలిసిపోయేలా అరుస్తూ, తలలు ఆకాశం పైకెత్తి, గుండెలు బాదుకుంటూ...

తొక్కిసలాటలో షామియానా కూలిపోయింది. సమస్త బంధాల్ని తెంచుకున్నట్లుగా అటు ఇటు, అన్ని వైపుల నుంచి, సముద్రంలా ఎగబడుతున్నారు చెంచులు. ముందున్న వాళ్ళను తొక్కుకుంటూ, వెనక నుంచి అరుస్తూ, భయంతో అరుస్తూన్నారు.

ఈ హడావుడి చూసి, పోలీసులు ఎలర్ట్ అయ్యారు. ఒక్కొక్కళ్ళే ఆయుధాలతో లోపలికి వస్తున్నారు. ఊరి జనం కూడా గేటు తోసుకొని లోపలికి వస్తున్నారు. బారికేడ్‌లా కట్టిన బొంగులు కూలిపోయాయి. "ఎవరూ లోపలికి రావద్దు" అంటూ పోలీసులు మైకులో అరుస్తున్నారు. వినిపించుకునే పరిస్థితి లేదు. ఏదో ఉపద్రవం జరిగినట్లు జనం లోపలికి తోసుకొస్తున్నారు.

ఆ ప్రదేశమంతా శబ్దమయంగా ఉంది. సరికొత్త భాష. తెలుగే గాని యాసలో ఉంది. ఒట్టి జ్ఞాపకాలే కాని, ఏడుపుతో కలిసిపోయి కొత్త భాషలా ఉంది. అర్థంకాని శాపంలా ఉంది.

అలల సుందరం ముఖంలో ఆందోళన స్పష్టంగా తెలుస్తోంది. అక్కడ నుంచి పారిపోవాలని ఉంది. ఈ పరిస్థితి అంతా అతని రచనే, కానీ ఒప్పుకోడు. అతని ముఖంలో పశ్చాత్తాపం కన్నా విసుగే కనిపిస్తోంది. జర్నలిస్టులు చేరారు. ఫోటోలు, ఫ్లాష్‌లు.

"లాఠీ ఛార్జీ చెయ్యండి. వాళ్ళను శవం దగ్గర నుంచి లాగివెయ్యండి" పోలీసు అధికారి అరుస్తున్నాడు. అయితే పోలీసులెవరూ సాహసం చెయ్యలేకపొయ్యారు. నిస్సహాయంగా నిలబడిపొయ్యారు.

వీర ఈ తొక్కిసలాటలో రెండుసార్లు కిందపడ్డాడు. వింత మానసిక స్థితి. అజ్ఞాత శక్తులేవో, అన్ని వైపుల నుంచి మూగినట్లు. అతడికి తెలియకుండానే పడ్డాడు. అది మామూలు ఏడుపు కాదు. శక్తి



**ముందుకు, వెనక్కు ఒకళ్ళనొకళ్ళు తోసుకుంటూ, గొంతులు అలిసిపోయేలా అరుస్తూ, తలలు ఆకాశం పైకెత్తి, గుండెలు బాదుకుంటూ... మానవ సముద్రంలా ఉద్రేకంతో ఎగిసిపడ్డారు.**

వంతమైన రోదన. లోపలి నుంచి, జ్ఞాప కాల భూముల్లోంచి, మహావేగంతో, చలించే ఉప్పెన లాంటి రోదన. మర్యాదపూర్వకమైన ఆహార్యపు చర్మాన్ని చీల్చుకొని అతనిదైన, అతి పురాతన, ఆటవిక స్మృతిలోంచి, గాయ పడ్డ వేటగాడి అరుపులాంటి, యోధుడి అల సటలాంటి రోదన. సమస్త శరీరం, శక్తులు ప్రకంపనం చెంది, గుండెలు అవిసేలా ఎగి సిన రోదన.

గుంపులోంచి బయటపడి, ఒక చెంచు ముసలమ్మ "అయ్యా రా, నన్ను కూడా పొడిచెయ్యి" అంటూ పోలీసు వైపుకు దూసుకెళ్ళింది. అతని తుపాకీ లాక్కోబో యింది. కానిస్టేబుల్ తుపాకీ మడంతో ఆమెను తోసివేశాడు. నాలుగు అడుగులు దూరానికి ఎగిరి పడింది. "చంపండయ్యా, చంపండి" అంటూ మట్టిని ఎత్తుకొని, నెత్తి పైన పోసుకుంది.

సుమారు గంటదాటినా పెదమంతయ్య చనిపోయి. గంటకుపైగా సాగింది. దుం ఖపుహోరు.

హఠాత్తుగా పదిహేనేళ్ళ చెంచుకుర్రాడు పెదమంతయ్య శరీరాన్ని భుజానికి ఎత్తు కొని, జనాన్ని చీల్చుకొని రోడ్డుపైకి పరిగె త్తాడు. ఆ కుర్రాడి వెంటనే సముద్రం కది లినట్లు చెంచులందరూ పరిగెత్తారు. పోలీ సులు కోపంతో వాళ్ళ వెంట పరిగెత్తారు. అలల సుందరం వాళ్ళకు సైగ చేశాడు. పోలీసులు వెనక్కు తగ్గారు.

ఏడుపులు, అరుపులు ఇప్పుడు రోడ్డె క్కాయి. గోడలు, చెట్లు, వీధులు, మల్లిఖా ర్జునస్వామి గుడి, ఆసక్తిగా చూస్తున్న ముఖాలు, కార్లు, బస్సులు, చిత్తడిగా ఉన్న మధ్యాహ్నం, ఒంటరి పొదలు, చెట్లు, ఇళ్లు, అన్నింటినీ దాటుకుంటూ ఎక్కడినుంచో ఊడిపడ్డ దృశ్యంలా, శవంతోసహా పరిగె త్తుతున్నారు చెంచులు.

సముద్రం కదులుతున్నట్లుగా ఉంది. సన్నటి ఎముకల శరీరాలు ఒకదానితో ఒక టి కలిసిపోయి, వందలాది తలలున్న ఒకే శరీరంలా, ముందుకు పరుగెడుతు న్నారు.

**8**



**చ**నిపోవటమనే వాస్తవం, చెంచుల్ని ఎప్పుడూ భయపెట్టలేదు. జరగాల్సినదేదో జరుగుతున్నట్లు జీవన క్రియలో భాగం అన్నట్లుగా మారిపోయింది. బహుశా ఆత్మలు మొద్దుబారటం, ఉద్వేగాలు ఖాళీచేసి వెళ్ళిపోవటం ఇదేనేమో.

ఎదురైన నాలుగు మరణాలు వీర మర ణాల్లాగే అనిపిస్తున్నాయి. బహుశా ఈసారి ఎదురు కాబోయే మరణానికి ఎవరూ పెను కేకలు వేసుకుంటూ, గుండెలు బాదుకుంటూ ఏడవరేమో. ఎండ కాసినంత సహజంగా మరో మరణం ఏర్పడవచ్చు తరువాతది ఆకలి చావా, బుల్లెట్టా, బాయ్‌నెట్టా అనేది ఎదురు చూడాల్సిన సంగతి.

మార్కాపురం శివార్లలోని పొలాల మధ్య నలభై ముగ్గురు చెంచులు విడిది చేసి ఉన్నారు. పెదమంతయ్యది సహజ మరణం గానే ధ్రువీకరించారు. ఆయన్ని ఖననం చేశాక చెంచులందరూ ఆ ప్రదేశంలోనే కూలబడ్డారు. వీర అవసరమైన సారాయి తెప్పించాడు. ఎవరూ తిరస్కరించలేదు. రోజంతా నిద్రపోతూనే ఉన్నారు.

ఆ ప్రదేశానికి మూడు నాలుగువందల

కిలోమీటర్ల దూరంలో మేధావులు, పౌరహక్కుల సంఘంవాళ్ళు, విద్యార్థులు ధర్నాలు, ఊరేగింపులు, నిరసన యాత్రలు చేశారు. ఎప్పటిలాగా ప్రభుత్వం మరో న్యాయవిచారణ కమిటీ వేసింది.

ఇన్నిరోజుల తరువాత, వాళ్ళకు ఆకలంటే తెలుస్తోంది. కడుపులో విపరీతమైన బాధ. వీర తన ప్రయత్నంగా ఆహారాన్ని తెప్పించి ఉంచాడు. అయితే, ఆహారాన్ని మర్చిపోయినవాళ్ళలాగా, దాన్నెవరూ ముట్టుకోలేదు.

హఠాత్తుగా ముప్ఫయ్యేళ్ళ మనిషి పోతయ్య దూరంగా గట్టుపైన కూర్చున్న వీర దగ్గరకు వచ్చి, ఈడ్చి చెంపమీద కొట్టేడు. డొక్కలో తన్నాడు. కాలును పొట్ట పైన పెట్టి తొక్కాడు. ముఖంపై తుప్పుమని ఊశాడు. చొక్కా పట్టుకొని పర్రుమని చించాడు. వీర ఏ ప్రతిఘటనా చూపలేదు.

ఆ సంఘటన తరువాత వీరలో కొత్త ఉత్సాహం. చెంచు సమాజంలో కొత్తగా పుట్టినట్లుగా అనిపించింది. అతనిలో కొత్త కల ప్రాణం పోసుకొంది. వాళ్ళందరినీ నడిపించుకొని, కూలిపోయిన చెంచుగూడెం వైపుకు ప్రయాణించాలని, నిషేధాల్ని పట్టించుకోకుండా అడవిని ఆక్రమించుకోవాలని.

గట్టుపైన పడుకున్న వీరకు దూరంనుంచి సీతాకోక చిలుకల గుంపు ఎగురుతూ రావటం కనిపించింది. పక్కనున్న జనుము చేల మీంచి వస్తున్నాయి. సన్నటి నీటిధార తాలుకు వాసన ముక్కులకు తగిలింది. వీర పక్కనుంచి తొండ ఒకటి నాలుకను బయటపెట్టి ఆడిస్తూ సర్రుమంటూ ముందున్న పొదల్లోకి దూకింది. సీతాకోకచిలుక గుంపు దగ్గరైంది. రంగుల తెర, భూమికీ, ఆకాశానికీ మధ్య కదులుతున్నట్లుగా ఉంది. అవి వాళ్ళు కూర్చున్నవైపే వస్తున్నట్లున్నాయిగానీ చాలా సేపటినుంచి, అక్కడే నిలబడినట్లనిపించింది. అది రంగుల భ్రమేమో అనుకున్నాడు వీర. కానీ, నిజంగానే సీతాకోకచిలుకల గుంపే. అవి అటూ ఇటూ కదులుతూ, రంగుల దారాలతో కలల్ని అల్లుతున్నట్లుగా ఉంది. అవి దగ్గరకు రాబోతున్నంతలో, ఆకలి బాధతో లచ్చక్క పెద్దగా ఏడవటం మొదలు పెట్టింది. మిగిలిన వాళ్ళలో ఏడుపు కాదు గానీ, సన్నని మూలుగులాంటి అరుపులు ఆ ప్రాంతాన్ని గందరగోళం చేశాయి. సీతాకోక చిలుకలన్నీ ఎగిరిపొయ్యాయి భయంతో.

వీరాలో సీతాకోకచిలుకలు మిగిల్చిన రంగుల భ్రమ అట్లాగే వెంటాడుతోంది. ఒక్క సీతాకోక చిలుకైనా అక్కడ మిగిలి పోతే బాగుండు అని ఆశపడ్డాడు.

## ౨

చెంచులలోకెల్లా అత్యంత వృద్ధుడు ఆయన. ఉడుముల బయ్యన్న. డెబ్బైయేళ్ళకు పైనే ఉంటాయి. బాగా వంగిపోయి ఉన్నాడు. టౌన్‌హాలు గేటు బయట రాయి పై కూర్చున్నాడు. దీర్ఘాలోచనలో ఉన్నాడు.



**చెంచులలోకెల్లా అత్యంత వృద్ధుడు ఆయన. ఉడుముల బయ్యన్న. డెబ్బైయేళ్ళకు పైనే ఉంటాయి. బాగా వంగిపోయి ఉన్నాడు. టౌన్‌హాలు గేటు బయట రాయి పై కూర్చున్నాడు.**

చెంచు పరిరక్షణ సంఘటన పేరుతో మార్కాపురంలో ఏర్పాటు చేసిన మీటింగ్. ముఖ్యమైన మీటింగ్, ఒక గంట వచ్చిపో. ఎమ్మెల్యేలు, నాయకులు, చెంచు ప్రముఖులు వస్తున్నారు. గవర్నమెంటుమీద వత్తిడి తెచ్చి ఒక నిర్ణయాన్ని తీసుకునేలా చేద్దాం అంటూ ఉదయాన్నే అలల సుందరం కబురు చేశాడు. శ్రీశైలంలో ఉదయం అయి

దుకు బయలుదేరాడు.

హాల్లో నాయకులెవరూ లేరు. చెంచు కుర్రాళ్ళు, ముఖ్యంగా ఐటిడిఎలో పనిచేస్తున్న టీచర్లు ఉన్నారు లోపల.

లోపల వికృతమైన సినిమా పాటలు విని పిస్తున్నాయి. బయట చిత్తడిగా ఉంది. రోడ్డుపై గుంపుగా వెళుతున్న పశువుల మంద. రిక్షాలు, ఆటోలు, గాలిలో పేడ వాసన, కుళ్ళిన కూరగాయల వాసన... బయ్యన్న పొగాకు నములుతూ కూర్చు న్నాడు. ఆయనకు వినికిడి కాస్త తక్కువ. గాఢమైన దుఃఖం ఉన్నవాడిలా ముఖం కుం చించుకుపోయింది. నుదుటిపై అనుభవాన్ని తెలిపే గీతలు, ఆయన సుదీర్ఘమైన చెంచు చరిత్రకు సాక్షి. ఇవాళ ఈ పరిస్థితి రావటం ఆయన గుండెల్ని పిండిజేస్తోంది. మాటిమా టికీ కళ్ళు తడుచుకుంటున్నాడు. యుద్ధం ముగిశాక మరణించిన బంధువుల గురించి తెల్సుకోడానికి వచ్చినవాడిలా ఉన్నాడు.

వీర చాలాసేపటి నుంచి ఆయన్ను గమ నిస్తున్నాడు. ముఖ్యంగా ఆయన కళ్ళు తుడు చుకోడాన్ని. వెళ్ళి ఆయన పక్కనే కూర్చుని ఆయన చేతిని చేతిలోకి తీసుకొని, "అయ్యా నువ్వు నాయకుడివి. నువ్వే అట్లా దిగులుపడితే ఎట్లా!" అన్నాడు వీర.

చటుక్కున తల పైకెత్తి, తలవైపు చూసి, "ఇదిగో పులితో పోట్లాడినప్పుడు అయిన గాయాలు, పన్నెండేళ్ళప్పుడే పులితో కలబ డ్డాను. బ్రిటీషోడి టయం అది" అన్నాడు కోపం నిండిన గొంతుతో. "ఐటిడి ఆఫీ సర్లంతా ముందు నా దగ్గరికి వచ్చేవాళ్ళే. శాస్త్రిగారని పదేళ్ల కిందట ఉండేవాడు. ఆయన నన్ను 'నాయనా' అని పిలిచేవాడు. ఆయన కాలంలోనే అడవుల్లోంచి బయటకు వచ్చాము. చెంచుల్లోనే గుండెకాయ ఉన్న వాడివి అనేవాడు. నలభై ఏళ్ల క్రితం, ఈ మార్కాపురంలో శ్రీశైలం గుడిమీద పెద్ద గొడవైంది. నలభై మందిని జైల్లో పెట్టారు. మల్లయ్యకు చెంచులే పూజ చెయ్యాలని నేను కోర్టులో కేసు వేశాను. గజగజలాడారు. ఎమ్మెల్యేలు, ఆఫీసర్లు చెమట్లు కక్కుకుంటూ తిరిగారు. బయ్యన్న అంటే ఉచ్చ పోసుకునే వాళ్ళు. నెలరోజులు జైల్లో ఉన్నాను. ఇవాళ పరిస్థితేంది? పిట్టల్లా రాలిపోతున్నారు. బిడ్డల్ని చంపేస్తున్నారు" అంటూ కళ్ళ నీళ్ళు తుడుచుకున్నాడు.

లోపల మీటింగ్ మొదలైంది. సన్నటి నడికారు మనిషి, స్టేజిపై నిలబడి అందర్నీ కూచోమని అడుగుతున్నాడు. పెద దోర్నాల సర్పంచ్, ఎమ్మెల్యే వచ్చినట్టున్నారు. ఆయన చుట్టూ జనం మూగి ఉన్నారు. అలల సుందరం, తన అనుచరులతోపాటు- జైజైలు చెప్పుతుండగా లోపలికి వచ్చాడు. ఎమ్మెల్యే పత్తి ఎల్లయ్య వచ్చి ముందు వరుసలో కూర్చున్నాడు. ఆయన ముఖం లావుగా, నిండుగా ఉంది. ముఖంలో ఏ ఆందోళనా లేదు. నమస్కారం పెడుతున్నవాళ్లకి "అంతా ఓకే అవుతుంది. మీరు వర్రీ కావద్దు" అంటూ చెయ్యి ఊపి చెబుతు న్నాడు. జేబులోంచి, నోట్ల కట్టను తీసి, అనుచరులకు ఇచ్చి, "వచ్చినోళ్ళందరికీ బిరి యాని అరేంజ్ చెయ్యి" అని ఆదేశించాడు.

ఆలస్యంగా కాంగ్రెస్ పార్టీ వాళ్ళు వచ్చా రు. ముందు వాళ్ళ నాయకుడు, ఆయన వెనుక అనుచరులు, ముఖాలకు మాస్కులు కట్టుకొని వచ్చారు. సోనియాగాంధీ, రాజీవ్ గాంధీ మాస్కులు. అచ్చం సోనియా, రాజీవ్ లాగా కనబడుతూ జనం మధ్యలో కూర్చు న్నారు. ముఖ్యంగా సోనియా మాస్కు అద్భుతంగా కుదిరింది. తెలుగుదేశం ఎమ్మెల్యేలో కొద్దిగా కంగారు, పసుపుపచ్చ చొక్కాలతో సరిపెట్టుకున్నాడు గానీ, ఈ ఐడియా ముందే తట్టి ఉంటే, చంద్రబాబును మీటింగ్‌లో అటూ ఇటూ తిప్పేవాణ్ణి కదా అనుకున్నాడు.

"అడవిలోని చెంచులు, నాగరిక జీవితా

నికి దూరంగా నివసిస్తున్నారు. వేదికపైన చోటా నాయకుడు, "ఎమ్మెల్యేగారిని పైకి పిలువు" అంటూ ఎవరో కేక వేశారు. "పిలిచే ముందు అడవుల్లోని చెంచుల గురించి నేను రెండు మాటలు మాట్లాడాలి" అంటూ మైకును గట్టిగా పట్టుకున్నాడు.

"ఇప్పుడు అడవిలో చెంచులు ఉండలేని పరిస్థితి వచ్చింది, ముఖ్యంగా మార్కాపురం డివిజన్‌లో. పది రోజులుగా పిచ్చివాళ్ళలా తిరుగుతున్నారు. తిండి తిప్పలు లేవు. మన ధ్యాస లేదు. ఆకు, అలములు, దుంపలు తిని బతికేవాళ్ళను, అడవి అవతల ఉండమంటే ఎట్లా?

అడవుల్లోంచి బయటకొచ్చిన వాళ్ళ పరిస్థితి కూడా అంతంత మాత్రమే. ఐటిడిఏ వాళ్ళు కట్టే కాలనీలన్నీ రెండేళ్ళలో కూలిపోతాయి. బోర్లలో నీళ్ళు రావు. టి.బి, కామెర్లు, మలేరియా, జబ్బులేని చెంచుమనిషి లేడు. పురుడు కష్టమై ప్రాణాలు పోయిన ఆడకూతుళ్ళు. ఇక ఐటిడిఏ బళ్ళ గురించి ఎంత తక్కువ చెబితే అంత మంచిది.

పోలీసు హింస మరో బాధ. అడవుల్లోకి అన్నలు వచ్చినప్పటి నుంచి ఉంది. అడవులను గాలించే నెపంతో స్త్రీలను, పిల్లలను, యువకుల్ని చెప్పరాని హింసలకు గురి చేస్తున్నారు. మొన్న పదమూడున మార్కాపురం డివిజన్‌లో జరిగింది పోలీసు హింసకు పరాకాష్ఠ.

ఇవాళ అడవి బిడ్డల్ని అడవుల్లోకి రావద్దంటున్నారు. గట్టిగా అడిగే నాయకులు లేరు. మిగిలిన తెగల్లాగా చెంచుల్లో చదువుకున్న నాయకుల్లేరు. యాభైమంది మన కళ్లముందే చచ్చిపోతుంటే, మనం తమాషా చూస్తున్నాం. ఏదో ఒకటి తేల్చండి. కుదరదంటే తలా కాస్త చందాలిచ్చి వెళ్ళండి. ఆ యాభైమందిని పూడ్చడానికి సరిపోతాయి" అని మాట్లాడి, ఇప్పుడు నాయకులు స్టేజీపైకి వచ్చి మాట్లాడతారని ప్రకటించాడు.

నాయకులు మాట్లాడే లోపల సోనియా గాంధీ మాస్క్ వేసుకొచ్చిన కాంగ్రెస్ కార్యకర్త స్టేజిపైకి వచ్చి, మాస్కును సర్దుకొని, భుజానికున్న సంచిలోంచి నాలుగైదు మాస్కులు బయటకు తీశాడు. ఇందిరా గాంధీ, నెహ్రూ వగైరాల మాస్కులు, సంచంతా వెతికి రాహుల్‌గాంధీ మాస్క్ బయటకు తీశాడు. "ఏ బొమ్మ పెట్టుకోమంటే ఆ బొమ్మ పెట్టుకుంటాను" అంటూ రాహుల్‌గాంధీ మాస్క్ పెట్టుకొని "అయ్యా, అందరికీ దండం పెడతాను. చెంచుల్ని కాపాడండయ్యా. మా ఓట్లన్నీ మీకే. జై రాహుల్‌గాంధీ" అంటూ స్టేజి దిగిపోయాడు.



**పోలీసు హింస మరో బాధ. అడవుల్లోకి అన్నలు వచ్చినప్పటి నుంచి ఉంది. అడవులను గాలించే నెపంతో స్త్రీలను, పిల్లలను, యువకుల్ని చెప్పరాని హింసలకు గురి చేస్తున్నారు.**

స్టేజీ మీద తెలుగుదేశం నేత కొంచెం అసహనంగా ఫీలయ్యాడు. అనుచరుణ్ణి పిలిచి, చెవిలో ఏదో చెప్పాడు. అలల సుందరం మాట్లాడే సమయానికి, పదిమంది ఎన్టీరామారావులు, పదిమంది చంద్రబాబునాయుడులు హాల్లోకి వచ్చారు.

"నా పేరు కాన్షీరాం" వేదికపై కాన్షీరాం మాస్క్‌లో ఒక నాయకుడు. చూస్తుండగానే వేదికపైన అందరికీ ముఖాలకు మాస్కులు మొలిచాయి. వాజ్‌పాయి, అద్వానీలు కూడా వచ్చారు. లెనిన్, మావోలు రాబోయారుగాని అలల సుందరం వాళ్ళను వారించాడు.

పనిలో పనిగా అల్లూరి సీతారామరాజు, కొమురం భీం, బిర్సా ముండాలు వేదిక పైకి వచ్చారు.

"నన్ను కూడా వినండి" గంభీరమైన గొంతు. జార్జిబుష్ మాస్క్ పెట్టుకొని అలల సుందరం వచ్చాడు.

"ఆదర్శాల కాలం వెళ్ళిపోయింది" అన్నాడు. క్షణం ఆగి, "రాజకీయాల్లో నిజాయితీల కాలం చెల్లిపోయింది. మీటింగ్ మొదలై రెండు గంటలైనా,ఎవరూ పరిష్కారం చూపలేదు. అన్నీ పరిచయమైన ముఖాలే. గత వందేళ్ళ చరిత్రకు సంబంధించిన ముఖాలు. అయినా పరిష్కారం దొరకలేదు."

నేనిప్పుడు డబ్బు గురించి మాట్లాడుతున్నాను. డబ్బు మినహా ఏ ఆదర్శం లేదనే విషయాన్ని మీకు చెబుతున్నాను. డబ్బు యుద్ధాన్ని చేయిస్తుంది. ఆదర్శాలను నిర్ణయిస్తుంది. దేశాలకు దేశాలే తుడిచిపెట్టుకుపోతున్నాయి. యాభైమంది చెంచులేపాటి? చెంచులతో సహా అందరం బతకటం నేర్చుకోవాలి. ఆదర్శాలు చెప్పటం మానేద్దాం. ఇక్కడ నిలబడి 'కబుర్లు చెప్పిన ఏ ఒక్కడిలోనూ నిజాయితీ లేదు. అసలిది త్యాగమూర్తులకాలం కాదు."

"కొత్త శతాబ్దం వచ్చింది. ఇప్పుడు బలమున్నవాడే బతుకుతున్నాడు. నా భూమి, నా నేల, నా అడవి అనే సెంటిమెంట్లు మరిచిపోవాలి. అడవిలోని చెంచులు అమాయకులు. ఇప్పుడే పుట్టిన బిడ్డల్లాంటివాళ్ళు. వాళ్ళకు నచ్చజెప్పండి, అడవిని మర్చిపొమ్మని. వాళ్ళ కోసం ఇళ్ళు కట్టిస్తున్నాను. ఇంకా ఫండ్స్ తెప్పిస్తాను."

గాంధీ, నెహ్రూలు, కమ్యూనిస్టులు, సోషలిస్టులు, అవన్నీ మర్చిపొండి.

"ఇంకేం ఉపన్యాసాలు వద్దు. పోసుకోలు కబుర్లు వద్దు. ఇదిగో లక్ష రూపాయలు. చెంచుల్ని అడవి బయట ఎక్కడైనా ఉండడానికి ఒప్పిస్తే, వాళ్ళకు ఈ లక్ష ఇస్తాను" అని ముగించాడు.

ఎవరూ చప్పట్లు కొట్టలేదు. అట్లా కళ్ళప్పగించి, జార్జ్.డబ్ల్యు.బుష్ మాస్క్ తగిలించుకొన్న అలల సుందరం వైపు చూస్తూ ఉండిపోయారు. మరింక సభ అయిపోయిందని ఎవరూ చెప్పకుండానే సభ అయిపోయింది.

## 10

**చెం**చులలో కెల్లా వృద్ధుడు ఉడుముల బయ్యన్న, ఊరి బయట కూర్చున్న చెంచులవైపు అడుగులు వేసుకుంటూ వచ్చాడు. ఒక్కడే ఖాళీగా ఉన్న పొలాల మధ్య నుంచి సన్నని గీతలా నడుచుకుంటూ వస్తున్నాడు. మొలచుట్టూ రెండు మూరల గోచీ. ఒకచేత్తో గొడ్డలి, భుజానికి తగిలించుకొన్న దబ్బ, పురాతనకాలంనాటి చెంచు యోధుడిలా వస్తున్నాడు. వంగిపోయిన శరీరాన్ని నిలువుగా ఉంచాలని ప్రయత్నం. తెల్లటి చేల



మధ్యన ఆయనొక భ్రమలాగా, కలలాగా నడుచుకుంటూ వచ్చాడు. నెత్తిపై పెద్ద బుట్ట. తలకు అంటించికున్నట్లుగా, ఏ ఆధారం లేకుండానే నెత్తిపై నిలబడింది. "బయ్యన్నను, శ్రీశైలం గుడిలో పూజలు చేసినవాణ్ణి" అంటూ వచ్చాడు.

బుట్టను కిందకు దించాడు వీర. బుట్ట పైన తెల్లని పూలు, గుబాళిస్తూ. ఎవరూ మాట్లాడలేదు.

ఏం కావాలి ఈ బయ్యన్నకు? ఆకలితో చచ్చిపోయేవాళ్ళకు ఈ పూలెందుకు అనుకున్నాడు వీర.

'బయ్యన్న' అంటూ అందరూ ఆయన పేరును పదేపదే తలచుకొన్నారు. బయ్యన్న తన పాదాలకు అంటిన మట్టిని తుడుచుకొని, కుర్రవాళ్ళ మధ్యన కూర్చున్నాడు. "నా ముఖంలోకి ముడతలు వచ్చే నాటికి మీరింకా పుట్టలేదు" అన్నాడు నవ్వుతూ.

"నాకు ఏడు మేకలున్నాయి. తేనె, జిగురు అమ్ముతాను. అడవిలో పిట్టలు నాతో మాట్లాడతాయి. ఎక్కడే మూలికలున్నాయో నాకు తెలుసు. ఈ పూలు



మామూలుగా ఎక్కడా దొరికేవి కావు. వీటి వాసనకు పిల్లలు ఏడుపు మానేస్తారు. పెద్దవాళ్ళు పాటలు పాడతారు" అన్నాడు నవ్వుతూ.

"చెంచుల కథలన్నీ చెప్పగలిగేది నేనొక్కణ్ణే. వందేళ్ళ క్రితం తెల్లదొరలున్న కాలం నాటి సంగతులు కూడా నాకు తెలుసు. పులుల్ని వేసెయ్యడానికి తుపాకులిస్తామన్నారు. ఇవన్నీ కథలు కథలుగా ఎంతోమందికి చెప్పాను. పాటలు పాడి వినిపించాను.

ఇప్పుడు వెనకటి కథల్లేవు. పాటల్లేవు. సిమెంటు ఇళ్ళు, బోరింగ్ పైపులు, రోడ్లు- ఇవే. చెంచుల కథలు మారాయి. పొలాలు దక్కించుకోడాలు, పిల్లల్ని చదివించుకోడాలు నేర్చుకుంటున్నారు."

"చెంచుల దేవుళ్ళ గురించి తెలిసినవాణ్ణి. పూజలు తెలిసినవాణ్ణి. పాటలు తెలిసినవాణ్ణి. నేను మొట్టమొదటి చెంచు మనిషిని. మీతో మాట్లాడానికి వచ్చాను" అన్నాడు కాస్త రొప్పుతూ, ఆయాసపడుతూ.

మన మొదటి దేవుడు వీరభద్రస్వామి దేవుళ్ళలోకెల్లా, భయం గొలిపే దేవుడు. ఆయన పనులు మనకర్థం కావు. మనం అడిగేది వినడు. క్షణాల్లో మన ముఖాల్లో నవ్వులు పూయించి, మరికాసేపట్లో ప్రాణాల్ని లాగేసుకుంటాడు. ఆయన కొండలపైన ఉంటాడు. అక్కడనుంచే ప్రాణాలు పోస్తాడు. ఎప్పుడైనా కిందకు వస్తాడు. కరువులు, మలేరియాలు, భూకంపం ఏదైనా సరే, ఆయన అట్లా చిటికేసి మనపైకి తోలుతాడు. పొగల మధ్యన అద్దంలాగా కనబడీ కనబడని దేవుడు ఆయన. ఆయనకొక టైమంటూ లేదు. చోటంటూ లేదు. ఇప్పుడు ఇక్కడ ఉండే ఉంటాడు" అని బుట్టను ముందుకు జరిపి పైనున్న పూలను తీశాడు. లోపల రకరకాల వస్తువులున్నాయి. ఎముకతో చేసిన పిల్లంగోవి. కాస్త చుట్టపొగ తాగి, పిల్లంగోవితో పాటలు పాడటం మొదలుపెట్టాడు. పాడుతూ ఉండగా ఆయన ముఖంలో రంగులు మారాయి. ముఖం నిండా చెమట్లు, ముఖం నల్లకప్పు వేసింది. తలపైన తెల్లజుట్టు గాలిలో పక్షిరెక్కలా ఎగిరింది. ఆయన పాడుతున్న పాటలు ఎప్పుడూ విననివి. లేచి చిందులెయ్యటం మొదలుపెట్టాడు. వీరభద్రయ్యా స్వామీ అంటూ ఒక్కసారిగా అరిచాడు. ఆయన పాట, చిందు అద్భుతమైన అనుభవం. కలలోని సంగతిలా ఉంది. ఆయనను చూస్తుంటే శక్తి ఏదో ఆయనలో ఉన్నట్టు అనిపిస్తోంది. కుర్రవాళ్ళందరూ ఆయన ముందు మోకరిల్లటం గమనించాడు వీర. బయ్యన్న చిందులేస్తూ, పిల్లంగోవిని నేలపై వేసి, కాళ్ళతో తొక్కాడు. ఎముకలు చిట్లిన శబ్దం. ఆకాశం వైపుకు చేతులు సాచి పెద్దగా ప్రార్థించటం మొదలుపెట్టాడు. శరీరమంతా చెమటలు, పరిగ పిట్టలాంటి జుట్టు రెపరెపలాడింది.

కళ్ళు మూసుకొని, బుట్ట లోపలికి చెయ్యి పెట్టాడు. మాంత్రికుడిలా ఒక్కో వస్తువునే బయటకు తీశాడు. ముందుగా గుప్పెడు నల్లమిరియాలు. అందరికన్న పెద్దవాడు దాసరి చినమంతయ్యను పిలిచి, మిరియాలు ఆయన చేతిలో పెట్టాడు.

"వీటిని నేలలో నాటు. ఆ ప్రదేశంలో అంతా మంచే జరుగుద్ది. వీటిని నీ దగ్గర పెట్టుకో. సరిగ్గా పన్నెండు గంటల తరువాత పడమటి వైపునకు నడుచుకుంటూ వెళ్ళండి. ఆరు కోసులు నడిచినాక అడవి వస్తుంది. అది మీది. ఎవరు పిలిచినా వెనక్కు చూడొద్దు. అవసరమైతే దబ్బలు పట్టుకోండి. గొడ్డళ్ళు తీసుకోండి. అక్కడ మిరియాలు నాటండి. గుడిసెలు వేసుకోండి. ఇది వీరభద్రస్వామి మాట" ట్రాన్స్‌లో ఉన్నవాడిలా మాట్లాడాడు బయ్యన్న. వీరకు ఇదంతా గారడీ విద్యలా అనిపించింది. అట్లా అని ఆ మనిషి మాటల్ని పూర్తిగా

తీసివెయ్యలేము అనుకున్నాడు.

"రండి, నా పక్కన కూర్చోండి" ఆజ్ఞాపిస్తున్న వాడిలా పిలిచాడు. బుట్టలోంచి పది సారాయి సీసాలు తీశాడు. "తాగండి, ఇది స్వామి ప్రసాదం. ఒట్టి సారాయి కాదు" అంటూ ముందుకు తోశాడు. అందరూ ఎగబడ్డారు. నిముషాల్లో పది సీసాలు అయిపోయాయి. ఆడవాళ్ళకు, పిల్లలకు కూడా ఇచ్చాడు. మరో పది సీసాల్ని బుట్టలోంచి తీస్తూ, "చచ్చిపోయిన వాళ్ళను బతికిచ్చేది ఇది. కడుపునిండా తాగండి" పెద్దగా అరిచాడు.

"నీ సంగతేమిటిరా? " అంటూ వీరవైపు తిరిగాడు. వీర కూడా సీసా అందుకున్నాడు. అది తాగినాక వీర కళ్ళనిండా వెలుగు. ఒట్టి వెలుగు కాదు. వెలుగుల భ్రమ. ప్రపంచమంతా రంగులదీపంలా మిలమిలలాడుతోంది. ఒంటికి రెక్కలు మొలిచి, ఎగిరిపోవాలనిపించే హుషారు. ఎదురుగా ఉన్న మనిషి బయ్యన్న కాదు. వీరభద్రస్వామి అనిపించేంత భ్రమ. వీరకు ఇదంతా గారడీ అని తెలుస్తోందిగానీ, కాదు, కాదు అని అరవాలనిపిస్తోందిగానీ, నోరు పెగలటం లేదు. మెదడు అరల్లో కొత్త ప్రాణాలు వచ్చినట్లుగా అనిపించింది. శిశువు స్వప్నంలా సమస్తం నిర్మలంగా, మోహనంగా అనిపించసాగింది. సమస్త ప్రపంచాన్ని జయించగలం అనే ధైర్యం, శక్తి కలిగాయి.

బయ్యన్న కాసేపటికి మళ్ళీ బుట్టలోకి చెయ్యిపెట్టాడు. అరటి ఆకుల్లో, కాల్చిన మాంసం ముక్కల్ని బయటకు తీశాడు. కుందేలు మాంసం. నేనే వేటాడాను. కాల్చి తెచ్చాను అంటూ మాంసాన్ని అందరికీ అందించాడు. బయ్యన్న ఏదో మోళీ కడుతున్నట్టుగా అర్థమైంది వీరకు. అందరూ ఆయన మంత్రశక్తిలోకి నడిచివెళ్ళటం గమనించాడు.

ముందు ఆడవాళ్ళకు, పిల్లలకు పెట్టాడు. కాసేపటికి, ఇంకో ఆకు, మాంసం ముక్కలు బయటకు తీసి ముసలాళ్ళకు పెట్టాడు. చివరన కుర్రవాళ్ళకు. అంత రుచికరమైన మాంసం భూమిపైన ఉంటుందా అనిపించింది వీరకు.

చాలాసేపటి తరువాత లేచి నిల్చున్నాడు బయ్యన్న. బుట్టలోంచి బాణాల్ని బయటకు తీశాడు. తీసి, బొటనవేలుకి సర్రున గుచ్చి రక్తపు చారలంటిన బాణాల్ని చినమంతయ్య చేతిలో పెట్టి "ఇది జయం తెచ్చే బాణం. దగ్గర పెట్టుకో. తిరుగులేదు. చెంచుల కథలో ఇక చావు లేదు."



**వీర కళ్ళనిండా వెలుగు. ఒట్టి వెలుగు కాదు. వెలుగుల భ్రమ. ప్రపంచమంతా రంగులదీపంలా మిలమిలలాడుతోంది. ఒంటికి రెక్కలు మొలిచి, ఎగిరిపోవాలనిపించే హుషారు.**

"బయలుదేరండి. సరిగ్గా ఆరుగంటల తరువాత పడమటివైపుకు. అది చెంచుల రాజ్యం. అందరూ మెల్లగా అక్కడకు చేరతారు. అక్కడ విత్తనం మొలకెత్తుతుంది. పంట నిలుస్తుంది."

"ఇప్పటినుంచి ఎన్నో అద్భుతాలు. మహిమలు చూస్తారు. వెళ్ళండి" అంటూ బుట్టను పైకెత్తాడు. ఎత్తి, దాన్ని తల్లకిందులుగా పట్టుకొన్నాడు. తెల్లటి పూలు నేలంతా పరుచుకున్నాయి.

ఖాళీ బుట్టను నెత్తిపై పెట్టుకొని చేల మధ్యన నడుచుకుంటూ వెళ్ళాడు బయ్యన్న.

చిన్నమంతయ్య గుప్పిటనిండా నల్లమిరియాలు. వాటిలో కాసిని తీసుకొని జేబులో వేసుకున్నాడు వీర. ✦



ఆర్ద్రత మానవీయతల సంగమం

# తెగిన పేగు

-పిశుపాటి ఉమామహేశ్వరమ్

**నాలుగు దశాబ్దాలుగా కథలు, కవితలు, కార్టూన్లు, రేడియో నాటికలు, వివిధ రకాల ఫీచర్ల ద్వారా సుప్రసిద్ధులైన రచయిత పిశుపాటి ఉమా మహేశ్వరమ్. ఎన్నో కథలు రాసినా తనకు నచ్చిన కథ 'తెగిన పేగు' అంటారాయన. ఆలోచించే మెదడూ, స్పందించే హృదయం నిత్య చైతన్య స్రోతస్వినులు. ఈ కథలోని ఆత్మ, కథకుడూ, కథానాయిక కూడా అలాంటివే. ఆర్ద్రత, మానవీయతల సంగమంగా రచయిత కలం నుంచి జాలువారిన అపురూప కథ 'తెగిన పేగు' కథ వెనుక కథ ఇదీ...**

## కథ వెనుక కథ

1966 నుంచీ కథలూ, కవితలూ రాస్తున్నా.. 1980ల వరకూ రేడియో నాటకాలూ, ఫీచర్లూ వగైరాలపై కలాన్ని ప్రయోగించినా.. స్టేజి నాటకాల మీద అప్పటికింకా చెయ్యి చేసుకోలేదు. ప్రస్తుతం సెంట్రల్ వర్సిటీ డ్రామా ప్రొఫెసర్ డి.ఎస్.ఎన్.మూర్తి అప్పటికే ప్రముఖ స్టేజి దర్శకుడు. ఆ రోజుల్లో అతని కాళ్లకడ్డం పడి నాటకాలు రాస్తానని హింసించే వాడిని. అలా అతన్ని తరచూ కలుస్తూన్న రోజుల్లో ఓ రోజోముక్క అన్నాడు- ఈవేళ మా ఆఫీసులో ఓ వింత సంఘటన జరిగింది. పిశుపాటీ, నీకు మంచికథగా ఉపయోగిస్తుంది- అని జరిగింది చెప్పేడు.

వాళ్ల కొలీగ్ ఒకతను సౌత్ టూర్‌కి పోతూ పాల్ఘాట్ ఎక్కడంటూ అందర్నీ ఎంక్వైరీ చేస్తూంటే- నీకు పాల్ఘాటెందుకు? -అని వీళ్లు అడిగారు. మా మదర్‌ది పాల్ఘాట్‌ట! ఓసారి చూపించమని అడిగింది- అని జవాబు. 'ట!' అంటున్నావ్. నీకుతెలీదా-అని వీళ్లప్రశ్న. 'ఒట్టు! నాకివాల్టి' వరకూ తెలీదు -అతని జవాబు.

"అక్కడ కొట్టిందోయ్ నేటివిటీ సెంటిమెంట్" అన్నాడు మూర్తి.

వందేళ్ల క్రితం కన్యాశుల్కం ఆచారం అనుకున్న వాళ్లున్నారు. అనాచారం అన్నవాళ్లున్నారు. లాభపడ్డ వాళ్లున్నారు. బలిపశువైన వాళ్లున్నారు. ఇక్కడ కన్యాశుల్కం ఎక్కువని పాల్ఘాట్ వెళ్లి మలయాళీ బ్రాహ్మణ పిల్లల్ని తక్కువ ఖర్చుతో సశాస్త్రీయంగా వివాహం చేస్కునొచ్చేవాళ్లు. అప్పట్నించీ వాళ్లు అచ్చంగా ఆంధ్రా 'ఆవకాయ'లై పోయేవాళ్లు. పుట్టిన నేలనీ, సంస్కృతినీ, సాంప్రదాయాల్నీ వదిలి పరాయిచోట మమేకమైన వాళ్ల హృదయ స్పందన ఇలా బయటపడడం ఎంత శోచనీయం. దీనిమీద అద్భుతమైన కథ రాయొచ్చు- అన్నాడు మూర్తి. బుర్రలో ఆలోచనలు మొదలయ్యాయి. మావాళ్ళిళ్లలోనూ అటువంటి ఉదాహరణ ఒకటున్న విషయం గుర్తుకొచ్చింది అప్పుడే నాకు.

మా రెండో పెద్దనాన్న రెండో భార్య

పాల్ఘాట్ ఆవిడ అన్న విషయం విన్నానే గానీ దానిమీద అప్పటి వరకూ 'జర్నలిస్టిక్ ఇంట్రస్ట్' కలగలేదు. దరిమిలా ఆవిడని జగ్గయ్య పేటలో కలిసినపుడు 'అమ్మా.. మీది పాల్ఘాటా?' అనడిగేను. 'అవున్రా' అందావిడ. 'మరి మీవాళ్ళూ? -ఎప్పుడేనా వెళ్ళేవా' అన్నప్రశ్నకు 'మీ గుమ్మం తొక్కేక మళ్ళీ కాలుబైట పెట్లేదు. మీరే నాకంతా' అందావిడ నవ్వేస్తూ.

కరెక్టుగా అప్పుడు - నాలోని కథకుడిలో ఒక పేగు కదిలింది. అదే- 'తెగిన పేగు'.

'1981లో చిక్కడపల్లిలో ఉండేవాణ్ణి. '82లో కథ రాయడం జరిగింది. 4-3-1983లో ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రికలో ప్రచురితమైంది. చిక్కడపల్లి అని ఎందుకు చెప్పేనంటే వేంకటేశ్వరస్వామి గుడి సమీపంలో మా యింటిదగ్గరే ఎర్రమంజిల్ ఇరిగేషన్ డిపార్ట్‌మెంట్‌లో పన్జేసే ఒకావిడ ఉండేది. కథపడ్డ మర్నాడే ఆవిడ రోడ్డుమీద కలిసినపుడు 'ఏమిటండీ ఆ కథా! అలా రాశారూ?' అంది ఈ కథను గురించి. గతుక్కుమన్నాను కథ బాలేదేమోనని. ఆవేళ కథ చదివేక వాళ్ళ లేడీస్ లంచ్ రూమ్‌లో ఎవరూ భోంచేయలేదుట. అంత మనసు బాగుండని మూడ్‌కి తీస్కెళ్ళింది మీ కథ- అని ఆవిడ వివరించేక నా గుండెలు గూట్లోకి చేరేయి. మెచ్చుకోళ్ళలో అదొక 'మెచ్చుతునక'.

2005లో బందర్లో నాకు సన్మానం జరిగింది. పాతమిత్రులు కలిసేరు. 60'లలో బాగా కథలురాసిన కోట కృష్ణమూర్తి కలిసేడు, ఆప్యాయంగా పలకరించి 'నీ కథలలో ఒకటి నాకు బాగా ఇష్టమయ్యా! నా దగ్గర లేదు. నీ దగ్గరుంటే ఓ కాపీ పంపు' అన్నాడు. పేరడిగితే గుర్తులేదన్నాడు. 'అదేదో పాల్ఘాట్ చుట్టూ తిరుగుతుంది' అన్నాడు. 'తెగిన పేగు' అన్నాను ఠక్కున. 'ఆ! అదే... అదే' అన్నాడతను ఆనందంగా. ఆశ్చర్యమేసింది నాకు ఆ కథ ఇంకా కొంతమంది జ్ఞాపకాలలో బ్రతికున్నందుకు.

'కంఠాభరణం' నాటకానికి ఇటీవల పాటలు రాశాను. బలరామ్మూర్తి అని సహ రచయిత, అందులో నటుడు. ఎవరో రిహార్సల్ టైమ్‌లో పాటల్ని మెచ్చుకుంటూ 'నువ్వు పాటలు గూడా రాస్తావా, నాటకాలే కాకుండా' అంటుంటే, 'నాటకాలేమిటీ, అంతకన్నా ముందుకథకుడు. 'తెగినపేగు' అని మంచికథ రాసేడు. అప్పట్నుంచీ వీడి ఫాన్ని' అన్నాడు అతడు. పాతికేళ్ళ పైబడి స్నేహితులమైనా ఎప్పుడూ ఈ సంగతి నాతో చెప్పలేదు. 'తెగిన పేగు' మళ్ళీ బతికింది నా కథక జీవితంలో.

కథ విషయానికొస్తే ప్రత్యేకంగా చెప్పక్కర్లేకుండా త్వరలో రచయిత 'విహారి' సంకలించి ప్రకటించబోయే తెలుగు కథ తేజోరేఖల్లో 'తెగినపేగు'కు చోటిస్తూ కథ, కథనాల గూర్చి వివరించిన వైనాన్ని క్లుప్తంగా మీ ముందుంచుతాను. గత శతాబ్దంలో- ఆంధ్ర దేశంలోని సామాజిక రుగ్మతల్లో ఒకటి- తక్కువ కన్యాశుల్కానికి పాల్ఘాట్ అమ్మాయిల్ని కొనితెచ్చుకుని పెళ్ళి చేస్కోడం. అలా చిన్నతనంలోనే ఈ ప్రాంతానికొచ్చి- ఇక్కడి వారితో, ఇక్కడి వాతావరణంతో మమేకమైపోయి, ఇక్కడి జీవ(న) వాహినిలో కలిసిపోయి- సంసారాన్ని సాగించిన స్త్రీలెందరో ఉన్నారు. భర్తకి సుఖమీయడం, ఇంటి చాకిరిలో మునిగి తేలడం, పిల్లాపీచూ, భర్త తరపున జనం-వీరందర్నీ మర్యాదగా చూడడం, సాకడం, ఇంటా బయటా తలలో నాల్కలా మెదలడం, మొత్తం మీద ఆ స్త్రీ స్వరూప స్వభావాలిలా ఉండేవి. ఇంతగా కలిసిపోయినా, ఆమె ముఖం మీద 'పాల్ఘాట్ పిల్ల' అనే ముద్ర వేసేవారు- గ్రామస్థులు కానీ, కుటుంబీకులు కానీ.

ఇలాంటి ఒక స్త్రీ గురించీ, విలక్షణమైన ఆమె కోరిక గురించీ, ఆ కోరిక పర్యవసానం గురించీ రాసిందే 'తెగిన పేగు'.

ఆ స్త్రీ డెబ్బైయేళ్ళ నాగలక్ష్మి. దక్షిణ దేశ యాత్రలకు సిద్ధమౌతున్న కొడుకూ, కోడల్ని కన్యాకుమారి నించి తిరిగి వచ్చేటపుడు పాల్ఘాట్‌లో తన ఊరినీ, తనవారినీ, తమ ఇంటినీ ఒక్కసారి చూపించమని అడిగింది. ఇదీ- ఆమె కోరిక. కొడుకు సుబ్బారావు శ్రమపడి- 'వేజ్ఞప్పోడి'ని వెతుక్కుని తీస్కెళతాడు. డెబ్బైయేళ్ళ తర్వాత ఎంతోమారి పోయిన ఆ ఊళ్లో, ఆమె చిన్నప్పుడు వదిలి వచ్చిన ఇంటిని గుర్తుపట్టడం కష్టమవుతుంది. ఐనా వెతికి పట్టుకుంటారు ఒక 'దుబాసీ' సాయంతో.

నాగలక్ష్మి తమ్ముడు అప్పుకుట్టి - ఆ కుగ్రామంలో ఒక జీర్ణావస్థలో ఉన్న గుడి పక్కన ఉన్న ఆ యింట్లో ఉంటున్నాడు.

ఆ ఊళ్లో తమ ఇంట్లో తన చిన్నతనపు గుర్తులూ, జ్ఞాపకాలూ, అల్లిబిల్లిగా అల్లుకున్న అనుభవాల అనుభూతులూ మిగిల్చిన అనేక సంఘటనలూ- కథలో దర్శనమిస్తాయి.

దుబాసీ సాయంతో గుర్తించిన అక్కాతమ్ముళ్ల పరస్పర రక్త స్పర్శలో ఎన్నెన్నో భావతరంగ ప్రసరణలు. ఇద్దరి కళ్లనుండీ అశ్రుధార. చూపుల్లో ఎన్నో (అ)పరిచిత పలకరింపులు. ఎంతెంతో అనుభూతి సాంద్రత. మూగవోయిన మనసుల్లో పైకి ఉబకని ఊసులు.

'నీ మరదలు ఇదిగో' అంటే 'నీ మేనల్లుడిడిగో' అంటూ పరిచయాలు. పిల్లలు - ప్రస్తుతానికి పెద్దవాళ్లే అయినా - వింతగా, అమాయకంగా, పరాయిగా చూసుకుంటున్నారు. అద్భుతం, విచిత్రం తప్ప అక్కడేమీ లేదు. ఎవరికీ ఎదుటివారి మాట తెలీదు. అప్పుకుట్టి భార్య కాఫీ ఇచ్చింది. అక్కడి తయారీ ఎవరికీ రుచించదు. కానీ ఆత్మీయత మెదిలింది. మాట్లాడ్డానికేమీలేదు. అందరూ బొమ్మల్లా నిలబడ్డారు.

సరి- చివరికి మళ్లీ వారు లౌకికంగా పరాయివారైపోడమే! పరిచయస్థుల ఇంటికి చాలాకాలం తర్వాత వెళ్లి పరామర్శించిన భావన మిగిలింది ఆఖరికి. ఇప్పుడు కలిసే బంధమూ కాదూ, కొనసాగే బంధమూ కాదు. వదల్లేక వదల్లేక ఆ ఇంటి చుట్టూ మూడుసార్లు తిరిగి అయినవాళ్లనందర్నీ తనివితీరా అక్కున జేర్చుకుని కాలు బయట పెట్టిందావిడ. ఆ సంబంధం అంతటితో సరి. నాగలక్ష్మికి సంబంధించిన ఈ సందర్భం- చాలా ఆర్ద్రమైన రచన. ఆమె అంతర్భావనలో సజీవమైన ఆలోచనలు చక్కగా ప్రతిబింబించాయి. జీవనమున్న మనిషి- నాగలక్ష్మి బొమ్మని ఎంతో దర్శనీయంగా ఆమె మనసుని ఎంతో నైశిత్యంగా మనముందుంచుతాడు రచయిత. తెలుగుకథల్లో అరుదైన వస్తువుతో, అంతఃసౌందర్యంతో ఆవిష్కరింపజేసిన శిల్పంతో- 'తెగిన పేగు'ని మనకందించారు ఉమామహేశ్వరమ్.



సేకరణ:
చంద్రప్రతాప్



బైరన్

# స్వేచ్ఛా గీతం

వేపకాయంత వెర్రి అందరికీ ఉంటుంది. కవులకూ, కళాకారులకూ అది కాస్త ఎక్కువ మోతాదులో కూడా ఉండొచ్చు కాని కొందరి జీవితాలు నమ్మలేని నిజాలు.

ఇంగ్లిష్ సాహిత్యంలో షేక్‌స్పియర్ తర్వాత అంతటివాడని పేరున్న బైరన్ మహాకవి గురించి తెలియని వాళ్లుండరు. ఆయన బతికింది ముప్పై ఆరేళ్లు. అయినా సాహిత్యంలో అమరుడు.

ఆయన పూర్తి పేరు జార్జ్ నోయెల్ గార్డన్ (1788-1824). అనువంశికంగా 'లార్డ్'. హౌస్ ఆఫ్ లార్డ్స్‌లో తొలి ఉపన్యాసంలోనే ఫాక్టరీ కార్మికుల ప్రయోజనాలను పరిరక్షించాలని వాదించాడు బైరన్. తన ఇరవైనాలుగో ఏట ప్రచురించిన "చైల్డ్ హెరాల్డ్స్ పిల్గ్రిమేజ్"తో కవితాప్రియుల హృదయాలు కొల్లగొట్టాడు. 'తెల్లారి లేచే సరికి గొప్ప వాణ్ణయిపోయాను' అని చెప్పుకున్నాడు. అతడి సాహిత్య సృష్టి అపారం. 'అవర్స్ ఆఫ్ ఐడిల్‌నెస్', 'ది బ్రైడ్ ఆఫ్ అబిడాస్', 'ది కొర్సేర్', హిబ్రూ మొండోస్', 'ఇంగ్లిష్ బార్డ్స్ అండ్ స్కాచ్ రివ్యూయర్స్', 'ది విజన్ ఆఫ్ జడ్జిమెంట్' వగైరాలతో అభిమానులకు ప్రాతఃస్మరణీయుడైనాడు.

యూరోప్ అంతటా పర్యటించి, ఇటలీ చేరినప్పుడు, అక్కడ షెల్లీతో ఏర్పడిన పరిచయం స్నేహంగా మారింది. ఆ దశలో రాసిన గొప్ప కావ్యం "డాన్ జువాన్".

నిరంకుశత్వాన్ని వ్యతిరేకించిన బైరన్ ఆనాటి తిరుగుబాటుదార్లతో గొంతు కలిపాడు. ఆర్థిక సహాయం కూడా చేశాడు. రహస్య ఉద్యమకారులు 'బార్బొనరీ'తో కలసి ఇటలీ విముక్తి కోసం తన వంతు కృషి చేశాడు. ఆత్మరక్షణ కోసం, టర్కులకు వ్యతిరేకంగా గ్రీకులు చేసిన పోరాటంలో పాలు పంచుకున్నాడు. ప్రపంచ చరిత్రలో విప్లవకారులెందరో! కాని రాజవంశానికి చెందిన 'లార్డ్'లాగ తన వర్గానికి వ్యతిరేకంగా ఉద్యమించిన వారు అరుదు.

## తెర తీయగ రాదా!

బైరన్ జీవితం సమకాలీనులకు చర్చనీయాంశం కావటానికి సాహిత్యేతర కారణాలనేకం.

ఆనాటి పడతులకు అతడు నవమన్మథుడు... హార్ట్ త్రాబ్. అతడి కనుసన్నల కోసం, స్పర్శ కోసం తపించిన సుందరాంగనలెందరో. ఇంతమంది తన కోసం పడిగా

పులు పడి నిరీక్షిస్తున్నప్పుడు బైరన్ ఓ అమ్మాయిని పెళ్ళి చేసుకున్నాడు. ఆవిడ అతడికి చెల్లెలి వరుసవుతుంది. ఈ స్కాండల్ తెలిసిన యువతులు తమ ఊహాప్రియుడి ప్రేమ జీవితాన్ని తలచుకుని ఈర్ష్య పడ్డారు. ఇలాంటి విషయాల గురించి తెలుసుకోవటానికి ఆయన అభిమానులు ఇష్టపడరు. అనేక సంవత్సరాల తర్వాత అమెరికన్ రచయిత్రి హారియెట్ బీచర్ స్టౌ (టాం మామ ఇల్లు) రక్త సంబంధీకురాల్ని బైరన్ వివాహం చేసుకున్నాడని రాస్తే, అందరూ ఆమెనే విమర్శించారు. ఇంతాచేసి, పెళ్ళయిన రెండు గంటలకే తనకావిడంటే అసహ్యమని చెప్పాడు. నూతన వధువుతో అతికష్టంమీద ఓ ఏడాదిపాటు కలిసివున్నాడు. భార్యమీద కోపంతో ఇంటిలోని ఫర్నిచర్ ధ్వంసం చేశాడు బైరన్. కవిగారికి పిచ్చెక్కిందేమోనని డాక్టర్లకు కబురు పెట్టిందా ఇల్లాలు. చివరికాయన ప్రవర్తన భరించలేక ఇల్లు విడిచి వెళ్ళిపోయింది. ఈ దారుణానికి స్త్రీలందరూ ఆమెనే నిందించారు. కొందరు 'మీ కోసం మేమున్నా'మంటూ ఎవరికి తోచిన ప్రేమ గీతాలు వాళ్ళు రాస్తే, మరికొందరు తమ జుత్తును కత్తిరించి ప్రేమచిహ్నంగా పంపించారు. ఒక సంపన్నురాలు పురుష వేషం వేసుకుని బైరన్ వెళ్లేదారిలో గంటల తరబడి నిరీక్షించింది. మరో స్త్రీ ఇంగ్లండు నుంచి ఇటలీదాకా ఆయన్ను వెంబడించింది.

ఇంతా చేస్తే, ఈ నలకుబేరుడి రూపలావణ్యాలేమిటి? బోదకాలు- కుంటినడక, పొగాకు దవడకు పెట్టుకుని, గోళ్లు కొరుక్కోవటం ఆయన అలవాటు. ప్రతి చిన్న విషయానికీ అందరితో పోట్లాట పెట్టుకుని పిస్టళ్లతో యుద్ధం చెయ్యటమంటే ఇష్టం. అహంకారి, ముక్కోపి. అభిమానించినా, అందరూ తన బోదకాలినే చూస్తున్నారని అవమానంతో కుంగిపోయేవాడు. తనను ఇష్టపడి వచ్చిన స్త్రీలను- ఒకరినో, ఇద్దరినో కాదు, అనేక డజన్లమందిని చిత్రహింసలు పెట్టటమంటే ఇష్టం.

ఇంటి తలుపులెప్పుడూ తెరిచేవాడు కాదు. పడుచుపిల్లలే అక్కడ పని మనుషులని ఇరుగుపొరుగులు చెప్పుకున్నారు. అర్థరాత్రి విచిత్ర వేషధారణతో అతిథులు వచ్చేవారు. ఆ వినోద కార్యక్రమాలలో భాగంగా పున్నమి వెన్నెలలో, మానవ కపాలాలు మధువు నింపుకుని తాగేవారని ప్రతీతి.

బైరన్ రంగు మాత్రం ఒంటికి సున్నం పూసుకున్నంత తెల్లగా ఉండేది- అలాంటి శరీరం కోసం ఎంత నరకం అనుభవించాడో పాపం! ఆయన చేసిన భోజనం- రోజుకు ఒక బంగాళాదుంప లేదా ఒక అన్నం ముద్ద. వెరైటీ కావాలనుకుంటే ఒకటి రెండు బిస్కట్లు లేదా ఒక గ్లాసు సోడా. అయినా కొవ్వు పేరుకుపోతుందేమోనని నిత్యం వ్యాయామం చేసి, ఈతకొట్టి, ఆవిరి స్నానాలు చేసి ఆకారం కాపాడుకున్నాడు. కానీ త్వరలోనే జీర్ణవ్యవస్థ పాడైపోయింది. భయంతో నిద్ర పట్టేదు. నిద్రమాత్ర (లాడానం) మింగినా ఉపయోగం కనిపించ లేదు. కళ్లు మూతలు పడితే పీడకలలు వేధించేవి. ఒకనాడు కలలో - అడవిలో ఒంటరిగా నడుస్తున్న షెల్లీ కనిపించాడు. నిజానికప్పుడు షెల్లీ పడవ ప్రమాదంలో మరణిస్తున్నాడు.

ఆ తర్వాత తన ప్రాణమిత్రునికి అంత్యక్రియలు స్వయంగా నిర్వహించాడు బైరన్.

మరికొన్నాళ్లకు, ముప్పైఏడవ ఏట అతడు మరణిస్తాడని చెప్పాడు జ్యోతిష్యుడు. సరిగ్గా ముప్పైఆరు సంవత్సరాల మూడు నెలలకు మరణించాడు బైరన్. తన వంశానికి ఇలాంటి గండమేదో ఉందని అతడికి తెలుసు. అతడి తండ్రీ, కూతురు కూడా ముప్పైఆరేళ్లకే మరణించారు మరి!

–స్వప్న ✦

# తీరిన రుణం

చతుర కథ

రెండు చేతుల్లో రెండు బరువైన సూట్‌కేసులు మోస్తూ, వీరస్పీడుతో పరిగెత్తుతూ వచ్చి ట్రైన్ ఎక్కబోయాడు సుబ్బారావు. సరిగ్గా రైలు కదిలింది. బ్యాలెన్స్ కుదరక పడబోయాడు. వెంటనే ఒక చెయ్యి వచ్చి అతన్నాదుకుంది. రెండవ చెయ్యి బయట పడబోతున్న సూట్‌కేస్‌ను పట్టుకుంది.

"చాలా థాంక్సండీ. మీరు చాలా హెల్ప్ చేశారు" వగరుస్తున్నాడు.

"ఫర్లేదు ఇలా ఇవ్వండి" రెండో సూట్‌కేసు కూడా తీసుకున్నాడా ఆపద్బాంధవుడు.

బెర్త్ మీద, కిందా అన్నీ సర్దుకుని, ఒక సీసాడు నీళ్లు గటగట పట్టించి అప్పుడు తేరుకుని ఎదురుగా ఉన్న మనిషి మొహం చూశాడు.

"నా పేరు కొమరయ్య. వైజాగ్‌లో కమర్షియల్ టాక్సెస్‌లో

గొల్లపూడి శైలజ



పనిచేస్తున్నా" పరిచయం చేసుకున్నాడు ఆప ద్బాంధవుడు.

"నా పేరు సుబ్బారావండి. నేను ఇంజనీరింగ్ కాలేజ్‌లో లెక్చరర్ని. మాది వైజాగ్" చెయ్యి కలిపాడు సూట్‌కేసులవాలా.

"ఆ సూట్‌కేస్ పడిపోతే చాలా కష్టమయ్యేదండి. దాంట్లో చాలా ఇంపార్టెంట్ కాగితాలున్నాయి. రైలు టిక్కెట్టు కూడా... మీ ఋణం ఎలా తీర్చుకోవాలో..."

"ఎప్పుడో సమయమొస్తుందిలెండి" చిరునవ్వు నవ్వాడు కొమరయ్య. పరిచయ కార్యక్రమాలు, వాళ్ల ఆఫీసు కబుర్లు, వీళ్ల కాలేజి కబుర్లు, తెచ్చుకున్న తిళ్ళు తినడం వగైరా కార్యక్రమాలతో రాత్రయి నిద్రకుపక్రమించారు. తెల్లారి దిగుతూనే వైజాగ్ స్టేషన్‌లో షేక్‌హాండ్లిచ్చుకుని విడిపోయారిద్దరూ.

* * *

కొమరయ్య ఇంటిమీద ఇన్‌కమ్‌టాక్స్ రైడింగ్. చాలా హడావిడిగా, టెన్షన్‌గా ఉంది ఇల్లంతా. అయితే కొద్దిగా ముందే ఈ విషయం పసిగట్టిన ఆయన ఓ పెద్ద సూట్‌కేసులో డబ్బు, నగలు గోల్డ్ బిస్కెట్లు దస్తావేజులు అన్నీ కుక్కేసి పనిమనిషికిచ్చి గోడమీంచి పక్కింట్లోకి విసిరెయ్యమన్నాడు. పనిమనిషి తొందరగా దాన్ని లాక్కుంటూ పోయి పక్కవాళ్ల పెరట్లో గిరాటేసింది.

ఇల్లంతా వెతికినా ఏమీ దొరకలేదు ఇన్‌కమ్‌టాక్స్ వాళ్లకి. మొత్తం వెదికి చివరికి "సారీ సర్. ఎవడో రాంగ్ ఇన్ఫర్మేషన్ ఇచ్చాడు" అన్నారు.

"ఇట్సాల్ రైట్" చిద్విలాసంగా పలికాడు కొమరయ్య. వాళ్లంతా విసవిసా వెళ్లి జీపు ఎక్కబోతుండగా జరిగిందా సంఘటన.

రెండు చేతులతో బరువైన సూట్‌కేసుని మోసుకుంటూ వచ్చాడు సుబ్బారావు. "హల్లో కొమరయ్యగారూ! బాగున్నారా? ఇది మీ సూట్‌కేసేగా. దీనికోసమే వెతుకుతున్నట్టున్నారు. మీ ఇంట్లోంచి ఎవరో పనివాళ్లు మా పిన్నివాళ్ల పెరట్లోకి విసిరేశారు... అన్నట్టు మీ పక్క ఇల్లే మా పిన్నిగారిది. వాళ్లింట్లో కెళ్లబోతూంటే పనివాళ్ల ఘనకార్యం నా కంటపడింది. వెధవలు ఈ పనివాళ్లనసలు నమ్మకూడదండి. నా కంట పడింది కాబట్టి సరిపోయింది. చూశారా ఆరోజు మీరు నా సూట్‌కేసని కాపాడారు. ఇవాళ్ళ ఇలా జరిగింది. యాదృచ్ఛికం కదూ! సరిగ్గా చూసుకోండి అన్నీ ఉన్నాయో లేదో. మీ ఋణమిలా తీర్చుకున్నానన్న మాట..." గడగడా నాన్‌స్టాప్‌గా, ఉత్సాహంగా చెప్పుకుపోతున్నాడు సుబ్బారావు.

అవతల చేష్టలుడిగి నిల్చుండిపోయాడు పాపం కొమరయ్య.

జీపు ఎక్కిన ఇన్‌కంటాక్స్ అధికారులు అప్పటికేదిగి సూట్‌కేసు అందుకుని తిరిగి ఇంట్లోకి అడుగు పెట్టారు. 




**చతుర సమీక్ష** | మే 'చతుర' నవల ఆకుపచ్చని గాయం

సమీక్షకుని/సమీక్షకురాలి పేరు: ________________

చిరునామా: ________________

________________

________________

నాటి చతుర




నాటి నవల

ఫ్లాష్‌బ్యాక్

# చీకటి

—శ్రీసుభా

మే 1980 సంచిక : 4 సంపుటి : 3

*ఇది కాలాన్ని నెమరు వేసుకునే శీర్షిక. పాఠకుల కోసం చతుర తొలినాళ్ళను పరిచయం చేసే శీర్షిక. కాలగమనంలో మొన్న నిన్నటి పొరల్లో ఒదిగిపోయిన నవలాహారాల్ని ఒక్కటొక్కటిగా ఇతివృత్తం, కథనం వగైరా అంశాలతో రేఖా మాత్రంగా పరిచయం చేయడం ఈ శీర్షిక లక్ష్యం.*

*1980వ సంవత్సరం మే నెల* ***'చతుర'*** *లో* ***శ్రీ సుభా*** *నవల* ***'చీకటి'*** *ప్రచురితమైంది. ఆ నవల పరిచయాన్ని ఈ సంచికలో ఇస్తున్నాం.*

అక్షరాభ్యాసం చేయగానే పాఠశాల బాట పట్టిన పిల్లలు ఒక్కొక్క తరగతీ దాటి డిగ్రీలు పుచ్చుకునే స్థాయికి ఎదుగుతారు. చదువు పూర్తవగానే తమ చదువుకు తగిన ఉద్యోగం చూసుకుని జీవితంలో స్థిరపడాలని ఆశిస్తారు. ఆ ప్రయత్నంలో భాగంగానే ఉద్యోగాన్వేషణ మొదలు పెడతారు. అది కొందరికి సులభంగానే లభించినా చాలా మందిని అనేక పరీక్షలకూ, అష్టకష్టాలకూ, అవమానాలకూ గురిచేస్తుంది. మంచి ఉద్యోగాలు లభించాలంటే తెలివి ఒక్కటే చాలదనీ బోధ పడుతుంది. అలాంటి క్లిష్ట సమయంలో నిరుద్యోగిగా, నిరాశగా బతుకీడుస్తుంటే అయినవాళ్ళు సహకరించకపోగా తిట్లూ, దెప్పిపొడుపులతో మరింత హింసిస్తుంటారు. కొందరు స్నేహితులు మాత్రం అండగా నిలిచి తగిన ధైర్యాన్ని ప్రోత్సాహాన్ని, సమయోచిత సలహాలను అందిస్తుంటారు. ఈ నవలలోని కథానాయకుని పరిస్థితీ ఇంతే! ఎం.ఏ. చదివిన ఓ నవ యువకుడు స్నేహితుల సహకారంతో, ఆదర్శ భావాలతో ముందుకు అడుగులు వేస్తుంటే ఎలాంటి అడ్డంకులు ఎదురవుతుంటాయో వివరిస్తూ సాగిన ఈ నవల శ్రీ సుభా విరచితం.

ఎం.ఏ. పాసైనప్పుడు విజయ గర్వంతో ఉప్పొంగిపోతాడు ప్రకాశం. కాలేజీలో చదువుకునే రోజులలో సీత పట్ల ఆప్యాయత పెంచుకుంటాడు. అతడి క్లాస్‌మేట్ పద్మావతి తాపీ పనివాడి కూతురు. చదువులో చాలా తెలివైంది. ప్రకాశంతో పాటే ఎం.ఏ.లో చేరి పాసవుతుంది. బెనారస్ హిందూ యూనివర్సిటీకి వెళ్ళి రీసెర్చ్ చేస్తుంది. ప్రకాశం నగరానికి వచ్చి ఉద్యోగం వెదుక్కునే ప్రయత్నాలు ప్రారంభిస్తాడు. చిన్నాన్నగారింట్లో కొన్నాళ్ళుండి ఆ తరువాత మరో గది చూసుకుని వెళ్ళిపోతాడు. ఎన్నో ఇంటర్వ్యూలకు హాజరైనా సరైన ఉద్యోగం దొరకదు. తనతో పాటు బి.ఏ. చదివిన శేఖరాన్ని వెదుక్కుంటూ వెళ్ళిన ప్రకాశానికి తను వెళ్ళబోతున్న ఇంటర్వ్యూకే

శేఖరం కూడా వస్తున్నాడని తెలుస్తుంది. అవీ ఇవీ కబుర్లు చెప్పుకున్న తరువాత "ఇంటర్వ్యూ చేసే పెద్దమనిషి శేషావతారానికి అభ్యర్థుల తెలివి తేటలతో పనిలేదు. తన వాళ్ళైతే చాలు ఉద్యోగమిస్తాడు. ఆయన నీ కులంవాడే. సమయం చూసి నువ్వు ఆయన కులం వాడినేనని చెప్పు. వారం తిరిగేసరికి నువ్వూ ఉద్యోగస్థుడివవుతావు" అని శేఖరం సలహా చెబుతాడు.

ఉద్యోగం కోసం వ్యక్తిత్వాన్ని చంపుకోవాలా అనే ఆలోచనలో పడతాడు ప్రకాశం.



మర్నాడు శేషావతారం దగ్గరికి వెళ్ళి "మీరు బ్రాహ్మణులనీ, బ్రాహ్మణులంటే మీకు సాఫ్ట్ కార్నర్ ఉందనీ తెలిసింది. అని తనకు ఉద్యోగం వచ్చేలా చేయమంటాడు. శేషావతారం బ్రూన్పడిపోయి కళ్ళలో నిప్పులు కురిపిస్తూ వెళ్ళగొడతాడు.

ఇదంతా జరిగాక రెండు రోజులకు శేఖరం నుండి ఓ ఉత్తరం వస్తుంది. తనకు ఉద్యోగం కావాలి గనుక అదెక్కడ ప్రకాశం పరమవుతుందోనని తనే శేషావతారం గురించి అబద్ధం చెప్పాననీ, కులంపేరు చెబితే ఆయన మండిపడతారని తెలిసే అలా ప్రకాశంతో మాట్లాడించాననీ, ఫలితంగా అర్హత ఉన్నా ఆ ఉద్యోగం ప్రకాశానికి దక్కక తనకు లభించిందనీ, తనను క్షమించమనీ శేఖరం రాస్తాడు.

ప్రకాశం ఎంతో బాధ పడతాడు. పద్మావతికి ఉత్తరం రాసి మిత్రుడు చేసిన దగా గురించి వివరిస్తాడు. ఆ సాయంత్రం లైబ్రరీ నుండి వస్తుండగా ప్రకాశం కాళ్ళకు ఓ గొలుసు తగలగా వంగి తీసుకుంటాడు. ఎవరిదో ఇద్దామని చుట్టూ చూస్తుంటే ఇద్దరమ్మాయిలు నేలను చూస్తూ, ఇసుకను కాళ్ళతో తుడుస్తూ వస్తూ కనిపిస్తారు. వివరాలడుగుతాడు ప్రకాశం. తన ఫ్రెండు కాంతి గొలుసు పారేసుకుందనీ, వెదుకుతున్నామనీ చెబుతుంది సరోజ. 'ఇదేనా' అని ప్రకాశం గొలుసు చూపిస్తాడు. అదేనని సంతోషంగా చెప్పి తీసుకుంటారు. తాము కాలేజీలో బి.ఎస్సీ ఫైనలియర్ చదువుతున్నామని పరిచయం చేసుకోగా, తను ఉద్యోగాన్వేషణలో ఉన్నానని చెబుతాడు ప్రకాశం. ఆంజనేయస్వామి గుడి దగ్గరే కాంతి ఇల్లనీ ఆమె తండ్రి పేరు శ్రీనివాసరావనీ, వాళ్ళింటికి రేపు రమ్మనీ ఆహ్వానిస్తుంది సరోజ.

ఓ రోజు చలమయ్య కన్పిస్తాడు. అల్లరి చిల్లరిగా తిరుగుతూ పదవ తరగతిలో అనేకసార్లు ఫెయిలైన చలమయ్య డిగ్రీ పొందినవారు తప్ప చెయ్యలేని ఉద్యోగం చేస్తుండటం చూసి ఆశ్చరపోతాడు ప్రకాశం. మర్నాడు ప్రకాశం వెళ్ళగానే ఘన స్వాగతం చెబుతాడు. స్నేహితులకు పరిచయం చేసి ఫ్యాక్టరీ చూపిస్తాడు. విందు భోజనం ఏర్పాటు చేస్తాడు. "నాకు ఉద్యోగం ఇప్పించు చలమయ్యా! నీ మేలు మర్చిపోను" అంటాడు ప్రకాశం. సరేనన్న చలమయ్య, "నాకో ఉపకారం కావాలి మరి! అవును ప్రకాశం! మనకు చదువంటే మంట. ఎదవ చదువు ఎక్కి చావలేదు. ఇప్పుడు క్వాలిఫికేషన్ పెంచుకోకపోతే ప్రమోషనివ్వనంటున్నాడు మేనేజర్. వచ్చే నెల్లో నా తరఫున నువ్వు పరీక్ష రాసి పారేస్తే నేను పాసవుతాను. నాకీ పనిచేస్తే నీకు ఉద్యోగం ఇప్పిస్తా" అంటాడు. ప్రకాశం భయపడగా "గుమస్తాలకూ, ఇన్విజిలేటర్లకీ డబ్బు పారేసి,. సంగతంతా నేన్చూసుకుంటా"

అంటాడు చలమయ్య.

భయపడుతూనే చలమయ్యకు బదులు తను హాలుకెళ్ళి పరీక్షలు రాసి వస్తాడు ప్రకాశం. కానీ చివరికి చలమయ్య ఉద్యోగం ఇప్పించకుండా తప్పించుకుంటాడు. కాంతి వాళ్ళింటికి వెళ్తాడు ప్రకాశం. వాళ్ళ నాన్న శ్రీనివాసరావు ప్రకాశాన్ని ఈసడించుకుని పంపించేస్తాడు. తండ్రి తనకు సంబంధాలు చూస్తున్నాడనీ, త్వరగా ఉద్యోగస్థుడవైతే మనం పెళ్ళి చేసుకుందాం. లేదా నేనక్కడికి వచ్చేస్తా. వ్యాపారం చేద్దాం" అని ఉత్తరం రాస్తుంది సీత. ఈ విషయం తెలిసి సీత తండ్రి వచ్చి ప్రకాశాన్ని తిట్టి వెళ్తాడు. తన కూతుర్ని ప్రకాశం లేవదీసుకుపోతానన్నాడంటూ అతడి తండ్రికి ఫిర్యాదు చేయగా కొడుకును తిట్టాలని నగరానికి వస్తాడు గోపాలరావు. ప్రకాశం చిన్నాన్నగారమ్మాయి రాణి పెళ్ళి జరుగు తుంది. పెళ్ళికి పెళ్ళికూతురి ఫ్రెండ్స్‌గా సరోజ, కాంతి వస్తారు. మిత్రులు కలిసి కబుర్లు చెప్పు కుంటారు. కాశీ నుండి పద్మావతి వస్తుంది. ఓ చిన్న కంపెనీలో అతి తక్కువ జీతానికి పనికి కుదిరిన ప్రకాశం మేనేజ్‌మెంట్ తమకు సరైన జీతాలివ్వక అన్యాయం చేస్తోందని వర్కర్లతో పాటు సమ్మె చేస్తాడు. సీత తండ్రి, ఆ ఫ్యాక్టరీ ఓనరు కలిసి ప్రకాశంపై పోలీస్ కేసు పెట్టగా అరెస్టు అవుతాడు ప్రకాశం. పద్మావతి అన్న య్యే పోలీస్ అధికారి. అయినా అరెస్టు చేస్తాడు. పద్మావతి తన లెక్చరర్, ప్రకాశం చిన్నాన్న కొడుకైన రాఘవ సహాయంతో ప్రకా శాన్ని బెయిల్‌పై విడిపిస్తుంది. తను ప్రకా శాన్ని ప్రేమిస్తున్నానని కాంతి అబద్ధం చెప్పి తండ్రి నమ్మేలా చేస్తుంది. కూతుర్ని వదిలేస్తే ఉద్యోగమిస్తానంటాడు శ్రీనివాసరావు. అలా తన కంపెనీలో ఉద్యోగమిస్తాడు. కాంతి పెళ్ళి వేరే వ్యక్తితో జరిపించాక ప్రకాశాన్ని ఉద్యోగం నుంచి తీసేస్తాడు.

పద్మావతి అన్న సుధాకర్‌కు కూడా తన చె ల్లెలు, ప్రకాశంల స్నేహం నచ్చదు. "స్నేహాని కైనా, దేన్నికైనా సమాన హోదా చూసుకోవడం మంచిది. మీకు మాకు పొత్తు కుదరదు. మీరు మమ్మల్ని అంటరానివారిగా చూస్తే మేం మిమ్మల్ని అందనివారిగా చూస్తాం. పద్మావతి నిన్ను పెళ్ళాడాలనుకుంటే ఆ ఊహే చాలా ప్రమాదం" అంటాడు హెచ్చరిస్తూ.

"మేం స్నేహితులం మాత్రమే, మా మధ్య కొత్త అనుబంధాలేం లేవు" అని ప్రకాశం చెప్పినా నమ్మడు.

ప్రకాశం ఇల్లు చేరేసరికి గుమ్మం దగ్గర సీత కూర్చునుంటుంది. తనకు అన్నం, నీళ్ళి వ్వకుండా తండ్రి తనను గదిలో పడేసి తాళం వేస్తే పనిమనిషి సహాయంతో బయ టపడి రైలెక్కి వచ్చానని చెప్పి బావురుమం టుంది.

"ఆకలి, నిరాశ, నిస్పృహలతో ఇద్దరం యుద్ధం సాగిద్దాం. ఈ క్షణంవరకు పోరాటం నా ఒక్కడి వంతే ననుకున్నాను. నువ్వు తోడుగా వచ్చావు. పిడికిలి బిగిద్దాం. ఈ లోకం నిప్పులు చెరిగినా ఇక భయప డను" అంటాడు ప్రకాశం. బెనారస్ వెళ్తున్న పద్మావతికి సెండాఫ్ ఇచ్చి వస్తానని వెళ్తాడు ప్రకాశం. సీత తలుపు వేసుకోవడానికి రాగా దూరం నుండి వస్తున్న తండ్రి కన్పిస్తాడు. వెంటనే పక్కసందులోకి వెళ్ళి ఏదో బస్సెక్కి రైల్వే స్టేషన్‌లో దిగుతుంది. తండ్రి అక్కడికీ వచ్చి సీతను లాక్కుపోతాడు. పద్మావతిని రైలెక్కించి వస్తున్న ప్రకాశం చుట్టూ రౌడీలు నిలబడి చితకబాదుతారు. రక్తస్నానం చేయి స్తారు. ఏం జరుగుతుందో అర్థంకాని స్థితిలో ప్రకాశం రోడ్డుమీదికి జారిపడటంతో నవల సమాప్తమవుతుంది.

గుండె ధైర్యంతో యువత ముందుకు సాగినా ధనబలం ముందు, స్వార్థ మనస్త త్వాల ముందు ఓడిపోతుంటారు. పరిస్థితు లకు దారితీసే సంఘటనలను వాస్తవానికి దగ్గరగా ఉండేలా చిత్రించారు రచయిత ఈ నవలలో.






## అంతరంగ మథనం

(మొదటి బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)

రచయిత అంతరంగ మథనం నుండి పుట్టిన అద్భుతమైన నవల "సరస్వతీ నమస్తుభ్యం"

సమాజంలో జరుగుతున్న ఘోరాలకు చక్కటి సమయస్ఫూర్తితో కథానాయకుడయిన భాస్కర్ ద్వారా పరిష్కార మార్గాన్ని సూచించాడు రచయిత. ముందుగా ఆత్మహత్య చేసుకోబోతున్న కథానాయకుడికి 'శారద' అనే వేశ్య ద్వారా సదుపదేశం కలిగించాడు. ఎంతోమంది జీవితాలకు వెలుగులను ప్రసాదించే ఆయుధాలు నీ దగ్గర ఉన్నాయి అని ఆ విధివంచితురాలయిన స్త్రీ చేత జ్ఞానబోధ చేయించాడు. సోదరికాని సోదరి చేసిన దిశానిర్దేశంతో భాస్కర్ ఇంగ్లీషు అధ్యాపకుడిగా ఎందరో విద్యార్థులను ఆదర్శప్రాయులుగా తీర్చిదిద్ది మార్గదర్శి కాగలిగాడు. విద్యార్థులకు పరివర్తన కలిగించిన అత్యంత ప్రతిభాశాలి. ఓ క్యారికేచర్‌ని అద్భుతంగా గీచిన మురళిలోని పనితనాన్ని గుర్తించి అతణ్ణి మంచి కళాకారుడిగా తీర్చిదిద్దిన ప్రజ్ఞాశాలి. తనకు కీడు చేయతలపెట్టిన నేతాజీని ఆదర్శ విద్యార్థిగా మలచిన తీరు అద్భుతం.

కళాశాలలో ర్యాగింగ్ భూతానికి బలవుతున్న పతంజలిని తన సహచరుల గణం ద్వారా పరిపక్వతను తీసికొనివచ్చిన నేర్పరి. ఆప్తమిత్రులైన రామదాసు, శాస్త్రిల మధ్య పెనవేసుకొన్న మైత్రీబంధం చదువుతుంటే కళ్ళు చెమరుస్తాయి. అధికారం ఉందికదాని నేటి కాలంలో తమ బంధువర్గం ఎన్ని అకృత్యాలకు పాల్పడుతున్నా వారిని వెనకేసుకొని అండగా నిలుస్తున్నవారికి ఈ అంశాలు కనువిప్పు కలిగిస్తే రచయిత ఆశయం నెరవేరినట్లే. భాస్కర్ సుకుమార్‌బాబులో పశ్చాత్తాపాన్ని తీసికొని వచ్చిన మంచి మనిషి. పల్లెటూరులో జరుగుతున్న ఘోర దారుణాన్ని తన శిష్యబృందంతో అరికట్టి అందరి అభిమానాన్ని సంపాదించిన ప్రేమమూర్తి. తనను వలచిన కుసుమాంజలిని పరిణయమాడి, తన ఆరాధ్య దేవతకు, తన కుమారుని నామంతో కృతజ్ఞతలు చెప్పుకొన్న వ్యక్తి. సమాజంలోని కుళ్ళును ఎలా కడిగివేయవచ్చున్నది ఈ కథాగమనం ద్వారా మన కళ్ళకు కట్టినట్లుగా రూపకల్పన చేసిన రచయితకు అభినందనలు.

– ఎన్. విజయలక్ష్మి, ఒంగోలు

## మంచి నవల (రెండవ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)

'సరస్వతీ నమస్తుభ్యం' ఆద్యంతం ఆసక్తిగా, ఆపనీయకుండా చదివించింది.

జీవితంలో అశాంతిపాలై ఆత్మహత్య చేసుకుందామని నిర్ణయించుకున్న భాస్కర్‌ని శారద ఆదుకుని అతడి జీవన గతిని మార్చింది. ముళ్ళబాటలో చిక్కుకున్న అతడిని పూలబాట వైపు నడిపించింది.

భాస్కర్ పాత్ర ఎంతో వైవిధ్యంగా, ఔచిత్యంగా ఉంది. ఈ వేగవంతమైన కాలంలో ఒకరికి మంచి చేయాలనే భావన ఎందరికి

కలుగుతుంది? ఎంతసేపూ సాధ్యమైనంత ఎక్కువ ధనార్జన చేసి తమ తమ బొక్క సాలు నింపుకుందామని తప్ప పక్కవాడి బాగోగులు ఎవరికి కావాలి? భాస్కర్‌లా న్యాయం కోసం పోరాడేంత సాహసం ఎవరికుంటుంది? భాస్కర్‌కి అంత ధైర్యం రావడానికి కారణం, అతడు మృత్యువు అంచువరకూ వెళ్ళి వచ్చాడు కనుక. మృత్యుముఖం వరకూ వెళ్ళినవాడికి ఎంతటి సాహసమైనా చెయ్యగలిగే ధైర్యం ఉంటుంది. అతడు పొరుగువాడి బాధను తన బాధగా భావించాడు. దాన్ని తన సొంత విషయంలా స్పందించాడు.

కథలో సీరియస్‌నెస్, హ్యూమరూ సమపాళ్ళలో వున్నాయి. భాస్కర్, కుసుమాంజలిల ప్రేమ కథ బావుంది. చివరికి శారద కనిపించడంతో భాస్కర్ పొందిన ఆనందం చదువుతుంటే కళ్ళు చెమర్చాయి. నవల నవలలా కాక 'చిత్రకథలా విసుగు లేకుండా చదివించింది. రచయితకు అభినందనలు.

– ఏ.లక్ష్మి, హైద్రాబాద్

## చదువులతల్లి కల *(మూడవ బహుమతి రూ. 75/– పొందిన సమీక్ష)*

వేదకాలం నుంచీ మన భారతావనిలో గురుశిష్య సంబంధం అనిర్వచనీయమైనది. తల్లిదండ్రుల మాటను మించి గురువాక్కు అనుల్లంఘనీయమై శిష్యుల హృదయాలలో భాసించేది. అప్పటి గురుశిష్య సంబంధాలు కాస్తో కూస్తో ఇప్పటికీ వుంటే బాగుండునన్న ఆశ నిర్మలచిత్తులయిన మానవులలో నశించిపోలేదు. 'సరస్వతీ నమస్తుభ్యం'లో అటువంటి ఆశ చిగుళ్ళతో, పువ్వులతో, ఫలాలతో, ఊడలతో విస్తరించి, పాఠకులలో కూడా ఓ కమ్మటి ఆశని కలిగించేలా రూపుదిద్దుకుంది.

భాస్కర్‌లాంటి ఆదర్శ ఉపాధ్యాయుడు, మాధవాచార్యులవంటి పండితోత్తముడు, నేతాజీ, మురళి, నరసింహులు, రామిరెడ్డి, పతంజలి వంటి ఆదర్శ విద్యార్థులు. సుకుమార్‌లాంటి చీడపురుగులు, నాగుబాబు లాంటి దుష్టులు ఇంతమంది విభిన్నుల మధ్య సరస్వతీదేవి గర్వంగా చిరునవ్వు నవ్వుతూ తల ఎత్తుకుని తన బిడ్డలమీద కరుణ కురిపించాలంటే తప్పనిసరిగా మంచి వాళ్ళ మెజారిటీ పెరగాలి. శిష్యులు గురువుల్ని గౌరవించటం నేర్చుకోవాలి. శిష్యులకు గురువులు ఆదర్శప్రాయంగా మెలగాలి. ర్యాగింగ్‌లాంటి విష సంస్కృతులు కళాశాలల్లో కనుమరుగు కావాలి.

ప్రతి విద్యార్థీ, ఉపాధ్యాయుడూ కళాశాలను వదిలి వెళ్ళేలోపు కొన్నయినా మంచి పనులు చేయాలన్న దీక్షాకంకణధారులు కావాలి. అప్పుడే రచయిత కన్న అందమైన కల నిజమవుతుంది.

– వి. పద్మప్రియ, అనంతపురం

## ఆత్మస్థైర్యం *(నాలుగవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

చదివించే గుణం, సామాజిక ప్రయోజనం అన్నీ ఉన్న నవల లబ్ధ ప్రతిష్ఠుడైన తులసి బాలకృష్ణగారి "సరస్వతీ నమస్తుభ్యం" ఆపకుండా చదివించింది.

నిరాశతో ఆత్మహత్యకు ప్రయత్నించిన ఓ యువకుని గుండెనిండా ఆత్మస్థైర్యం నింపి జీవితాన్నివ్వడమే కాకుండా అతడు మరెందరికో జీవితాన్నిచ్చేలా చేసిన శారద, ర్యాగింగ్ భూతానికి బలై కోలుకొన్న పతంజలి, లెక్చరర్ కామదాహానికి బలైన లావణ్యా మన చుట్టు కన్పించే పాత్రలే. 'కరిగి వెలుగులనిచ్చు కొవొత్తులను చూసి త్యాగమ్ము నేర్చుకో' అన్న మహాకవి వాక్యాలకు ప్రతి రూపం శారద. సీరియస్‌గా సాగే కథలో సరదా

రొమాన్స్ కుసుమాంజలి ప్రేమాయణం... మావోయిస్టుల ఉదంతం కొద్దిగా సినిమాటిగ్గా ఉన్నా భాస్కర్‌ని హీరోగా నిలబెట్టాయి. ఆదర్శ ఉపాధ్యాయునిగా విద్యార్థుల వైఖరిలో మార్పు తెచ్చేలా భాస్కర్ చేసిన ప్రయత్నాలు - ఎక్కడా హుందాతనాన్ని కోల్పోనీకుండా ఉన్నాయి.

కేరికేచర్‌ని అద్భుతంగా గీసిన మురళిని ఆర్టిస్టుగా మలచడం, నేతాజీని లీడర్‌ని చేయడం, తనకు జీవితాన్నిచ్చిన శారద పేరును తన కుమారునికి పెట్టుకోవడం భాస్కర్ వ్యక్తిత్వానికి దర్పణం పట్టాయి. ఏమైనా ప్రతి ఒక్కరూ తమ జీవిత ప్రయోజనాన్ని గుర్తించాలని సందేశమిచ్చిన మంచి నవల ఇది.

**–పోటు హైమవతి**, మంచిర్యాల

## వంద వందనాలు *(పదవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

"సరస్వతీ నమస్తుభ్యం" నవలలో నన్ను బాగా ఆకట్టుకున్న పాత్ర శారద. 'మనిషై పుట్టాక చేతనయినంతవరకూ పోరాడాలి. కష్టాల్లోనే సుఖాన్ని వెతుక్కోవాలి... పర్సనాలిటీ, యవ్వనం, సంపూర్ణారోగ్యం, ఆలోచించే మెదడు, కష్టపడే ఓపిక, ఆవేశంతో పొంగే రక్తం, అన్యాయాన్ని చూడలేని కళ్ళు నీ సైన్యాలు. పిరికి మనసు నీ సైన్యాధిపతి లాంటి చక్కటి భావస్ఫోరకమైన మాటలతో భాస్కర్‌ను ఆత్మహత్య నుంచి విముఖుణ్ణి చేసి, జీవితేచ్ఛను రగిల్చి దిశానిర్దేశం చేస్తుంది శారద. ఈ అమృతోపమానమైన శారద గీతోపదేశం భాస్కర్‌లో బాగా పనిచేసి అతణ్ణి ఆపాదమస్తకం మార్చివేసి నూతనోత్తేజంతో ఆహ్లాదంగా, హుషారుగా, నిటారుగా నిలబడేలా, నిలదొక్కుకునేలా, తలెత్తుకుని జీవిత సమరాంగణంలోనికి ఉత్సాహంగా ఉరికేలా చేస్తుంది.

మాధవాచార్యులు దుఃఖాన్ని రూపుమాపటం, మురళిలోని ప్రతిభని గుర్తించి ప్రోత్సహించటం, నేతాజీకి అన్నం పెట్టి మరీ బతుకు 'పాఠం' నేర్పటం, బస్సు తగలేయడానికి వచ్చిన కమాండర్ విశ్వం చేతనే లాల్ సలాం చేయించుకోవటం, ర్యాగింగ్ భూతం నుంచి పతంజలిని పరిరక్షించటం, పల్లెటూరు బాధను బాపి ఫొటో స్టూడియోని ధ్వంసం చేయించటం లాంటి ధీ(హీ)రోదాత్త లక్షణాలతో భాస్కర్ నవలంతా మధ్యందిన దినకరునిలా వెలిగిపోతాడు.

అన్ని సంఘటనలకూ మూలమైన ఓ మామూలు వెలయాలు భాస్కర్ పాలిట అపర'శారద' అయి అతని గుండెలతోపాటు పూజా గదిలోనూ 'వెలలేని' స్థిరమైన చోటు సంపాదించటం అద్భుతంగా చిత్రించారు.

**–అబ్దుల్ అజీజ్ పండిట్**, పెద్దమందడి

Owned, Printed, Published and Edited by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, D.No.7-134/1&2, Moosapet Village, Balanagar Mandal, Kukatpally-500 072, Ranga Reddy District. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982818; Chennai: 28232390; Bangalore:25583804. & www.eenadu.net.

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd No. H/HD/965/2006-2008 RN1/32186/78